# ఆంధ్రహితోపదేశ చంపువు

'మహామహోపాధ్యాయ'

'కళాప్రపూర్ణ'

వేదము వేంకటరాయశాస్త్రి.

ప్రకాశకులు:

వేదము వేంకటరాయర్స్,

4, మల్లికేశ్వరపేట్, జి. టి. మదరాసు.

౧౯౩౪

(శ్రీ)

అస్మత్పితామహులు, బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారు బహుకాలముక్రిందట రచియించిన యీ సాంధ్రమహాశ్లోకదర్పణపు ముద్రణచరిత్రము నామమాత్రము (శ్రీ) గునుపాటి యేనాదిరెడ్డిగారు తమ 'విన్నపము'న వ్రాసిచ్చియున్నారు. మరల నిచట యూఁతయుఁ జేసికొనుట చర్విత చర్వణము.

నేఁటికి యీ గ్రంథము ముద్రితమగుట యిట్లు వెలయుటకు సాహాయ్యమొసఁగిన భాషాశాసనప్రతినిధుల కెంతయు నా కృతజ్ఞతను సవినయముగఁ దెలుపుకొనుచున్నాఁడను. మహాశయులగు వారెల్లరు నీప్రకారము వాఙ్మయసేవచే నిరంతరము వెలుఁగొందుదురు.

మా తాతగారి వెనుకటి గ్రంథముల నాంధ్రలోక మాదరించినది. అట్లే యీ క్రొత్తకృతిని సహిత మాదరింప నభిలషించెదను.

చెన్నపురి
౧౫-౬-౧౯౩౩

వేదము వేంకటరాయఁడు.

శ్రీ

# ఆంధ్రహితోపదేశ చంపువు

---

## ప్రస్తావిక

క. శ్రీకాంతుని కృప పెంపున
నీకబ్బము నేర్పుఁగాత హిత మెల్లరకున్,
శ్రీకంఠు కటాక్షంబున
నాకాంక్షితసిద్ధి నొంది యలరుత సుజనుల్. ౧

క. సిరియన్న వంక యెవ్వని
శిరమున మిన్నేటినుఱువుఁజీలికయో నా
నిరవొందు వానికృపచేఁ
బొరయుత సజ్జనులు సాధ్యమున సంసిద్ధిన్. ౨

క. తివుటన్ హితోపదేశము
నవధారణ సేయువారి కమలోక్తులఁ బా
టవ వైచిత్ర్యంబులు నీ
తి విద్యలో నిరుపమంపుఁ దేజును గలుగున్. ౩

*ఆ. జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁ గూర్పఁ దలఁప వలయు;

ధర్మ మాచరింపఁ దగు మృత్యుచేఁ దల
పట్టి యీడ్వఁబడినవాఁడు వోలె. ౪

ఆ. ముచ్చుచేతఁ బడదు, మూల్యంబు లేనిది
యిడినకొలఁదిఁ దఱుఁగ కెచ్చుచుండు;
దానఁ జేసి యెల్లధనములయందును
విద్యఁ బోలుధనము వేఱు లేదు. ౫

తే. నీచగయు విద్య దుర్ధర్ష నృపతిఁ జేర్చు
నససిఁ గాని తెచ్చి, కడలిని నదియుఁబోలె;
ఇంకమీఁదట వాని కా యధిపు వలన
ఫలము సేకూరెడిని భాగ్యవశము గాఁగ. ౬

*తే. విద్య యొసఁగును వినయంబు, వినయమునను
బడయుఁ బాత్రతఁ, బాత్రతవలన ధనము,
ధనమువలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుఁడు. ౭

ఆ. శస్త్ర మొక్కవిద్య, శాస్త్రంబు నొకవిద్య,
నేర్పుకొఱకు రెండు నెగడుచుండు;
అందు శస్త్రవిద్య హాస్య మౌ ముదిమిని,
సతము గౌరవంబు శాస్త్ర మెనయు. ౮

ఆ. గుణము లన్ని మొందుకొనుఁ బండితునియందు,
మూర్ఖునందు దోషములె వసించుఁ;
గాన వేలకొలఁదు లైన మూర్ఖులకన్న
నొక్కపండితుండె యెక్కుడెందు. ౯

*క. నవభాజనమున లగ్నం
బవు సంస్కారంబు వొలియు, దటుగావున మా
ణవ్రులకుఁ గథాచ్ఛలంబునఁ
జవి యుట్టఁగ నీతివచనసరణిఁ దెలిపెదన్. ౧౦

తే. మిత్త్రసంప్రాప్తియును, మఱి మిత్త్రభిదయు,
విగ్రహమ్మును, సంధి, నా, విశదఫణితిఁ,
బంచతంత్రంబునుండి, యాపగిది నొండు
కబ్బములనుండి తెచ్చి యీకథలు గూర్తు. ౧౧

గంగాతీరమునఁ బాటలీపుత్త్రి మను పేర పట్టణమొకటి కలదు. అందు సర్వస్వామిగుణోపేతుఁడు సుదర్శనుఁ డను రాజు ఏలుచుండెను. ఆయన యొకనాఁడు ఈక్రింది రెండుశ్లోకములను ఎవ్వరో పఠింపఁగా వినెను:-

*క. పలుసందియములఁ దొలఁచును,
వెలయించు నగోచరార్థ విజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర మయ్యది
యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడుజగతిన్. ౧౨

*క. పరువంబు, కలిమి, దొరతన,
మరయమి, యనునట్టి వీనియం దొకఁడొకఁడే
పొరయించు ననర్థము నాఁ;
బరఁగినచో నాల్గుఁ జెప్పవలయునె చెప్పుమా. ౧౩

ఈసూక్తములను విన్నవాఁడై యారాజు తనకుమా

రులు శాస్త్రము చదువక నిత్యము తప్పుదారిని వర్తించు
చున్నందులకు వనటం జెంది యిట్లు తలపోసెను:—

ఆ. పండితుండు ధార్మికుండుం గానిసుతుండు
పుట్టి యున్న మాత్ర పోణి యేమి?
అవిటికన్ను సౌఖ్య మబ్బంగనిచ్చునే
పీడం గుడిపి యేడ్పు వెట్టుగాని. ౧౪

ఆ. పుట్టనతండు, మృతుండు, మొప్పె, యన్మువురలో
నాద్యసుతులె నాకె మంత్యుకన్న;
మృతుం డజాతకుండు వెతం గూర్తు రొకమాటె,
సతము మొప్పెకొడుకు వెతలం గుడుపు. ౧౫

ఆ. వాండె పుట్టుగన్నవాండు సు, మెవ్వాని
పుట్టువలనం గులము పొందు ఘనత;
బండిగల్లు వోలె భ్రమయు సంసృతిలోనం
గిట్టినాతం డెవండు పుట్టకుండు? ౧౬

తే. గుణిగణంబును లెక్కింపం గణంగినంత
వడివడిగ వేస్కై బలపంబు వడదొ,
వానిచేం దల్లి దాం బుత్రవతియయేని,
గొడ్డురా లింక నెవతొ వాక్రువ్వు మిత్ర! ౧౭

మఱియు,—

ఆ. ధనముం గూర్చ, నీయం, దపసింపం, జదువంగ,
విక్రమింప, నెవండు వేగపడండొ,

వాఁడు తల్లి కడుపు వ్రయ్యంగఁ బుట్టిన
గడ్డయగునుగాని బిడ్డ గాఁడు. ౧౮

మఱియు,—

క. గుణి యొకఁడె చాలుఁ బుత్త్రుఁడు,
గుణహీనులు సుతులు వేలకొలఁదియు నేలా?
అణచుం దిమిరము నొకశశి,
గణనాతీతంబు చుక్కగమి యేమిటికిన్. ౧౯

ఆ. పూని యెచటనేని పుణ్యతీర్థమునందు
సరిదితపము లెవఁడు జరపినాఁడొ,
వాని కబ్బు సుతుఁడు వశ్యుండు, ధనికుండు,
ధర్మతత్పరుండు, తత్త్వవిదుఁడు. ౨౦

ఇట్లునుం జెప్పుదురు:—

క. నిచ్చలుఁ గలిమి, యరోగత,
నెచ్చెలి, ప్రియమాడుజాయ, నిరతంబును దా
మెచ్చ నడచు పుత్త్రుఁడు, ధన
మిచ్చునెఱుక - యాఱు - సుఖము లీలోకమునన్.

మఱియు,—

ఆ. గాదె నించుతూముగాం ద్రగు కొడుకులు
పలువు రున్న యొక్కభాగ్య మగునె?
తండ్రిపేరు విశ్రుతంబు సేసెడువాఁడు
కులముఁ బ్రోచుకొడుకు కొడుకొండె చాలుఁ. ౨౨

ఆ. అప్పు సేయుతండ్రి, యన్యగామిని తల్లి,
యందములకు నిక్క మైనయాలు,
చదువు లేక తిరుగు జజ్జరకొడుకును,-
వీరికన్న రిపులు వేఱు లేరు. ౧౩

ఆ. కఱవనట్టివిద్య, యఱుగని భోజనంబు,
ముదుకపతికి వయసు ముదువు లాఁడి,
పేద కోలగమునఁ బాదం బిడుటయును;
విసము గాని, విసము విసము గాదు. ౧౪

క. ఎట్టిమహితునికిఁ బుట్టిన,
నెట్టన నిర్గుణుఁడు పూజనీయుఁ డగునే?
ఎట్టిసువంశము నైనను
వట్టి ధనువు గుణము లేక వ్యర్థంబె కదా. ౧౫

క. చాలఁగఁ గడపితి విమ్ముగ
బాలక, శేల్ వగళు లేమి పఠియింపకయే;
కూలెద వకటా! విజ్ఞుల
యోలగమున, గ్రుడ్డిపసర ముబ్బలిఁ బోలెన్! ౧౬

ఈస్థితిలో ఈనాపుత్త్రులను నే నెట్లు గుణవంతులం జేయఁగలను?

ఆ. తిండి, నిద్ర, భయము, తియ్యవిల్తుని కేళి
సమము నరులకును, బసరములకును;

అందుఁ బాడి నరుల కధికమ్ము, గావునఁ
బాడిలేని నరుఁడు పశుసముండు. ౨౭

క. ఒకటియును లేదు ధర్మా
ర్థ కామ మోక్షంబులం దెతని కాతనిపు
ట్టుక మేఁకమెడను గలచను
ప్రకారమునఁ బుడమియందు వ్యర్థంబకదా. ౨౮

ఈక్రింది యట్లు చెప్పినవారునుం గలరు:—

ఆ. ఆయు వనఁగఁ, గర్మ మనఁగ, విత్తంబు నా,
విద్య నాఁగఁ, జచ్చువిధము నాఁగ,
విధి నొసట నువ్రాసె, నీని చేనింటిని
గడుపులోన నున్నకాలమందె. ౨౯

మఱియు,—

క. తప్పక కలిగెడుభావము
లప్పప్పా, తప్ప వేమహాత్ముల కైనన్,
కప్పు మెడవాని దిసమొల
యప్పద్మారమణు నహిశయనము గుఱులుగాన్. ౩౦

మఱియు:—

క. కానిది కానే కా దని
కా నున్నది కాకపోదు గద యనియును, నీ
జ్ఞానము చింతావిషమును
దా నున్మూలించుమందు, త్రావుడు దీనిన్. ౩౧

ఇది పనిచేయ సమర్థులు గాని సోమరులమాట.

కావున,—

క. దైవమునే తలపోయుచుఁ
దా వర్జింపంగఁ జనదు తనజతనములన్,
నావులను గాన్గ నాడక
యేవగ నబ్బెదును నూనె యిసుమం తేనిన్. 3౨

మఱియు,—

చ. జతనము సేయునప్పురుష
సత్తము లక్ష్మి యనుగ్రహించెదున్;
'జతనము మాను, దైవమె యొ
సంగును జుమ్మని మూర్ఖుఁడాడెదున్;
జతనము శక్తికిం దగిన
చాడ్పునఁ జేయుము; త్రోయుదైవమున్;
జతన మొనర్చినన్ సిరి సొ
సంగనిచోఁ దానఁ గేమిచెప్పుమా. 33

మఱియు,—

ఆ. సిద్ధి బండి కెపుడుఁ జెఱి యొక్క కల్లుగా
దైవపౌరుషములు దనరుచుండు,
కండ్లు రెండు దొరలఁ గాని సాగదు బండి
కానఁ బౌరుషంబుఁ బూనవలయు. 3౪

క. మునుపుట్టువునం జేసిన
పని దైవం బని వచింత్రు పరమ మునీంద్రుల్,

# ప్రస్తావిక

విను, పురుషకార మనఁగను
దనయిప్పటి జతన, రెండుఁ దాఁకిన ఫలమౌ. ౩౪

ఆ. ఇచ్ఛమై కులాలుఁ డేమేమొ రూపుల
మంటినే రచించు మాడ్కి మీఱఁ,
దనరచించినట్టి పనినె తా నిపు డొందు
ననుభవముగఁ బురుషుఁ డొనరిచికొను. ౩౫

ఇదియునుంగాక,—

క. కనులకుఁ దోఁచుచుఁ బెన్నిధి
తనప్రోలనె యున్నఁ గాకతాళీయముగాఁ,
దనచేతిత్రోడఁ దానే
కొనవలయుంగాక విధియె కొని యిడదు కయిన్. ౩౬

క. కోరికలచేత నే మగు
వారని యత్నంబు వలయు వరసిదులకున్,
కూరుకుసింగము నోరన్
గూరుకొనవు తమకుఁ దామె కోరి మృగంబుల్. ౩౭

అట్లే,—.

ఆ. తల్లి, తండ్రి కోరి, దండించి నేర్పంగ
బాలకుండు గుణముఁ బడయుఁగాని
కడుపునుండి జాఱిపడిన మాత్రాననే
పండితుండు గాఁడు బాలకుండు. ౩౮

ఆ. నిసుఁగునకును విద్య నేర్పింప కుండినఁ
దల్లి శత్రు వగును, దండ్రి వైరి;
అంచసమితియందుఁ గ్రించుఁ గొక్కెరవోలె
వాఁడు బుధులసభను వాసి డిందు. ౪౦

ఆ. రూపు, జవ్వనంబు, నేపు మీఱుచు నున్నఁ,
గులము నున్నతముగఁ గొనఁబుచున్న,
విద్య లేనివాఁడు విలసిల్ల నేరఁడు
తావి లేనిబంధుజీవము వలె. ౪౧

మఱియు,—

ఆ. చదువ లేదు గ్రంథసముదాయములయందు,
చదువలేదు గురుల సమ్ముఖమున,
వాఁడు సదసునందు భాసిల్ల నేరఁడు
జారగర్భ మైన నారివోలె. ౪౨

ఆ. సదసునందు వస్త్రసంవేష్టితుం డయి
యొంబనయుఁ గరంబు డంబు మీఱు,
అంత దాఁక మూర్ఖుఁ డలరారు నెందాఁక
నోరు దెఱచి మాట నుడువకుండు.' ౪౩

ఇట్లుతలపోసి రాజు పండితుల రావించి సభగావించెను. రాజు పలికెను :—“ఓపండితులారా, నావచనమును అవధరింపుఁడు; నాకుమారులు శాస్త్రజ్ఞానములేక నిత్యము తప్పుదారిం బ్రవర్తిల్లుచున్నారు. వారి కిప్పుడు నీతి

శాస్త్రోపదేశముచేత రెండవజన్మము చేయించువిద్వాంసుఁ డెవఁడేని కలఁడా? ఏలయన—

ఆ. గరుడపచ్చ వోలెఁ గాంతు ల్దువాళించుఁ
గాంచనంబుఁ గూడి గాజుపెంకు,
అట్లె సాధుజనులయొద్దఁ జేరిన యేని
మూర్ఖుఁడును ప్రబోధమును భజించు. ౧౧

పెద్ద లిట్లు చెప్పియున్నారు:—

ఆ. హీనజనులఁ గూడ హీనంబె యగుబుద్ధి
సములతోడఁ గూడ సమమె యగును;
ఉత్తములను గూడ నుత్తమంబేయగుఁ
గాన నుత్తములనె కలయు బాల.—" ౧౨

అంతట విష్ణుశర్మ యను మహాపండితుఁడు సకల నీతిశాస్త్రతత్త్వజ్ఞుఁడు బృహస్పతియుంబోలె నిట్లు వాక్రుచ్చెను—"దేవా, నీకుమారులు మహాకుల ప్రసూతులు, కావున వీరికి నేను నీతి నేర్పఁగలను. ఏల యన,—

ఆ. వచ్చువాని కేని వచ్చును జెప్పిన,
రానివానికైన రానె రాదు;
విసుగు లేక వేయి విధముల నేర్పినఁ
జిలుక వోలెఁ గొంగ పలుకఁ గలదె? ౧౩

మఱి యొకటి,—

క. ఏకరణిఁ జనియింపుదు
రీకులమునయందు గుణవిహీనులు పుత్త్రుల్ ?
ఏకరణి మానికంబుల
యాకరమున గాజుపెంకు లంకూరించున్ ? ౪౭

అందువలన నేను ఆఱునెలలలోపల నీకుమారులను నీతిశాస్త్రపారగులం గావించెద." రాజు ఆమాటను విని వినయముతో వెండియు నిట్లనియె:—

"క. సుమనస్సంగముఁ బొందిన
క్రిమియును వసియించు నృపకిరీటంబుపయిన్
సమనువృగ రాతునియ బుధు
లమరించిర యేని వేలుపై ప్రూజ గొనున్. ౪౮

మఱియు,—

ఆ. గుణులయందు నెపుడుగుణములు గుణములౌ
దోషులందు నవియె దోషములగు ;
తియ్యనదులఁ గూడి తియ్యన యగు నీరు
కడలిఁ జేరి యదియె క్షార మగును. ౪౯

కావున, యీనాకుమారులకు నీతిశాస్త్రము నేర్పు భార మునీది." ఇట్లు వచించి రాజు విష్ణుశర్మకు సత్కార పూర్వకముగా కుమారుల నప్పగించెను.

---

# మిత్రలాభము

అనంతరము విష్ణుశర్మ ఆ రాజపుత్త్రులను మేడమీఁద సుఖముగా కూర్చుండఁబెట్టుకొని వారితో ప్రస్తావక్రమమున నిట్లువచించెను.—"కుమారులారా, వినుఁడు:—

తే. విద్య యతిగుప్తవిత్తంబు, వృత్తికారి,
దొడ్డకన్ను, విదేశబంధువు, నరునకు,
సభనువశపర్చుఁ, దఱుఁగని సంబళంబు,
అధికరూపంబు; విద్య లేనతఁడు పశువు. ౧

ఆ. జహ్నుకన్య లేని జనపదం బదియేల?
చదువు లేని వంగసం బదేల?
కాన్ప లేనియట్టి కలకంఠియును నేల?
అకృతదక్షిణంబు యజ్ఞమేల? ౨

ఆ. కావ్యశాస్త్రములను గలవినోదములచేఁ
గాల మరుగు బుధనికాయమునకు,
ప్రముక్కడులకుఁ బ్రొద్దుముగియుఁ గయ్యములందు
నిద్రయందు వ్యసననిచయమందు. ౩

కావున మీకు వినోదార్థము కాకకూర్మాదులవిచిత్ర కథను వక్కాణించెదను." అంతట రాజపుత్త్రులు "ఆ కథనుచెప్పు"మని అడిగిరి. విష్ణుశర్మ వచించెను. "వినుండు మీరు, ఇప్పుడు మిత్రలాభము నారంభించెదను. అందు ఇది మొదలిశ్లోకము :—

తే. సాధనము లేక విత్త మ న్నాడ లేక
 మైత్రిచే బద్ధు లగు బుద్ధిమంతు లెలమి
 ఆత్మకార్యంబులను వేగ మధిగమింత్రు
 కాక కూర్మ హరిణ మూషకముల కరణి." ౪

"అది యెట్లని రాజపుత్త్రి లడిగిరి. విష్ణుశర్మ చెప్ప సాగెను.—

"గోదావరియొడ్డున గొప్పబూరుగుచెట్టు కలదు. అందు నానాదిగ్దేశములనుండియువచ్చి పక్షులు రాత్రి నివ సించును. అట్లుండ నొకనాడు తెల్లవాఱంగానే చంద్రుడు క్రుంక నుండఁగా లఘుపతనక మనుపేరి కాకి యొకటి వేఁట కాని నొకనిని అపరయమదేవుఁడో యన ఆచెట్టు కడకు వచ్చుచుండం గాంచెను. కాంచి యిట్లు తలపోసెను:— 'నేఁడు తెల్లవాఱంగానే పాపుదర్శన మయినది. ఇది యేమి కీడు సూచించునో యెఱుఁగను.' ఇట్లు తలపోసి చింతిల్లుచు వానివెంబడినే ఎగిరిపోయెను. ఏలన,

ఆ. శోకకారణము లనేకసహస్రముల్,
 భయనిమిత్తములును బహుశతములు,

వార కనుదినంబుఁ బైకొను మూర్ఖులఁ
బండితులను దఱియుఁ బాటుపడవు, ౫

ఇదియునుం గాక, విషయాసక్తులు ఇట్లు అవశ్యము చేయ వలయును. ఎట్లన—

ఆ. నిదుర లేచినంతనే దినదినమును
ఏమియడలు నేఁటికేఁచు నన్నుఁ ?
జావొ, నోవొ, శోకసందోహమో యని,
ప్రాలుమాల కరయవలయుఁ బుత్త్ర ! ౬

అనంతర మూ వేఁటకాఁడు బియ్యపునూకలం జల్లి వల రొడ్డి తాను దాఁగియుండెను. అంతట చిత్రగ్రీవుఁ డను కపోతరాజు సపరివారముగా ఆకాశమునం బోవుచు ఆనూకలం గాంచెను. తోడికపోతములును వానిం గాంచి, తిన నాశించినవి. అంతట దొర చిత్రగ్రీవుఁడు వానితో నిట్లనియె:—'మిత్రులారా, ఇట నిర్మానుష్య మగు నీ యడవిలో బియ్యపునూక లెట్లు వచ్చినవి? కనుక చక్కఁగా పరికింపుఁడు. వీని కాసించుట మేలునకుఁ గా దని నాకు తోఁచుచున్నది. ప్రాయికముగా ఈనూకలచేత,—

ఆ. కంకణంబుఁ గోరి పంకాన దిగఁబడి
లేచి వచ్చునోజ లేకపోవఁ,
బథికుఁ డొకఁడు ముసలివ్యాఘ్రంబుచేఁ బడి
మడిసినట్టిగతియె మనకుఁగల్గు.' ౭

'ఆకథయెట్లు?' అని పావురము లడిగినవి. రాజు చెప్పం దొడంగెను.—

కథ ౧.

"నేనొకప్పుడు దక్షిణారణ్యములో తిరుగుచు చూచితిని. ముసలిపులి యొకటి స్నానము చేసి దర్భలు చేతఁ గొని, చెఱువుగట్టున నిలిచి, ఒకబాటసారిం గని, 'ఓహో, తెరువరీ, ఇదిగో ఈబంగారకపుముఱుఁగును పుచ్చుకొమ్ము,' అని అఱచినది. అంతట నాతఁడు ఆశాపీడితుఁడై యిట్లు తలపోసెను,—'భాగ్యముచేత ఇది దొరకుచున్నది. కాని ప్రాణమును సందేహముపాలు కావించెడి యీపనిలో ప్రవేశించుట సరి గాదు. ఏలయనఁగా ;—

ఆ. ఇష్ట మబ్బినను ననిష్టునివలనను,
దానిచేతఁ గీడె తనకుఁ గలుగు ;
అహివిషంబుతోడి యమృతంబుఁ ద్రావినఁ,
జావె గల్గుఁ గాని సౌఖ్య మగునె? ౨

ఎక్కడను అర్థార్జనప్రయత్నములో సంశయము తప్పదు. అట్లని పెద్దలు చెప్పియున్నారు:—

ఆ. సంశయంబు మదిని నవదరింపకయున్న
మంగళంబు గాదు మానవులకు ;
సంశయంబు మదిని నవదరించినవెన్క
బ్రదికి యున్న సుఖముఁ బడయవచ్చు.

కావునం దీనిం బరికించెదను.' (ఇట్లాలోచించుకొని) ఆ తెరువరి బిగ్గరగా నడిగెను. 'ఏదీ, నీమురుగు?' అని. పులి చేయిచాఁచి చూపించినది. 'క్రూరహృదయమును నిన్ను నే నెట్లు నమ్ముదును?' అని బాటసారి యడిగెను. పులి చెప్పుచున్నది:- 'వినరా, ఓబాటసారీ, పూర్వము నేను యౌవనమదమున మిక్కిలి చెడునడువడి నడచుచుంటిని, నేను గోవులను, మనుష్యులను మిక్కిలిగా చంపితిని. ఆపాపముచేత నాభార్యయు, కుమారులును మృతిఁజెందిరి. నేను వంశహీనుఁడ నయితిని. అంతట నా కొకమహాత్ముఁడు దానధర్మములు సేయు మని యుపదేశించినాఁడు. ఆయుపదేశమువలన నేను ఇప్పుడు నిత్యము స్నానము సేయుచు, దానము లిచ్చుచు, ఉన్నాను; ముసలినైతిని; గోళ్లును, పండ్లును ఊడి పోయినవి. నన్ను నమ్మమి యెట్లు? ఏల యనఁగా;—

ఆ. వేల్మి యధ్యయనము వితరణంబు దపంబు
క్షమయు ధృతి యలోభసత్యములును,
ఇట్టి సాధుమార్గమే యష్టవిధముల
ధర్మ మనఁగ స్మృతులఁ దనరుచుండు. ౧౦

తే. అందుఁ బూర్వ చతుర్వర్గ మవనినాథ
డంబమునకైనను నొనర్తు రింబుగాను
ఉత్తరంపుఁ జతుర్వర్గ మూర్జితముగ
నరుదుగాఁ గేవల మహాత్ములందె యుండు. ౧౧

నాకు లోభము బొత్తిగా లేదు. అందువలననే నాచేతి యలంకారమయిన యీబంగారపు మురుగునే ఎవరికేని ఈఁదలఁచుకొంటిని. అయినను 'పులి మనుష్యులనుతినును' అను లోకవాదమును వారింప నెవ్వరితరము? ఏలయనఁగా,-

తే. మనుజులు గతానుగతులు, ప్రమాణముగను
ధర్మమునఁ దార్పఁగ త్తెసూక్తంబుఁ గొనరు;
గోఘ్నుఁ డైనను ద్విజుఁడు వాక్రొనెడుపల్కు
నమ్మికొని వానిబడి తారు నడచుకొంద్రు. ౧౨

నేను ధర్మశాస్త్రములం బఠించితిని. వినుము:—

ఆ. మాసరంపువాన మరుభూమియం దెట్లొ,
యన్న మెట్టిలో క్షుధార్తునందు,
లేనివాని కొసఁగు దానంబు నట్టులే,
సఫల మగును జుమ్ము శమనతనయ! ౧౩

క. తమకుం బ్రాణం బెట్లు ప్రి
యమొ పెఱభూతమ్ములకును నట్లే ప్రియమా;
తమసాటిచేతఁ బెఱభూ
తములందుఁ సాధుజనులు దాల్తురు కరుణన్. ౧౪

మఱియు,—

క. దానములోనం, బ్రత్యా
ఖ్యానమున, సుఖాసుఖప్రియాప్రియములలో,
స్వానుభవముచే నొరుల ప్ర
మాణముఁ దాఁ బూరుషుండు మది నరసికొనున్. ౧౫

మఱియు,

క. పరకాంతను దల్లినిగా,
పరధనముల మంటిబెడ్డపరిపాటినిగా,
పరభూతంబుల నెల్లన్
బరమాత్మునిగఁ జూచువాఁడు పండితుఁడు ధరన్. ౧౬

నీవు నిఱుపేదవు, అందువలన దీనిని నీకియ్యం గడంగితిని. పెద్ద లట్లే చెప్పియున్నారు:—

ఆ. ధర్మదేవతనయ, ధనహీనుల భరింపు,
మీశ్వరులకు ధనము నీయకయ్యా,
వ్యాధితునికి మందువలన సేమం బగు,
నీరుజునికి మందు నిష్ఫలంబు. ౧౭

మఱియు,—

ఆ. అనుపకారి యైనయట్టిపేదకు దేశ
సమయపాత్రములకు సమ్మతముగ
నిచ్చు టొప్పు ననుచు నిచ్చుట యేదియో
దాని సాత్త్వికప్రదాన మండ్రు. ౧౮

కావున ఈకొలనిలో స్నానము గావించివచ్చి సువర్ణకంకణమును గ్రహింపుము.'

అంతట దానిమాటలచే నమ్మకముకల్గి ఆబ్రాహ్మణుఁడు ఆశచేత, చెఱువులోనికి స్నానార్థము ప్రవేశించి పెనుబురదలో దిగఁబడి, పాఱిపోవుటకు అశక్తుఁడాయెను. అడుసులో

డిగఁబడిన యాతనిం జూచి పులి యిట్లనియె; 'అయ్యయ్యో! ఎట్టియూబిలోఁ బడితివి! నిన్ను లేవఁదివిచెదను లే!' అని పలుకుచు మెల్లగా దగ్గఱి పులి బాటసారిని పట్టుకొనెను. అంతట నాతఁ డిట్లు తలపోసెను.

ఆ. శ్రుతులు నేర్చుఁగాక, స్మృతులం జదువుఁగాక,
కూళ కేమొ దుష్టగుణము పోదు;
తీయనీటియేళ్ళు వేయివేల్ గలసిన,
జలధి కుప్పఁదనము పోలియునెట్లు? ౧౯

మఱియు,—

ఆ. శాంతి దాంతి లేనిజాల్ము సత్కర్మంబు
కరినిమజ్జనంబుకరణి వమ్ము;
కర్మహీన మయినజ్ఞానంబు భారంబు
దుర్భగాభరణము తోయముగను. ౨౦

కావున నేఁ జేసినది సరిగాదు, ఏలన, ఈ క్రూరజంతువును నమ్మితిని. అట్లే చెప్పిరి.—

ఆ. గోరులున్నవానిఁ, గొమ్ములు గలవానిఁ,
గేల నాయుధంబు గెరలువాని,
నదిని, రాజకులమునకు గేరువానిని,
నమ్మరాదు సుమ్ము నాతి, నెపుడు. ౨౧

ఇంకొకటి,

ఆ. ఎల్లరందునుం బరీక్ష్యంబు ప్రకృతియే,
ఇతరగుణము లరయ జతను వలదు;

ఎల్లగుణములకుఁ బ్రకృతి దానె నేత్రమై,
మూర్ధమందు నిలిచి మోహరించు. ౨౨

ఇంకనొకటి,

ఆ. జ్యోతులందుఁ దిరుగు, వే తేజులుగలాఁడు
గగనచారియతఁడు, కలుషహారి,
*విధుఁడు, రాహునోర విధివశంబునఁ జిక్కె,
నొసటివ్రాఁతఁ దుడువ వశ మెవరికి?' ౨౩

ఇట్లు శోకించుచుండఁగనే అతనిని పులి చంపి భక్షించినది. కావున నేను 'కంకణంబుగోరి' ఇత్యాది చెప్పితిని. కావున అన్నివిధములను విచారించికొనక యేపనినిగాని చేయఁగూడదు, ఏలన,—

క. అఱిగిన యన్నము, ధర్మముఁ
గఱచినతనయుండు, సేవఁ గన్ననృపతియుఁన్,
ఎఱిఁగివచించిన పలుకును,
నెఱిశాసిత సతియుఁ జెందనేరరు వికృతిన్.' ౨౪

ఈమాటలువిని ఒకపావురము గర్వాతిశయంబున నిట్లనియె:- "ఇసీ! ఏమి! ఇట్లుపలికెదవు?

తే. వృద్ధుఁ డాడుమాట వినవేవలయుఁ జుమ్మి
యలవిగాని సిలుగు వొలసివస్తు;

* "రవియు విధివశమున రాహునోటను జిక్కె"—పా.

అరయఁ గట్లు సేయ నగునెల్ల యెడలను
అన్నమందు మాత్ర మట్లుగాదు. ౨౫

ఏలయన,—

క. బోనములం బానములన్
మానక యన్నింట నలము మహిని భయంబుల్;
దేనఁ బ్రవర్తిల్లఁగఁ దగు?
మానుగ నిఁకఁ బ్రదుక నేమిమార్గము చెప్పుఁడా? ౨౬

అట్లు చెప్పినారు,—

ఆ. ఈసుగాఁ డతుష్టుఁ డేవగాఁడును గోపి
నిత్యశంకితుండు నిత్యమొకరి
భాగ్య మాశ్రయించి బ్రదుకుఁ జెందెడివాఁడు
పేర లాఱుగురును వెతఁ గుడుతురు. ౨౭

ఆమాటవిని కపోతములన్నియు ఆనూకలకడ వ్రాలి
నవి. ఏలయన,—

క. వరశాస్త్రనిచయధరులున్
పరుల మహాసంశయములఁ బాపెడువారున్
కరము వినికి గలవారున్
బోరిఁ బోరి నలయుదురు లోభమున కగ్గములై. ౨౮

మఱియు;—

క. లోభముచేఁ గ్రోధం బగు;
లోభముచేఁ గామమును గలుగు మోహంబున్;

లోభముచే నాశం బగు;
లోభముచే నఘము లెల్ల లోకమున నగున్. ౨౯

మఱియు;—

ఆ. కనకమృగముపుట్టు గన లేదు విన లేదు,
పట్టఁ బోయె రాముఁ డట్టిదానిఁ;
బ్రాయికముగ సిలుగు డాయ నున్నప్పుడు
బుధవరులకు నైన బుద్ధి చెడును.' ౩౦

వ్రాలుచునే అన్నియు వలలోఁ దగులు కొన్నవి. అంతట దేనిమాటవలన నట్లువలలోఁ దగుల్కొన్నవో దానిని కడమ యన్నియు చీకొట్టందొడంగినవి. ఏలయన,

'ఆ. గమికి నెప్పుడు నీవు గన్నాకు గాకుము,
సాధ్యమబ్బెనేని సమము ఫలము,
వెండి యట్లుగాక వీసరపోయిన
ముందునడచి నతఁడు ముప్పుఁజెందు. ౩౧

అట్లు చెప్పిరి;—

ఆ. ఇంద్రియముల నిగ్రహింపక వదలుట
యాపదలకుఁ జేరు పైనదారి,
తజ్జయంబు సంపదలకు మార్గం బగు,
నిష్ట మైనదాన నేఁగ వచ్చు.' ౩౨

అంత నట్లా పావురమును కడమపావురములు నిందించుటను విని చిత్రగ్రీవుఁడిట్లనియె:—'ఇది యాతని తప్పు గాదు; ఏలన,—

ఆ. ఆపదలు కడంగి యరుదెంచు వేళల
హేతు వగును బ్రాణహితుఁడు గూడ,
పాలు పిదుకువేళ వత్సంబునకుఁ గట్టఁ
దల్లి పిక్క గాదె స్తంభ మగును. 33

మఱియొకటి,—

క. ఆపన్నులైనవారల
నాపదఁ దొలఁగించి కాచు నతఁ డాప్తుఁ డగున్;
ఆపత్ప్రాప్తుల భీతులఁ
జేపట్టక దూఱువాఁడు చెన్నఁటియ సుమా. 34

ఆపత్కాలమందు దిగులు పడుచునేయుండుట కా పురుష లక్షణము. కావున ఈవిషయములో ధైర్యమవలంబించి యిందులకు ప్రతిక్రియ నాలోచింపవలయును. ఏలన;—

తే. సిలుగునను ధైర్య, మణఁకువ శ్రేయమందు,
మాటనేర్పు సభను, బోర మగఁటిమియును,
యశముకై యాస, వినవిచ్చ యూఱును నివి
ప్రకృతిసిద్ధంబులు మహాత్ములకు నరేంద్ర! 35

క. ఎవనికి సంపదలందుం
దవులదు మది హర్ష, మాపదలయందుం గా
దు విషాదలేశ, మట్టిని
భువనతిలకుఁ గనెడుతల్లి భువి నరుదుగదా. 36

మఱియు,—

ఆ. భూతిఁ గోరునట్టి పూరుషుం డీయాఱు
దోషములను దొలఁగఁ ద్రోయవలయు;
అలసతయును, నిద్ర, యల్గ క్రోధంబును,
తంద్ర, దీర్ఘసూత్రతయు, భయంబు. 32

కావున నిందులకేదేని యుపాయమాలోచింప వల యును. ఏలయన,—

క. ఏపని యుపాయమున నగు
నాపని శౌర్యమునఁ గాదు; హ స్తీంద్రంబున్
రూపఱఁ జేసెను నక్క మ
హాపంకాధ్వమున నడపి యతిచతురముగాన్.' 33

అవాంతర కథ

ఆకథయెట్లు? అని పరివారం బడుగఁ జిత్రగ్రీవుఁడు వచించుచున్నాఁడు;—

'బ్రహ్మారణ్యమందు కర్పూరతిలక మను పేర నేనుఁ గొకటియుండెను. దానినిగాంచి నక్కలన్నియు నిట్లాలో చించినవి. 'ఏయుపాయముననేని ఇది చచ్చునేడల మనకు దీనికళేబరము నాలుగునెలలకు ఆహారమగును;' అని. అం దొక ముదినక్క 'నేను బుద్ధిప్రభావముచేత దీనిని చంపె దను;' అని ప్రతిజ్ఞచేసెను. తర్వాత ఆనక్క కర్పూర తిలకము కడకుంబోయి, సాష్టాంగముగాఁ జాఁగిలంబడి, 'దేవా, నాకేసి కటాక్షము ననుగ్రహింపుము'అని వేడెను. 'ఎవఁడవునీవు?' అని యేనుఁగడిగెను. నక్కచెప్పుచున్నదిః

"నేను నక్కను; అడవిలో నివసించు జంతువులన్నియు కలసి తమ సన్నిధానమునకు నన్నుం బంపినవి. ఏలయనఁగా,- రాజు లేకయుండుట సరిగాదు; కావున ఇచ్చట అడవి దొరతనమందు నిన్ను సకలప్రభులక్షణములతోను గూడు కొన్నవానిని పట్టాభిషేకము సేయుటకు నిశ్చయించు కొన్నవి. ఏలయనఁగా;—

క. వరకులుఁడు సుచరితుఁడు పర
ధరణీంద్ర భయంకరప్రతాపుఁడునగు ధ
ర్మరతుఁడు నీతిజ్ఞుఁడు నగు
పురుషుఁడు భూనాయకత్వమున కర్హుఁడగున్. ౩౯

మఱియుఁ గనుము,—

ఆ. రాజు ప్రథముఁ జూధరాస్థలిఁ, బిమ్మట
తనదుభార్య, వెనుకఁ దనదుధనము;
రాజు లేఁడ యేని యీరాజగంబునయందు
లేదు భార్య, ధనము లేనె లేదు. ౪౦

మఱియు,—

క. వారిదునిసాటిగా నా
ధారము భూతముల కెల్ల ధరణీపతి; యా
వారిదుఁడు లేక బ్రదుకఁగ
నేరుతు మెటో, రాజు లేక నేరము మిత్రా! ౪౧

మఱియు,—

ఆ. నియతియందు నరుఁడునిలుచు దండభయాన ;
సహజసాధు వరుదు జగతిలోన ;
వికలు రోగిఁ గృశునిఁ బేదను బతినైనఁ
గులసతియును గొలుచుఁ గోల కలికి. ౪౨

కావున లగ్నవేళ యతిక్రమింపకుండం ద్వరపడి దేవరరావలయును.' ఇట్లు పలికి నక్క లేచి తరలెను.- అంతట కర్పూరతిలకము రాజ్యముమీఁదియాశ లాగఁగా, నక్కపోయినదాఁకినే పరువిడి గొప్పయుబ్బలిలో ప్రాఁడి, 'చెలికాఁడా, నక్కా, ఇప్పుడేమి చేయఁదగును? పెను బురదలోఁబడితిని;' అనియడిగెను. నక్క నవ్వుచు నిట్లని నియె;- 'ప్రభూ, నాతోఁకకొనను చేతితోఁబట్టుకొని లెమ్ము. నామాటను నీవు నమ్మినందులకు ఫలమిది. అట్లే చెప్పినారు. ఎప్పుడు సత్సహవాసము కలవాఁడవగుదువో అప్పుడు వర్ధిల్లుదువు; ఎప్పుడు దుర్మార్గుల సహవాసములోఁ బడుదువో, అప్పుడు నశింతువు' అని. అంతట పెనుబురదలో పడిన యాయేనుఁగును నక్కలు భక్షించినవి.

కావుననే "ఏపని యుపాయమున" ఇత్యాది నేను పఠించితిని. మఱి యిప్పుడీయుపాయము చేయుదము: మన మందఱము ఏకమనస్సుతో వలను దన్నుకొని ఒక్కుమ్మడి నెగిరిపోవుదము. ఏలన,—

ఆ. అలఁతివస్తువులదె యైనను గూటమి
కార్యసిద్ధిఁ గూర్పఁ గలిగియుండు ;

గుణతఁ జెందినట్టి తృణములచేతను
గట్టువడవె మత్తగజవరములు. ౭౩

మఱియు,—

కం. తమకులమువారితోఁ గూ
డమి వా రల్పులయినను దృఢంబుగ మేలే,
ఉమియుకం బాసినదగు బి
య్యము మొలచునె దోహదక్రియాయుతమైనన్. ౭౪

ఇట్లాలోచించుకొని పిట్టలన్నియు వలంగొని ఎగిరి పోయినవి.

అంత నా వేఁటకాఁడు కడుదూరమునకు వలంగొని పోవుచున్న యాపక్షులం జూచి వెంటం బఱతెంచుచు నిట్లు తలపోసెను. 'ఈపక్షులు నావలను ఏకమనంబున గుమిగూడి హరించుకొని పోవుచున్నవి. ఇవి ఎప్పుడు నేల వ్రాలునో అప్పుడు నాకు వశమగును.' అనంతరము ఆ పక్షులు చూపుమేర దాఁటి పోఁగానే వేఁటకాఁడు వెనుకకు మరలెను. దానింగాంచి యాపావురములు 'ఇప్పుడేమి చేయుదము?' అని రాజు నడిగినవి. రాజు చెప్పెను;—

తే. 'తల్లియుం జెలికాఁడును దండ్రియు నను
త్రితయము స్వభావమునఁ జేసి హితమె కోరు;
కార్యకారణములఁ బట్టి కడమజనులు
పరిణమింత్రు హితము గోరువారుగాఁగ. ౭౫

నాచెలికాఁడు మూషకరాజు హిరణ్యకుఁడను పేరి

వాఁడు ఇదె యిట గండకీతీరమున చిత్రవనమందు వసించుచున్నాఁడు. దంతబలముచేత నాతఁడు మనపాశములను ద్రుంపఁగలఁడు.'

ఆమాట కలరి పావురములన్నియు జేనితోఁగూడ హిరణ్యకుని కలుఁగు కడకుంబోయినవి. అట హిరణ్యకుఁడు

క. రానున్నసేగి కై వి
జ్ఞాని ముదుకయెలుక కలుఁగు శతవక్త్రంబుఁ
దా నిర్మించి పదిలముగ
దానఁ నెలకొనియెం దొంటిధార్ష్ట్యం బెడలన్. ४१

అంతట హిరణ్యకుఁడు అట్లుపావురము లొక్కుమ్మడి తనలాఁగకడ వ్రాలినందులకు భయపడి కదలక మెదలక యూరకుండెను. 'చెలికాఁడా, ఏమి మాతో పలుక కున్నావు?' అని చిత్రగ్రీవుఁ డెచ్చరించెను. అంతట హిరణ్యకుఁడు అతని యెలుఁగును ఆనవాలుపట్టి, తొట్రుపాటుతో వెలువడి యిట్లనియె; 'ఆహా! పుణ్యాత్ముఁడనైతిని! నానెచ్చెలి చిత్రగ్రీవుఁడు వచ్చినాఁడు!

క. మిత్రునితో సంభాషణ,
మిత్రునితోఁ గూడిమనికి, మిత్రునితోడన్
జిత్రంబగు సల్లాపము,
నీత్రిజగతిఁ గలదె పుణ్య మింతటికన్నన్.' ४२

ఇట్లనుచునే పాశబద్ధులను వీరింగాంచి అబ్బురపోయి క్షణముండి 'సఖుఁడా, ఏమియిది?' అనియడిగెను. చిత్ర-

గ్రీవుఁ డిట్లనియెః—'మిత్రమా, యిది మాపూర్వజన్మ కృతమునకు ఫలము.

ఆ. ఎందున నెట దేన నెటు లెపు డెది యెంత
పొసఁగె దనదుచేఁత యొగ్గొ లగ్గొ,
అందున నట దాన నటు లప్పు డది యంత
తనకుఁ దప్ప కగు విధాతృవశత. ౨౮

తే. వ్యాధియును బరితాపంబు బంధనంబు
నుమ్మలము వ్యసనంబన నొప్పు నైదు
తనదునేరము లనియెడితరులవలనఁ
బ్రాణి తప్పక మెసవెడిపండ్లుసుమ్ము. ౨౯

ఆమాటవిని హిరణ్యకుఁడు వడివడిగా చిత్రగ్రీవుని కట్టును తెగఁగొఱుక వచ్చినాఁడు. చిత్రగ్రీవుఁడు, 'మిత్రుఁడా, అట్లు సేయకుము; నాయాశ్రితులగు వీరల యురులను ముందుగా ద్రెంపుము. నాయురులను తర్వాత గొఱుకుదువు గాక;' అని యాఁపెను. 'నాకు శక్తి కొంచెము; నా దంతములు దుర్బలములు. వీరియురులను గొఱుకుటకు నావలననెట్లగును ? నాపండ్లు విఱుగకుండు నంతవఱకు నీయురులను తెగఁగొఱికెదను. తర్వాత శక్యమయినంత మట్టు వీరియురులను కూడఁ గొఱికెదను.' అని హిరణ్యకుఁడు బదులు పలికెను. 'అది సరియేగాని, వీరియురులనే శక్తికొలఁది కొఱికివైవుము;' అని చిత్రగ్రీవుఁడు వెండియు నొక్కి పలికెను. అందులకు హిరణ్యకుఁడిట్లనియెః—'ఈవిధ

ముగా తన్ను వదలుకొని ఆశ్రితులను రక్షించుట నీతికో విదులకు సమ్మతముగాదు. ఏలయనఁగా.—

ఆ. ధనము గావు మాపదలను నీఁగుటకు నై,
ధనము నైన వీడి దారఁ గావు,
ధనము నైన వీడి దార నైననువీడి
యాత్మఁ గాచికొనుమి యనవరతము. ౫౦

మఱియు,—

తే. నరవి ధర్మార్థకామమోక్షముల కెల్లఁ
బ్రాణములు పట్టుగొమ్మ; యాప్రాణములకు
హాని యొనరింప దేనికి హానిగాదు,
రక్ష యొనరింప దేనికి రక్షగాదు.' ౫౧

అందులకు చిత్రగ్రీవుఁడిట్లు బదులు చెప్పెను.—
"మిత్రుఁడా, నీవు చెప్పినదే నీతిమార్గము. కాని, నేను నా యాశ్రితుల దుఃఖమును బొత్తిగా చూడఁజాలను. కావున నిట్లు చెప్పితిని; ఏలయన,—

ఆ. ధనచయమును, జీవితంబును నైతము,
ప్రాజ్ఞుఁ డుజ్జగించుఁ బరులకొఱకు;
మంచికతమునం దృజించుట సరి గాదె,
లయము తప్ప కునికి ద్వాయమునకును. ౫౨

ఇదియొక గొప్పకారణము!—

క. నాతోడ సములు వీరులు
జాతిని ద్రవ్యంబునందు శక్తులయందుఁ;

నేతనుగ ననుఁగొలుచు ఫల
మేతఱి వీరలకుఁ గల్గు నేరూపమునన్ ? ౫౩

మఱియు,—

క. పలలము, మూత్రపురీషా
స్థలు నను నశ్వరపుబొందెఁ ద్రోయుచు, నార్థన్
వెలయింపు, మిత్ర, నాకున్
త్రిలోకవిశ్రాంత మయిన దీప్రయశంబున్. ౫౪

ఇదియునున్గాక,—

క. జీతము బత్తెము లేకయె
యేతఱినిన్ నన్నుఁ బాయ రెందును వీరల్,
కాతువు గావుత వీరల
నాతనువు వ్యయించి యేని నాయాశ్రితులన్. ౫౫

మఱియున్వినుము,—

క. పొలివోవునదియు, నక్షయ
కలుషంబును, నైనయట్టికాయముచేతన్,
పొలియని నిర్మలయశమే
కలుగునెడల, దానిచేతఁ గలుగని దేదో? ౫౬

ఏలయన,—

క. గుణమునకున్, దనువునకున్,
గణనాతీతాంతరంబు గల, దెట్లన్నన్,
గుణ మాకల్పాంతం బుఱు,
క్షణకాలములోనఁ దనువు క్షయముంబొందున్.' ౫౭

ఈమాటలు విని హిరణ్యకుఁడు సంతుష్టాంతరంగుఁడై ఒడలెల్ల గగుర్పొడిచి యిట్లనియె:—'బళీ! చెలికాఁడా, బళీ! ఈ యాశ్రితవాత్సల్యముచేత నీవు మూఁడు లోకములకును దొరవు కాఁదగుదువు.' ఇట్లు వచించి హిరణ్యకుఁడు ఆ పావురములకు అన్నిటికిని కట్లను తెగఁగొఱికినాఁడు. అటుతర్వాత హిరణ్యకుఁడు ఆదరముతో వానినన్నిటిని సత్కరించి యిట్లనియె:—'సఖుఁడా, చిత్రగ్రీవుఁడా, ఇట్లు ఉరులలో తగులుకొనుటను నీదోషముగా నెంచుకొని ఎంతమాత్రమును నిన్ను నీవు తిరస్కరించుకొనవలదు; ఎందుచేత ననఁగా,—

క. తన మేఁతను విహగం బెది
కను యోజనశతముకన్నఁ గడుదూరమునన్
గన దది, కాలము మూఁడినఁ,
గనులయెదుర నున్న ఘనపాశంబున్. 70

మఱియు,—

తే. రవిసుధాకరులకుఁ గల్గు రాహుబాధ,
గజభుజంగ విహంగముల్ గట్టువడుట,
మతియుతులసామ్మయిన దరిద్రతను జూచి
విధి యహహా, బల్లిదుఁడని భావింతు నేను. 71

ఉ. ఏకత మాకసంబున ర
హించుఖగంబులనున్ వధింపుదుర్,

కైకొనవే ర్తు చేవల న
గాధ సముద్రమునుండి జాలరుల్,
లోకమునన్ నయంబు నయ
లోపము, స్థానబలంబు నున్న వా?
చేకొను నెంతద వ్వయినఁ
జేటునఁ జేయిడి కాల మన్నిటన్.' ౬౦

హిరణ్యకుఁడు ఈతీరున బోధించి యతిథిసత్కారముం గావించి కవుంగిలించి వీడ్కొనఁగా, చిత్రగ్రీవుఁడు పరివార సమేతముగా తనకిష్టమయిన దేశములకుం జనియెను.

తే. వీరు వా రని చూడక కెవ్వారినేని
వందలకొలంది మిత్రుల వలయఁ జేయ;
ఎలుక యోపాటి, తా నొక్కఁ డేపు మీఱి,
బంధము క్తులఁ గావించెఁ బావురములు. ౬౧

అంతట హిరణ్యకుండును తనలాఁగలో ప్రవేశించెను. అంతట లఘుపతనకుఁ డను కాకి ఈవృత్తాంతమునెల్లం గాంచి ఆశ్చర్యపడి యిట్లు సంబోధించెను; 'ఓహో! హిరణ్యకుఁడా, పొగడ్తకుఁ దగినవాఁడవయ్యా! కావున నేనును నీతోఁగూడ చెలిమిని గోరుచున్నాను; కనుక నాకును నీ చెలిమిని అనుగ్రహింపుము.' ఈమాట విని ఎలుకయు బొక్కలోపలనేయుండి 'నీ వెవరవయ్యా?' అని యడిగెను. 'నేను కాకిని; నాపేరు లఘుపతనకుఁడు;' అని

అదిచెప్పెను. హిరణ్యకుఁడు నవ్వి యిట్లనియె:—'నీతో చెలిమియన నేటిది? ఎందుచేత ననఁగా,—

క. దేని కెది తగునో, విబుధుఁడు
  దానికిఁ గూర్పంగవలయు దానిని సరిగా,
  భోజనంబను, భోక్తవు, మన
  కేనెఱి నెయ్యంబు గలుగు? నేటికి మాటల్? ౬౨

మఱియు,—

ఆ. భక్షకంబుతోడ భక్ష్యంబునకుఁ గల్గు
  ప్రీతి యాపదలకె హేతు వగును;
  నక్కవలన నురులఁ జిక్కినజింకను
  గాకి వెదకివెదకి కాంచి కాచె.' ౬౩

'ఆకథయెట్లని కాకి యడిగినది. హిరణ్యకుఁడు ఇట్లు చెప్పెను.—

మగధదేశమందు చంపకవతియని గొప్పయడవి కలదు. అందు చిరకాలమునుండి అధికస్నేహముతో జింకయు, కాకియు నివసించి యుండినవి. ఆజింక స్వేచ్ఛగా సంచరించుచు సంతోషముగలదై కండపట్టినదేహముతో నుండఁగా ఒకనక్క చూచినది. చూచి 'అకటా! మిక్కిలి మనోహరమయిన దీనిమాంసము నాకెట్లు తినుటకు లభించును? కానీ, నమ్మకము పుట్టించెదను.' అని యాలోచించుకొని సమీపించి, 'మిత్త్రమా, కుశలమా?' అని యడిగెను. 'ఎవరవు నీవు?' అని జింకయడిగెను. 'నేనునక్కను.

నాపేరు క్షుద్రబుద్ధి; ఈయడవిలో బంధువులులేక చచ్చి శవమువలె నున్నాను. ఇప్పుడు నిన్ను మిత్రుని వడసి బంధువు గలవాఁడనై ప్రాణిలోకమును ప్రవేశించినవాఁడనైతిని. ఇఁక నేను తప్పక నీతోడను అయ్యెదను.' 'అట్లే కానీ' అని జింకపలికినది. అటుతరువాత కిరణమాలికలు దాల్చినదేవుఁడు సూర్యుఁడు క్రుంకఁగానే ఆరెండును జింక యొక్క ఉనికిపట్టునకుం బోయినవి. అచటి సంపెంగచెట్టు కొమ్మమీఁద వసించియున్నట్టిది సుబుద్ధియనుకాకి జింకకు చిరమిత్రము రెంటినింజూచి 'మిత్రమా, ఈరెండవ వాఁడెవఁడు?' అనియడిగినది. 'ఇదినక్క; నాచెలిమి కోరి వచ్చినది;' అని జింక యుత్తరము చెప్పినది. అంతట కాకి యిట్లనియె;-'మిత్రుఁడా, ఆకస్మికముగా వచ్చినవానిని నమ్ముట సరిగాదు. కనుక నీవు చేసినపని మేలుగాదు. పెద్దలు చెప్పుదురు:—

క. కులశీలంబు లెఱుంగక
  యిలు సేర్చుకొనంగఁ గూడ దెవ్వనినేనిన్,
  *తెలియక పిల్లికిఁ జోటిడి
  బలునిహతులు వడి జరద్గవం బీల్గెఁ గదా.' ౭౮

'ఆకథయెట్లని వారిరువురు నడిగిరి. కాకి చెప్పం దొడంగెను.

* పా. "పులుగు శిశులఁ బిల్లి తినన్"
"కొలమారి పిల్లి కెడ మిడి"

## అవాంతరకథ ౧.

గంగయొడ్డున గృధ్రకూట మనుపర్వతములో పెద్ద జువ్విచెట్టు కలదు. దైవముయొక్క పాడుఫలముగా గోళ్ళు ఊడి కన్నులుపోయినట్టిది జరద్గవమను నొకగద్ద ఆచెట్టుతొఱ్ఱలో నివసించుచుండెను. మఱి, ఆచెట్టున నివసించెడి పక్షులన్నియు జాలిగొని దానికి జీవనార్థమయి తమయాహారమునుండి కొంచెముకొంచెము పెట్టుచుండి నవి. అందువలన అది జీవించుచుండెను. ఇట్లుండఁగా నొక నాఁడు దీర్ఘకర్ణుఁడు అను పిల్లి పక్షిపిల్లలను భక్షించుటకు అచ్చటికి వచ్చినది. దానిరాకం గని పక్షిపిల్లలు భయపడి రొదపెట్టినది. దానిని విని జరద్గవము 'ఎవరా వచ్చెడి వారు?' అని అదలించెను. దీర్ఘకర్ణము గ్రద్దం గాంచి భయపడి,-'అయ్యో! చెడితిని. ఏలయన,—

ఆ. భయము రాకముందు భయ మొందు నుచితంబు,
వచ్చినపుడు దిగులు పందతనము,
వచ్చినట్టిభయముఁ బరికించి ధీరుండు
ప్రతివిధాన మొందు పన్నవలయు. ౬౭

మఱి యిపుడు ఇంతసమీపమునుండి పాఱిపో నలవి గాదు. కావున ఎట్లు కానున్నదో అట్లగుఁగాక! నచ్చిక పుట్టించి దీనిచెంతఁ జేరెదను.' ఇట్లాలోచించుకొని సమీ పించి, 'ఆర్యా, నమస్కారము' అని పల్కరించెను. 'ఎవరవు నీవు?' అని గద్దయడిగెను. 'నేనుపిల్లిని' అని యది చెప్పెను.

'పో, దూరముగా పో, పోకున్న నాచేత చచ్చెదవు.' అని గద్దపలికెను. అంతటపిల్లి 'ముందు నామాటను వినుము. నేను చంపఁదగినవాఁడనుగా నీకు తోఁచెనేని అప్పుడు చంపుము. ఎందులకనఁగా,—

ఆ. జాతిమాత్రకతనఁ జంపుట యొండెను,
బూజసేఁత యొండెఁ బొసఁగ దెందు;
అరసి లెస్సగాఁగ వ్యవహారవైఖరిఁ,
జంపు మొండెఁ బూజ సల్పుమొండె.' ౬౬

అని చెప్పినది. 'నీవు ఏల వచ్చితివో చెప్పుము.' అని గద్ద యడిగినది. పిల్లి యిట్లనియె !—'నే నిట గంగదరిని నిత్యము స్నానము చేయుచు మాంసము తినక బ్రహ్మచర్యముతో చాంద్రాయణవ్రతము చేయుచు ఉన్నాను. మీరు ధర్మజ్ఞానమందు ఆసక్తులును, నమ్మఁదగినవారును అని పక్షులన్నియు ఎల్లప్పుడు నాముందల పొగడుచుండును.. అందువలన విద్యచేతను, వయస్సుచేతను పెద్దలయిన మీవలన ధర్మము వినుటకు ఇటకు వచ్చినాఁడను. తమరు ఇట్టి ధర్మజ్ఞులుగా నున్నారు; అతిథిని జంపుటకు పూనినవారు. గృహస్థధర్మ మేమనఁగా:—

ఆ. శత్రుఁడైన, నీదుచక్కటికి కరుదేరఁ,
దగినవిందు నేసి తనుపవలయు;
నఱకుచున్నయట్టి నరువైపు పోనీక
మఱుఁచుకొనునె నీడ భూరుహంబు? ౬౭

ధనములేనియెడల, ప్రియవచనములచేనైనను అతిథిని పూజింపవలయును; ఏలయన,—

ఆ. ఏవి లేక యున్న, నీనాలు గేనియు
గడ్డి, నేల, నీళ్ళుఁ, గమ్మఁబలుకు,
సాధుజనులయిండ్ల, సతతంబు, నేకూఱు
నరుగుదెంచునట్టి యతిథులకును. ౬౮

మఱియు,—

ఆ. బాలుఁడైన, వయసువాఁడైన, వృద్ధైన,
నెవ్వఁడైన, నింటి కేఁగుదేర,
వానిఁ బూజసేయవలయును వారక,
ఎల్లవారి కతిథి యీశ్వరుండు. ౬౯

మఱియు,—

ఆ. గుణము నవగుణంబు గణియింప కుత్తముల్
సదయు లగుదు రెల్ల సత్త్వములకు;
కలువనేస్తకాఁడు కాయఁడో వెన్నెల
గంగమీఁదియట్లె గంజమీఁద. ౭౦

మఱియు,—

ఆ. పావకుండు గురుఁడు బ్రాహ్మణజాతికి,
వర్ణములకు గురుఁడు బ్రాహ్మణుండు,
పతి యొకండె గురుఁడు భామామణుల కెల్ల
అఖిలజనములకును నతిథి గురుఁడు. ౭౧

మఱియు,—

ఆ. ఒకనియింట నాశ విశల మై వెన్కకుఁ
బ్రతినివృత్తుఁ డగుచుఁ బ్రాఘుణుండు,
తనదుపాపమున కతనిపుణ్యమునకును,
వినిమయంబు సేసి వెడలుఁ బిదప.' 22

మఱియు,—

ఆ. అధికునింటి కైన, నవరవర్ణుం డైన,
వచ్చునేని, వాని, వాసి మీఱఁ,
దగినపూజ చేసి తనుపంగవలయును
అఖల దేవతాత్ముఁ డతిథియగుట. 23

ఇట్లు పిల్లి చెప్పఁగా గద్ద 'పిల్లులకు మాంసము మిక్కిలి ప్రియముగదా, ఇట పక్షిపిల్లలు వసించుచున్నవి; అందు చేత నే నట్లు చెప్పితిని' అనెను. ఆమాటవిని పిల్లి నేలతాఁకి 'కృష్ణ, కృష్ణ' యనుచు చెవులు మూసికొని మఱల నిట్లు వక్కాణించుచున్నది:—'నేను ధర్మశాస్త్రమును విని వైరాగ్యముపొంది కఠినమైన యీచాంద్రాయణ వ్రతమును పూనుకొంటిని. ఏలయనఁగా, ధర్మశాస్త్రములందు వేఱు విషయములలో మతభేదము లున్నను, హింసింపకుండుట ఉత్తమధర్మ మను విషయములో ఐకమత్యమే కనఁబడుచున్నది. ఎందులకనఁగా,—

ఆ. ఏనరుఁడు సమస్తహింసల విడుచునో,
యెవఁడు సర్వమును సహించువాఁడో,

అఖిలజనుల కెవ్వఁ డాశ్రయభూతుఁడో,
వాఁడు స్వర్గమందు వఱలువాఁడు. ౭౪

మఱియు,—

ఆ. ఒడలితోడఁ గూడఁ గడమ సమస్తంబు
నాశ మొందఁ, దాను నాశ మేఁది
చావునను సయితము సరస వీడనిదెద్ది ?
యదియె పాడి, మిత్ర మది యొకండె. ౭౫

ఇదియుఁగాక,—

ఆ. ఒక్కదానిపాల మఱొకటి మెక్కుటయందు
నంతరంబు రెంటి కరయ మదిని,
ఒకటి తనివిఁ జెందు నొకక్షణమాత్రంబ
యన్య మైనఁ బ్రాణహానిఁ జెందు. ౭౬

మఱియు,—

ఆ. తన్నుఁ జంప నున్నతఱి, నెట్టిదుఃఖంబు
తనకు నుప్పతిల్లు, దానిఁ బట్టి
యూహ సేసికొన్న, నొరులను సైతము
తాను గావ శక్య మౌను జూవె. ౭౭

ఇంకను వినుము,—

ఆ. కానలోనఁ, దాముగానే మొలచునట్టి
యాకలములచేత నైననిండు
నట్టిపాడుపొట్టకై యెవ్వఁ డొనరించు
పార మేఁదినట్టి పాతకంబు.' ౭౮

ఇల్లు సమ్మంబలికి ఆపిల్లి చెట్టు తొఱటలోనే ఉండి నది. తర్వాత కొన్నిదినములు గడవఁగా పక్షిపిల్లలను పట్టుకొని తొఱటకుఁదెచ్చి ప్రతిదినమును తినుచుండినది. వేనిపిల్లలను తిన్నదో, అవి, దుఃఖపీడితములై ఏడ్చుచు, ఇచ్చటను అచ్చటను వెదకం దొడంగినవి. దాని నెఱిఁగి పిల్లి తొఱటనుండి బయలువెడలి పాఱిపోయినది. తర్వాత పక్షులు ఇట నట శోధించి చెట్టుతొఱ్ఱలో పిల్లల యెము కలను కనిపట్టినవి. అంతట నా పక్షులన్నియు 'ఈ జరద్గ వమే మన పిల్లలను భక్షించినది' అని కూడఁబలికికొని గద్దను చంపివైచినవి. కావున నేను "కులశీలంబు లెఱుం గక" ఇత్యాది వాక్యమును పలికితిని.'

ఈ కథను విని నక్క కోపమున నిట్లనియె:—

'లేడిని మొదట చూచిననాఁడు నీవును కులశీలములు తెలి యని వాఁడవే. అట్లయినను నీతో దీనికి స్నేహము ఉత్తరోత్తరాభివృద్ధిగా నేల నెగడుచున్నది ?

క. ఏనాట లేరొ పండితు
లానాటఁ స్వల్పమతియు నతిపండితుఁడే;
ఏనాట లేవొ వృక్షము
లానాటికి నాముదము మహావృక్షంబే. ౭౫

మఱియు,—

క. తనవాఁ డితఁ డన్యుం డితఁ
డనుభేదం బల్పులకె, మహాత్ములకైనఁ

దనవారె యెల్లవారును,
దనదుకుటుంబంబె సర్వధాత్రీప్రజయుఁ. ౮౦

ఈజింక నాకు ఎట్లు మిత్రమో అట్లే నీవును మిత్రమవే.' ఇట్లు నక్క చెప్పఁగా, జింక యిట్లనియె.— 'ఏల యిట్లు మాటకు మాట? అందఱ మొక్కచోట విశ్వాసమున మాటలాడుకొనుచు సుఖముగా నుందము. ఏలయన,—

ఆ. ఎవనికేని మిత్రుఁ డెవ్వండునుం గాఁడు
ఎవనికేని శత్రుఁ డెవఁడు గాఁడు
సంభవింత్రు కార్యసంబంధమునఁ జేసి
మిత్రధేయములును శత్రువులును.' ౮౧

అందులకు కాకి 'అట్లే కానిమ్ము' అనినది. అనంతరము తెల్లవాఱఁగానే అన్నియు దానిదానికిఇష్టమయిన దేశమునకుం బోయినవి. ఒకనాఁడు రహస్యముగా నక్క జింకతో 'చెలికాఁడా, ఈయడవిలో ఒకచో నొకపొలము పైరుతో నిండియున్నది, నిన్ను తోడ్కొనిపోయి చూపెదను రా;' అని హెచ్చరించెను. అట్లే జరుగఁగా, జింక ప్రతిదినమును అటకేఁగి పైరు మేయుచుండెను. దానింగని పొలముసామి వలయొగ్గెను. తర్వాత వలలో తగులుకొని 'యమపాశమువంటి యీ వేఁటకాని వలనుండి నన్ను విడిపించు నేర్పరి నాచెలికాఁడు తప్ప మఱియెవఁడు?' అని తలపోసెను. తర్వాత నక్క అచ్చటికి వచ్చి సమీపించి

యిట్లు తలపోసెను ;—'నా పన్నిన మాయచేత నాకోరిక నెఱవేఱినది ; దీనిని కోయునప్పుడు రక్తమాంసములు కమ్ముకొనియుండెడి యెముకలు నాకు తప్పకుండ దొరకును. అవి విస్తారముగా నాకు ఆహారము కాఁగలవు.' జింక దానిని చూచి ఉల్లాసముతో 'చెలికాఁడా, నా కట్టును ద్రెంపివైవుము ; త్వరగా నన్నుఁ గావుము ;

ఏలయన ;—

ఆ. ఇడుమ వచ్చినప్పు డెఱుఁగుము మిత్రుని,
ఆలమందు శూరు, నప్పున శుచి,
విత్తహానియందు వెలఁదిని బరికింపు,
వ్యసనమందుఁ దెలియు బాంధవులను. ౮౨

మఱియు,—

ఆ. రాచనగరియందు, రాష్ట్రవిప్లవమందు,
వ్యసనమందు, నుత్సవంబునందు
వల్లకాటియం, దవగ్రహంబునయందుఁ,
బట్టి విడనివాఁడు బాంధవుండు. ౮౩

అని వేఁడెను.

నక్క ఆవలను మాటిమాటికి పరికించి 'ఈవల గట్టిగానే యున్నది,' అని తలంచి, 'మిత్రమా, ఈవలలు నరములతో చేయఁబడినవి; నేఁడు ఆదివారము; ఎట్లు వీనిని పండ్లతో తాఁకుదును ? చెలికాఁడా, మనస్సులో వేఱువిధముగా తలంపవేని, ఱేపు తెల్లవాఱఁగానే నీవేమి

చేయుమన్నను చేసెదను' అని పలికి దానికి సమీపము
ననే కనఁబడకుండ దాఁగి యుండెను.

తర్వాత కాకి సాయంకాలమునందు జింక రాకుండు
టం గని అక్కడక్కడ వెదకుచువచ్చి ఆస్థితిలో నున్న జిం
కను జూచి 'చెలికాఁడా ఏమి యిది?' అని యడిగెను.
'ఇది మిత్రుని మాటను తిరస్కరించినందులకు ఫలము.
పెద్దలు ఏమిచెప్పిరన ;—

ఆ. మేలు గోరునట్టి మిత్రులవాక్యంబు
నేనరుండు వినఁడొ యానరునికి
నిడుమ యెపుడుఁ జెంతనే యుండు నాతండు
శత్రువులకుఁ బ్రీతి సలుపువాఁడు.' ౮౭

ఆమాట విని కాకి యడిగెను,—'ఆవంచక మెక్కడ?'
జింక చెప్పినది,—'నామెఱచిం దినుటకై యిచటనే కను
పెట్టుకొని యున్నది.' అందులకు కాకి యిట్లు పలికినది:

'క. నాయందుఁ దప్పు లేదని
హాయిగ దిగు లేది యున్న నాపద వచ్చున్,
పాయక సేయుచు నుందుర
పాయము సుగుణాకరులకు నైనను గూళల్. ౮౮

క. కన రారంజోతమ్మను
వినరు సఖులు వల్కుహితవు వినుతోక్తుల మూ
ర్కొనరు దివియ యాఱెదు వా
సన నంతము దఱియుచున్న సమయమున జనుల్. ౮౯

ఆ. చాటుదలను బరుల సర్వనాశము సేయు
ప్రోలఁ బ్రియము వల్కి ముదము గులుక,
అమృత వదనమైన హాలాహలఘటంబు
బోలు చెలిమికానిఁ దోలి బ్రదుకు.” ౮౭

అంతటకాకి నిట్టూర్పువిడిచి యిట్లు విలపించెను:—‘ఓరి వంచకుఁడా, పాపకర్ముఁడవు నీవు ఎంతపని చేసితివిరా! ఏలయన,—

ఆ. కమ్మఁబలుకు లాడి కల్పుకో ల్గావించి
ఆసగొల్పి పాపు లార్థఁ బెంచి
టక్కు సేవచేసి దక్కొని సాధుల
సాంగముగను తుదకు మ్రింగుదు రహా. ౮౮

క. నమ్మినయుపకారికి ద్రో
హమ్ముం దలపోయుపాపి ననృతాత్మకునిన్
అమ్మా, భగవతి, వసుధా,
యెమ్మాడ్కి భరింతు వమ్మ యెఱిఁగింపు దయన్.

ఆ. చెనఁటితోడఁ జెలిమి సేయుట సరిగాదు
ప్రీతి నూపుశేని నీతి గాదు
మండుచున్నబొగ్గు మాడ్చును హస్తంబు
చల్లబడినయంత నల్లఁజేయు. ౯౦

అట్లననేల? దుర్జనులవృత్తియే యిట్టిది;

చ. తొలుతఁ బదంబులం బడును,
దోన గ్రసించును వీపుమాంసమున్,

కలముగ నేమొకో గోణఁగుఁ
గర్ణములందు విచిత్రవై ఖరిన్,
బిలమును గాంచి చయ్యనఁ బ్ర
వేశ మొనర్చును నిర్విశంకతన్,
ఖలచరితంబు దోమ యొడి
కంబుగ వాలక మాడు సర్వమున్. ౯౧

అట్లే,—

ఆ. ఖలుఁడు ప్రియము లాడి కరఁగించు మతి నంత
నమ్మకమ్ము నకు గతమ్ము గాదు;
వానినాల్కతుదను దేనియ జాల్కొను
నుల్లమందు క్ష్వేళ ముల్లసిల్లు.' ౯౨

తర్వాత తెల్లవాఱఁగానే పొలముసామి దుడ్డుగుదియచేతఁబూని ఆచోటికి వచ్చుచుండఁగా కాకి చూచి జింకతో 'సఖుఁడా, నీవు చచ్చినవానివలె నగపడుచు గాలితో కడుపు బూరటించుకొని, కాళ్ళు నిగుడఁ దన్నుకొని, ఉండుము. నేను నీకన్నులను ముక్కుతో గీఱుచుండెదను; నే నెప్పుడు కూయుదునో అప్పుడు నీవు లేచి తటాలున పాఱి పొమ్ము' అని చెప్పినది. జింక అట్లే కాకి మాటప్రకారమే చేసినది. అంతట సంతోషముచే కన్నులు వికసిల్లుచుండ పొలముసామి ఆతీరుననున్న జింకఁగాంచి 'ఆహా! స్వయముగానే చచ్చితివా!' అనిపలికి, వలనుండి తప్పించి ఉరిత్రాళ్ళను కైకొనుటకై జతనపడెను. అంతటకాకి కూఁత

విని జింక వడిగా లేచి పాఱిపోయెను. దానికేసి పొలము సామి విసరివైచిన గుదియ గుఱి తప్పి నక్కను చంపినది. చెప్పుదురు గదా ;—

ఆ. మూఁడు వత్సరములు, మూఁడు మాసంబులు,
మూఁడు పక్షములును, మూఁడు నాళ్లు,
నవధి గాఁగ నుత్కటాఘపుణ్యములకు
నిక్కడనె ఫలంబు నెక్కు నరుఁడు. ౯3

కావుననే నేను చెప్పితిని *'భక్షకంబుతోడ' నిత్యాది' అంత లఘుపతనకము మరల నిట్లు వచించుచున్నది.—

క. నిను భక్షించినను భో
జన మది నాకుక్షి కేమొ చాలద సుమీ్మా,
అనఘాత్మ, నీవు జీవిం
చినఁ జిత్రగ్రీవుపోల్కి జీవింతు నయా! ౯౪

మఱియు,—

క. తిర్యక్ప్రాణుల కైనను
నార్యా, విశ్వాస ముండు ననఘమతులకున్ ;
వార్యంబు గాదు సాధుల
మర్యాద స్వభావసిద్ధిమహితం బగుటన్. ౯౫

మఱియు,—

క. గానకొని యెంతయు రేఁపిన,
జనియింపదు వికృతి సాధుజనచిత్తములన్ ;

వనరాశినీటఁ గ్రాఁపఁగ
ననువుపడునె కసవుపంజు లంటించుటచేఁ.' ౯౬

అందులకు హిరణ్యకుఁడు పల్కుచున్నాఁడు. - చపలుఁడవు నీవు. చపలునితో చెలిమి యేమాత్రమును చేయరాదు. అట్లు పెద్దలు చెప్పియున్నారు:—

ఆ. కాకి, మేఁక, పిల్లి, కాపురుషుఁడు, దున్న,
పంచకంబు నమ్మ వంచకంబు,
కాన నోకుమార, వీని నేనింటిని
నమ్మకుండ నెప్డు నెమ్మి బ్రదుకు. ౯౭

మఱియొకటి; ఏమన, - నీవు మాకు శత్రుపక్షము వాఁడవు. అదియును పెద్దల సూక్తమే.

ఆ. చక్కఁ సంఘటించుసంధిచే నైనను
బగతుతోడిచెలిమి బాగు గాదు;
తివిరి నీళ్ళ నెంత తెరలంగఁ గాఁచిన
నగ్ని మీఁదఁ బోయ నార్పకున్నె? ౯౮

ఆ. విద్యచేత నెంత వెలుఁగొందుచున్నను,
దుర్జనునిఁ ద్యజింపు దూరమందె;
ఫణముమీఁద మేటిమణి వెల్గుచున్నను.
భయము గల్గకున్నె పాముఁ జేర. ౯౯

ఆ. అగున దెప్పటికిని నయ్యెడిఁ దప్పక,
కాని దెప్పటికిని కానె కాదు,

బండి నీటిమీఁదఁ బాఱంగ నేరదు,
పడవ నేలమీఁద నడవలేదు. ౧౦౦

మఱియు,—

ఆ. అధికమయిన యట్టియర్థంబుచే నైన
విమతులందు నెవఁడు విశ్వసించు,
రక్తుఁ జా నెవఁడు విరక్త యౌ నాలిపై,
నంతతోనె యాతఁ డంత మొందు.' ౧౦౧

అందులకు లఘుపతనక మిట్లు బదులుపల్కెను:— 'నీవు చెప్పినదెల్ల నేను వింటిని, అయినను నాకు ఇదే సంకల్పము; ఏమన, నీతో తప్పక చెలిమి చేయవలసినదని. అది నెఱవేఱదేని తిండి మానుటచే ఆత్మహత్య గావించికొనెదను. అట్లే; ఏలన,—

ఆ. పగులఁగొట్ట సులువు, తగిలింప వహి లేదు
మంటికుండఁ బోలె నొంటుజనుని
పగులఁగొట్టఁ గడిఁది, తగిలింప సులభంబు
స్వర్ణఘటముఁబోలె సత్పురుషుని. ౧౦౨

మఱియు,—

ఆ. సర్వలోహములకు సంగతి ద్రవముచే,
ఖగమృగాదులకగుఁ గారణమున,
పామరులకుఁ గల్గు భయలోభములచేత,
చూడ్కిమాత్రముననె సుజనుల కగు. ౧౦౩

మఱియు,—

ఆ. నారికేళ ఫలమునకు సమాకారుండు
చక్క నరసి చూడ సాధుజనుఁడు;
పైకి మాత్రమే విభాసురుం డగుచుండు
కాపురుషుఁడు రేఁగుఁగాయ వోలె. ౧౨౪

మఱియు,—

ఆ. సాధువులకుఁ దొంటిసఖ్యంబు విఱిగిన
గుణము లించుకేని గొఱఁతపడవు,
తమ్మితూఁటి విఱిచి దవ్వుగా నీడ్చినఁ
దెగక తంతు లనుగతించునట్లు. ౧౨౫

మఱియు,—

తే. శుచితయును, దానశీలత, శూరతయును,
దుఃఖమందును సుఖమందుఁ దుల్యతయును,
శూర్మి, మోమోట, నిజమె వాక్రుచ్చుటయును,
నెనిమిదియు నివి చెలికానిగొనము లరయ. ౧౨౬

ఈ గుణములచేత భూషితుఁడైన పురుషుని నిన్నుఁ దక్క నేనెక్కడ సంపాదింపఁగలను ?'

ఆతని యీమాటలు విని హిరణ్యకుఁడు లాఁగనుండి వెలువడి యిట్లనియె;—'నీ యీ వచనామృతముచేత నేను తనివిఁజెందితిని. అట్లు చెప్పియున్నారు;

ఆ. సాధువాక్కు ప్రీతిసద్భక్తిసహితంబు
సుకృతిమనము నెంతచూఱ గొనునొ,

చల్లజలక, మాణి సరులు, చందనములు,
ఘర్మహాతుని కంతశర్మ మిడవు. ౧౦౭

మఱియు,—

ఆ. చపలబుద్ధి, యాచ్ఞ, సత్యహీనతయును
బిసము, మంతనముల బయలు సేఁత,
కలాళతనము, ద్యూతకేళి, యొండొండును
కపు పొసఁగులు నేస్తకానియందు. ౧౦౮

ఈ నీ మాటలఁబట్టి యరయ నిం దొక్క దోసమేని
నీయందుఁ గనఁబడదు. ఏలయన,—

క. పాటవము సత్యవాక్యత
మాటలబడిఁ దెలియు, మఱి సమక్షతయె వెసఁగా
జాటు నలోభతనుం బరి
పాటి నచపలతను, వేఱు పల్కులిఁ కేలా? ౧౦౯

మఱియు,—

ఆ. స్వచ్ఛ మయినయట్టి స్వాంతంబు గలవాని
చెలిమి వేఱురీతిఁ జెలఁగుచుండు,
శాఠ్యదుష్ట మయినస్వాంతంబుగలవాని
వాక్కు వేఱువగను వఱలుచుండు. ౧౧౦

ఆ. మనసునందు వేఱు, మాటయందును వేఱు,
కర్మయందు వేఱు, దుర్మతులకు;
మనసునందు నొకటె, మాటయందు నొకటె,
కర్మయందు నొకటె, ధార్మికులకు. ౧౧౧

కావున నీ కోరినయట్లే కానిమ్ము.' ఇట్లు పలికి హిరణ్యకుఁడు చెలిమి కావించి కాకిని మేలయిన యోగిరములతో తనియించి లోఁగలోఁ దూఱెను. కాకియు తన తావున కేఁగినది. అప్పటినుండి రెండును ఒకటికొకటి ఆహారము లిడుచు, కుశలము లడుగుచు, నమ్మకముగా మాటలాడుకొనుచు, కాలము గడపుచుండినవి.

ఒకానొకప్పుడు కాకి హిరణ్యకునితో 'చెలికాఁడా, ఈచోట నిపుడు కాకికి ఆహారము దొరకుట మిక్కిలి కష్టముగానున్నది. కావున ఈచోటు వదలి మఱియొకచోటికి పోఁగోరుచున్నాను' అని చెప్పెను. అందులకు హిరణ్యకుఁడు పలికెను,—

ఆ. 'తావుఁ దలఁగ శోభఁదలఁగుఁ గేశంబులు,
నఖములును రదములు నరులు నట్లె;
ఈరహస్య మెఱిఁగి యెడలకే యుండును
మతిగలాఁడు తనదుమనికితమును.'' ౧౧౨

కాకి చెప్పుచున్నది.-"మిత్రుఁడా, అది కాపురుషుల మాట. ఏలన,—

క. మనికి విడి వేఱు మనికిన్
జనెడిఁ గరులు సింగములును సత్పురుషులునున్,
మనికిన యుండి నిధనమున్
గనెడిన్ గాకులు మృగములుఁ గాపురుషులునున్.'

హిరణ్యకుఁడు పలికెను:- 'మిత్రుఁడా, ఎచ్చటికిఁ బోవుదము? ఇట్లు చెప్పియున్నారు:—

ఆ. కదలుఁ బ్రాజ్ఞుఁ డొక్కపదముచేతను మున్న
నిలుచు నొక్కదానఁ జలన మేఁది,
మీఁదితావుఁ దా సమీక్షణ సేయక
తొంటితావునుండి తొలఁగఁడెపుడు. ౧౧౮

చక్కఁగా చూచినతావు ఒకటికలదని కాకిచెప్పెను. అదియేదని హిరణ్యకుఁ డడిగెను. 'దండకారణ్యములో కర్పూరగౌరమను పేరి సరస్సు గలదు; అందు నాకు చిరకాలమునుండి సంపాదింపఁబడిన మిత్రుఁడు మంథరుఁడను తాఁబేలు స్వభావముచేతనే ధార్మికుఁడు కలఁడు. ఏలయన,—

*క. పరులకు ధర్మము కరము సు
కరముగ నెల్లరును జెప్పఁగలరు ధరిత్రిన్,
నిరతిగ నాధర్మమె తమ
రరుదుగదా చేఁత యేమహాత్ముఁడొ దక్కన్. ౧౧౯

అతఁడు మంచిమంచి చేఁపలం బట్టితెచ్చి నాకుఁ బెట్టి నన్నుఁ బోషించును.'

---

*తే. ఒజ్జ లెల్లవారు నుపదేశ మొసఁగింప
ధర్మమార్గములను దక్కొరులకుఁ,
దామె యాచరింపఁ దఱివచ్చినప్పుడు
మూఢు లగుదు రట్టి మునులు గూడ.

అందులకు హిరణ్యకుఁడు పలికెను:- 'అట్లయిన నేను మాత్ర మిట నిలిచి యేమిచేయవలయును ? ఏలయన—

క. ఏనాట లేదొ జీవిక
యేనియు, విద్యాప్తి యెద్దియేనియుఁ, జుట్టా
లేనియు, నొకసత్కారం
బేనియు, నానాఁడు విడిచి యేఁగఁగ వలయున్. ౧౧౬

మఱియు,—

క. ధనికుండు, శ్రోత్రియుండును,
జనపతియును, నేఱునున్, భిషగ్వరుఁడును నాఁ
జనునీయేవురు నేతా
వున లేరో యట వసింపఁ బోలదు వత్సా ! ౧౧౭

మఱియు,—

క. జీవనము, భయము, లజ్జయు,
నీవియు, దాక్షిణ్య మనెడియీయేనును నే
తావున లేవో యచ్చటఁ
గావింపం దగదు సుమ్మీ కాపురము సఖా ! ౧౧౮

మఱియు,—

క. అట మిత్ర, నివాసము దగ,
దెట నీనాలుగును లేవొ, యేవి యనంగాఁ,
దటపూర్ణ సుజల నదియున్,
బటు వగువెజ్జు, ఋణదాత, వైదికవరుఁడున్. ౧౧౯

కావున నన్నుఁగూడ నటకే కొనిపొమ్ము.'

తర్వాత కాకి ఆచెలికానితోఁగూడ విచిత్రమయిన కథలు చెప్పుకొనుచు, సుఖముగా ఆసరస్సుకడకు పోయెను. అంతట మంథరుఁడు దూరమునుండి చూచి లఘుపతన కునికి తగిన యాతిథ్యము సలిపి, ఎలుకకును అతిథి పూజ గావించెను. కాకి యిట్లనియె:- 'చెలికాఁడా మంథరుఁడా, ఈయనకు విశేషమయిన పూజం గావింపుము; ఏలయన, ఈయన పుణ్యము సేయువారిలో అగ్రగణ్యుఁడు, హిరణ్యా కుఁడను పేర మెలుకదొర. ఈయనయొక్క గుణములను పొగడుటకు రెండు వేలనాలుకలతోడి నాగేంద్రుఁడు ఒక వేళ సమర్థుఁడయిన సయ్యెను.' ఇట్లుపలికి చిత్రగ్రీవుని కథలు వర్ణించెను. మంథరుఁడును ఆదరముతో హిరణ్యా కుని సత్కరించి 'అయ్యా! నీకు మంగళము; నీవు జనులు లేని యడవిలో నుండినందులకు కారణమును చెప్పవల యును.' అనియడిగెను.

## హిరణ్యాకుని పూర్వ వృత్తాంతము.

హిరణ్యాకుఁడు ఇట్లనియె; 'చెప్పుచున్నాను వినుము— చంపకావతియను పట్టణములో సన్న్యాసులమఠ మొకటి కలదు. అందు చూడాకర్ణుఁడను సన్న్యాసి వసించియుం డెను. అతఁడు తినఁగా మిగిలిన బిచ్చపుటన్నముతోడి బిచ్చపుఁ బాత్రమును చిలుకకొయ్యకు తగిలించి నిద్రించు చుండును. నేను ప్రతిదినము ఎగిరి ఆ యన్నమునుతిను చుందును. ఇట్లుండఁగా అతని ప్రియమిత్రుఁడు వీణాకర్ణుఁ

డను సన్న్యాసి వచ్చెను. అతనితో నానావిషయ సంభాషలోనుండియు చూడాకర్ణుఁడు నన్ను జడిపించుటకై చీలిన వెదురుతుంటతో నేలను గొట్టుచుండెను. దానిం గని వీణాకర్ణుఁడు ఇట్లనియె.—'సఖుఁడా, నీవేల నామాటయందుఁగాక వేఱెందో ఆసక్తిఁ బూనియున్నావు? ఎట్లనఁగా,—

ఆ. నెమ్మి గల్గుమోము, నిర్మలం బగుచూపు,
మాట వినఁగ గోర్కి, మధురవాణి,
అధికమయినప్రేమ, యాదరాతిశయంబు,
కూర్మిగల్గునతనిగుర్తు లాఱు. ౧౨౦

ఆ. తుష్టి లేనియావి, తొలిచేతఁ దలఁపమి,
మాటవరుసఁ బేరుమఱచుటయును,
గారవింపమియు, నకార్యంబు సాటుట
కూర్మిసన్నవానిగుర్తు లైదు.' ౧౨౧

అందులకు 'భవ్యుఁడా, నేను విరక్తుఁడనుగాను; ఇదె చూడు, ఈయెలుక నాకు చెఱుపు సేయుచున్నది. సర్వదా నాపాత్రలోని భిక్షాన్నమును తినుచున్నది.' అని చూడాకర్ణుఁడు ఉత్తరము చెప్పెను. వీణాకర్ణుఁడు, చిఱుకకొయ్యఁ జూచి యిట్లనియె; 'ఎలుకయెంత! దానిబలమెంత! ఎట్లది యింతఎత్తు ఎగురఁగలదు? కావున నిందులకేమో కారణముండును. పెద్దలు చెప్పియున్నారు:-

క. అమ్మరొ, వెడఁగే శాండిలి
యిమ్ముగఁబ్రబ్బయిననువ్వు లిడి సరిసరిగాఁ

దె మ్మని ముడినవ్వులు గొన ?
నమ్మను యిందేమొ కారణము గలదు సుమీ.౧౨౨

'అది యెట్లని చూడాకర్ణు డడిగెను; వీణాకర్ణుడు చెప్పుచున్నాడు :—

'ఒకానొకప్పుడు నేను వర్షర్తువులో వ్రతగ్రహణము కై యొక నగరమున నొక బ్రాహ్మణ గృహిని బస యిమ్మని వేడితిని. అతడు బస యిచ్చి నాకు శుశ్రూష గావించుచుండెను. నేనును సుఖముగా నా దేవార్చనను జరుపుకొనుచు నుంటిని. ఆ మఱునాడు వేకువను నేను మేలుకొనగా ఆ బ్రాహ్మణుడును, బ్రాహ్మణియును మాట లాడుకొనుచుండిరి. నేను వారి మాటలను అక్కఱతో వింటిని. బ్రాహ్మణుడు వచించెను—'ప్రియా, దక్షిణాయన సంక్రాంతి వచ్చుచున్నది, దానమునకు అనంతఫలము నిచ్చునది. సూర్యు నుద్దేశించి నీవొక బ్రాహ్మణునికి భోజన మిడవలయును.' అంతట బ్రాహ్మణి పరుషవచన ముల నాతనిం బెదరించుచు నిట్లనియె :—'దారిద్ర్యోప హతుడవు, నీయింట భోజన మెట్లు కలుగును? ఇట్లు నన్న డుగుటకు నీకు లజ్జలేదా? నీచేత బడి నాగతి యిట్లయినది. ఎన్నడును సుఖము లేను; మంచియన్నములేదు; చేతికి కే మియు లేదు; కాలి కంతకుముందే లేదు.' ఆమాటలకు జం కియు విప్రుడు అల్లనల్లన నిట్లనియె :—'ప్రియా, నీవిట్లు చెప్పవచ్చునా? పెద్దలమాట వినుము :

క. తనబోనములో సగమై
ననునర్థికిఁ బెట్టనట్టి యాతని కేరీ
తిని గల్గు నెపుడు నెందును
తనకోరినయట్టి భూరితర విభవంబుల్ ? ౧౨౩

క. ఘనహేమ దానములచే
ధనికుం డేఫలము నొందు, దాని దరిద్రుం
డును జెందుఁ గాకిణి యి
చ్చిన, నని బుధపుంగవులు వచింపఁగ వినమే. ౧౨౪

ఆ. అల్పుఁడయ్యు, నిచ్చునతఁడె లోకహితుండు
అధికుఁ డయ్యు, నియ్య నతఁడు గాఁడు ;
మంచినీళ్ళనూయి మానవప్రియ మగు,
ఉప్పునీటికడలి యొ ప్పెనయదు. ౧౨౫

అట్లేకదా,—

ఆ. త్యాగమహిమలేని దరిజేసి కేలరా
రాజరాజ నామ రావణంబు ?
నిధులు గాచువాని బుధులు నుతింతురే
ఎందునే నితఁడు మహేశుఁ డనుచు ? ౧౨౬

క. దానంబును గురియుటచే,
నేనుఁగు క్షీణించియును వహించును వినుతిన్ ;
దానంబు లేక సతతము
పీనాంగం బయ్యు ఖరము వినుతిం గనునే ? ౧౨౭

క. జలమును మాత్రమె యిచ్చుచు
జలదుఁడు ప్రియుఁడగును సకలజనములకు నిలన్;
అలయక చే సాఁచుచుఁ గ
న్నులనేర్చును మిత్రుఁ డయినను గనుఁగొనఁగాన్.

తే. మంచిపాత్రంబు, కడుశ్రద్ధ, మంచిచోటు
మంచికాలంబుఁ గూడ, సమంచితముగ
నేమి యిత్తురో, యది ఫలియించు మీఁద
నతులభాగ్యపరంపర నంద్రు బుధులు.' ౧౨౯

ఇట్లు పతిచేత ప్రబోధితయై బ్రాహ్మణి అంగీకరించి 'అట్లయిన, ఇంట కొంచెము నువ్వు లున్నవి. వానిని ఒలిచి పప్పుచేసి నూఁబోడి చేసి దానితో బ్రాహ్మణునికి అన్నము పెట్టెదను' అని వచించెను. అందులకు బ్రాహ్మణుఁడు సంతసించి ఊరిలోనికిం బోయెను. అనంతరము ఆమె తిలలను వేఁడినీళ్లతోఁ గడిగి దంచి తెల్లపప్పు గావించి యెండఁబోసి యింటిపని చేసికొనుచుండఁగా వానిలో కుక్కయొకటి మూత్రోత్సర్గము కావించినది. ఆ చెట్టంగని యామె, 'అయ్యో, పెడమొగమైయున్న విధియొక్క నేర్పును చూడుము! ఈ నువ్వులను అభోజ్యములను గావించినది. కావున నేను వీనింగొని యొవరి యింటికేనిం జని ఒలుపుఁ బప్పునకు బదులుగా ముడినువ్వులం దెచ్చికొనెదను. ఇట్లు ఎవరినడిగినను ఇత్తురు' అని యాలోచించుకొని వానింగని ఒక యింటికి వచ్చినది. ఆ సమయాన నేను ఆయింటనే

భిక్షార్థమై వచ్చియుంటిని. ఆమె ఆ యింటి యిల్లాలితో 'ముడినువ్వులకు సరిగా నువ్వుఁబప్పిచ్చెదను గొనుము;' అని పలికెను. అట్లే ఆ యిల్లాలు ముడినువ్వు లిచ్చి నువ్వుఁబప్పు కైకొని లోనికి రాఁగానే, ఆమె పుత్త్రుఁడు కామందకీ శాస్త్రమును చదివినవాఁడు, నీతిదృష్టిచేత 'అమ్మా, యీనువ్వులను కైకొనఁగూడదు. ఈమె తెచ్చిన పప్పును వట్టినువ్వులిచ్చి పుచ్చుకొనఁగూడదు. ఇట్లీమె యిచ్చుటకు కారణ మేదో కలదు.' ఆమాటచే ఆ యిల్లాలు ఆనువ్వుఁబప్పును పరిత్యజించినది. కావున నేనువచించితిని 'అమ్మరో వెడఁగే శాండిలి' ఇత్యాదిని. అట్లే ఇట నీయెలుక బలమునకు అండయగు కారణ మొకటి యుండవలయును' అని నిముస మాలోచించి మరల సన్న్యాసి యిట్లనియె :—
"ఇందులకు కారణము విశేషముగా ధనార్జనమే గావలయును; ఏలన,-

ఆ. ఎల్లతావులందు, నెల్లకాలములందు
ధనము గల్గువాఁడె దండిమగఁడు;
రాజులకు నయితము ప్రాభవంబున కెల్ల
ధనమె మూల మగుచుఁ దనరుచుండు.' ౧౩౦

ఇట్లుచెప్పి ఆసన్న్యాసి గుద్దలి తెచ్చి నాలాఁగను త్రవ్వినవాఁడై చిరకాలమునుండి నేను గడించి పెట్టుకొన్న నాధనమునంతయు పుచ్చుకొనెను. అదిమొదలు నేను దినమునకు దినము బలము ఉడిగినవాఁడనై సత్త్వోత్సాహ

ములు గోలుపోయి నాయాహారము నయినను సంపాదించు
కొనుటకు శక్తిలేక భయముతో మెల్ల మెల్లఁగా సంచరించు
చుండఁగా నన్నుఁగని చూడాకర్ణుఁ డిట్లనియె:—

'ఆ. పసిఁడిచేత నెల్లవాఁడును బలియుండు,
పసిఁడిచేత నగును బండితుండు,
పసిఁడి పోయినంత, పాపము! కను మెల్ల
యాత్మజాతి నసుత నంది యొఁడిఁగె. ౧౩౧

ఆ. అర్థమునకు దూరుఁ డగునట్టినరునికి
నల్పమేధసునికి ననవరతము
స్వల్పనదులు గ్రీష్మసమయమందునుబోలెఁ
జేఁతలన్నియును నశించు మిత్త్రి! ౧౩౨

మఱియు,—

ఆ. కలిమి గల్గ మిత్త్రిగణము సేకూడును,
కలిమి గల్గ బంధుగణము కల్గు,
కలిమి గల్గువాఁడె ఘనుఁడు లోకమునందు,
గలిమి గల్గువాఁడె తెలివి గలఁడు. ౧౩౩

మఱియు,—

ఆ. పుత్త్రహీనునకును మిత్త్రహీనునకును
ఇరువురకును వీరి కిల్లు పాడు,
పరమమూర్ఖునకును బదియు దెసలు పాడు,
నిఖిలములును పాడు నిర్ధనునకు. ౧౩౪

మఱియు,—

ఆ. అవికలంబు లింద్రియములు లవే, పే రదే,
పటుమనీష యదియె, పల్కు నదియె,
అర్థగర్వ మేఁగ, నాతఁడే క్షణములో
వేఱుమనుజుఁ డగును; వింతగాదె?' ౧౩౫

ఇదియంతయు విని నే నిట్లు తలంచితిని :—'ఇఁక నే నిచట నుండఁదగదు. ఇప్పు డీ నావృత్తాంతము నొకరితో చెప్పుకొనుటయు సరిగాదు. ఏలన,—

ఆ. ధనముపోకడయును మనమునతాపంబు
గృహములోనిదుశ్చరిత్రములును
వంచనంబు నభిభవంబు నీయేనింటి
వెల్లడించుకొనుట వెఱ్ఱితనము. ౧౩౬

మఱియు,—

ఆ. ధనమును, మంత్రము, జీవిత
మును, భేషజమును, గుటుంబమునఁ గలఛిద్రం
బును, నవమానము, మానం
బును, దానము, దాఁపవలయు బుధుఁ డెన్మిదియున్.

ఇట్లునుం జెప్పిరి :—

తే. దైవ మత్యంతవిముఖతఁ దాల్చి యుండ,
పురుషకారంబు వితథమై పొలియుచుండ,
మానవంతుఁ డయిన పేదమానవునకు
వనమునం దక్క సుఖ మొందు వసుధఁ గలదు. ౧౩౭

**మఱియు,—**

తే. మానవంతుఁడు చచ్చియేఁ బోనుగాని
దీనభావంబుమాత్రము పూనఁ డెపుడు,
అగ్ని తా నాఱినైనను నాఱుఁ గాని
శీతలత్వంబుమాత్రము చెంద దెపుడు. ౧౩౯

**మఱియు,—**

ఆ. సూనగుచ్ఛమునకు మానవంతునికిని
రెండెవృత్తు లొప్పుచుండు జగతి,
ఎల్లవారిమౌళి నెసలారు టొండెను
అడవిలోన నాశ నుందు టొండె. ౧౪౦

మఱి యాచించి బ్రతుకుటయో, అది అన్నిటికన్న గర్హ్యము.

ఆ. విభవహీనుఁ డుసుఱు వీతిహోత్రుని కిచ్చి
తనియఁ జేయఁ లేని తగునుఁగాని,
ఒరుల కుపకరింప నొల్లనికృపణుల
వలదు వేఁడుకొనుట వలదు వలదు. ౧౪౧

**మఱియు,—**

కొలువు గౌరవమును, నెలవెలుం గిరులను
అంగకాంతిని జర, హరిహరకథ
పాపచయము, నెటు పటాపంచ లొనరించు,
గుణశతముల నల్లి కూల్చు యాచ్ఞ.' ౧౪౨

ఇట్లు విమర్శించుకొని;- 'మఱి నేను ఒరులయన్నము దిని జీవింతునా? అయ్యో, అదియు చావునకు రెండవ దారియే. ఏలన,—

క. సరుజుఁడు, చిరప్రవాసియుఁ
బరాన్నభోజియును, బరభవనశాయియు, నూ
పిరితో నుంటయె మరణము;
మరణం బస నేదో, విశ్రమం బతని కదే.' ౧౭౩

అని యాలోచించుకొనియు లోభముచే వెండియు ధన మార్జింప ఇల్లు చేసికొంటిని. వీణాకర్ణుఁడు నన్ను వెదురుచీలికతో మరలంగొట్టెను. అంత నేను 'లోభముచే పీడితుఁడై తుష్టిచెందనివాఁడు తన్నుఁ దాను చంపుకొనువాఁడే,' అని తలపోసితిని. ఎంత యత్నించినను ప్రాప్తవ్యము కాని దెట్లు చేకుఱును?

తే. పడయ నియతం బయిన దానిఁ బడయు నరుఁడు,
దానిఁ దప్పింప బ్రహ్మకుఁ దరము గాదు,
కాన నే నడ లొందను, గర్వపడను,
నాది నాకే ఘటించు, నొండ్ల కది పోదు. ౧౭౪

మఱియు,—

క. సంతోషామృత తృప్తులు
శాంతాత్ములు పొందుసౌఖ్యసారములోనఁ
ఎంతయును బరువు లిడు ధన
చింతకులకు సుంతయేని చేకుఱదుసుమా. ౧౭౫

మఱియు,—
ఆ. అతఁడె చదివినాతఁ, డతఁడె విన్నాతఁడు,
అతఁడె యాచరించినాతఁ డఖిల,
మాశ నెవఁడు వెన్క కడిచి నైరాశ్యంబు
పాదుకొల్పినాఁడొ స్వాంతమందు. ౧౪౬

మఱియు,—
ఆ. స్వాంత మెవ్వనికిని సంతుష్టమో వాని
కఖిలసంపదలును హస్తగములు,
చెప్పు కాల నున్న క్షితితలం బెల్లను
తోలు గప్పినట్లు గ్రాలుఁగాదె. ౧౪౭

మఱియు,—
తే. ఈశ్వరులద్వారములయందు నీడిగిలక,
ప్రియజనముతోడి యెడఁబాపు వెత లెఱుఁగక,
క్లిబములు వల్కుఖేదంబు లేక, యెవఁడు
బ్రదుకు, నాతండె ధన్యుండు; పరుఁడు మృతుఁడు.

ఏలయన,—
తే. తృష్ణ బుజమునఁ గొని పఱ తెంచుచుండ
జనునకు నదవ్వుగాదు యోజనశతంబు,
హస్తగతమైనయర్థంబునందునైనఁ
దనివిగలవాని కుండ దాదరము నిజము. ౧౪౮

కావున ఇప్పటిదశకు తగినపని యేదో దానిని నిశ్చయించుకొనుట శ్రేయము. పెద్ద లేమిచెప్పి రనఁగా,—

తే. ధర్మ మన భూతదయ యగు, శర్మ మనఁగ
నోవు లేమి సమస్తజంతులకు భువిని,
స్నేహ మన నమ్మకంబు, పాండిత్య మనఁగ
చేయఁ దగు నిశ్లె యనుపరిచ్ఛేద, మనఘ. ౧౫౦

అశ్లో,—
క. ఎప్పుడు విపత్తులు వచ్చునో
యప్పు డుచితము సేయు నెఱుక యగు నేర్పనఁగా;
అపరిచ్ఛేదకు లగుచా
ర్యపరుల కాపదలు నిత్య మాసన్నములే ౧౫౧

మఱియు,—
ఆ. కులముకొఱకు నైన యొకని నుజ్జగింపవలయు,
ఊరికొఱకుఁ గులము నుజ్జగింపు,
నాటికొఱకు నుజ్జనము సేయు మూరిని,
ఆత్మకై త్యజింపు మఖిలభువిని. ౧౫౨

మఱియు,—
ఆ. గొప్పవారి నండగొన్నను జనునికిఁ
గర్మవశముగానె కలుగు ఫలము,
హరునికంఠమునకు నాభరణంబయ్యు
వాయువునె భుజించు వాసుకియును. ౧౫౩

మఱియొకటి,—
ఆ. బాధ లేనియట్టి పానీయమైనను,
భయము తెచ్చుతీయభక్తమైన,

రెంటి నరసి తెలిసికొంటి స్పష్టంబుగా
నెందు సుఖమొ యదియె హితమటంచు. ౧౫౪

ఇట్లాలోచించుకొని నరులులేని యీయడవికి వచ్చితిని; ఏలయనఁగా,—

ఆ. వ్యాఘ్రసింధురముల వనమునఁ దరు విల్లు,
పూలు పండ్లు నీళ్ళు భోజనంబు,
నార మడి, పడుక తృణం, బైన మే ల్గాని,
బంధుమధ్యఁ బేదబ్రదుకు దగదు. ౧౫౫

తర్వాత నాపుణ్యము మొలకయెత్తి, ఈచెలికాఁడు నాయందు స్నేహమువహించి, నన్ననుగ్రహించినాఁడు. ఇప్పుడు ఆపుణ్యము పండి నీప్రాపు సాక్షాత్స్వర్గము నాకు లభించినది. ఏలనఁగా,—

క. భవవిషతరువున నుద్భవ
మవు నరిదిగ రెండుఫలము లమృతమయంబుల్,
కవనరసాస్వాదనముఁ
భవహరణము సాధుబృంద పరిచరణంబుఁ. ౧౫౬

మఱియు,—

క. సారవిహీనం బగుసం
సారంబున మూఁడు గలవు సారము లరయఁ,
నారాయణ పదభక్తియు,
సారనదీమజ్జనంబు, సత్సంగంబుఁ.' ౧౫౭

మంథరుఁ డిట్లనియె.- 'నీవు అతిసంచయము చేసితివి; అందుల దోసంగిది.-విను.

*క. కొలఁదికి మీఱినలక్ష్మికి
నలరెడు భోగంబె రక్ష యారసిచూడన్,
జలపూర్ణతటాకమునకు
నలవడఁగా వాటమయిన యలుగుంబోలెన్. ౧౪౮

మఱియు,—

ఆ. అనుభవంబు లేమి నన్యులకు సమంబు
లోభివానిధనము లోకమందు,
అతని దనఁగ నేల యని, నది పోయిన,
నతఁడొకండె యేడ్చి యలయుఁ గాన. ౧౪౯

అట్లే చెప్పినారు;—

క. దానము ప్రియవాక్సహితము,
జ్ఞాన మగర్వంబు, క్షాంతిసహితము బలముల్,
దానయుతం బగువిత్తం,
బీనాల్గును దుర్లభంబు లీలోకమునన్. ౧౫౦

చెప్పినారు,—

ఆ. చేయఁదగును మితిగ నేకరం బెప్పుడు,
మితిని మించి చేత మేలు గాదు;
ఎక్కుడుగను గూర్చ నక్కఱపడి నక్క
వింటితాఁకు నొంది బిద్దెఁ గనుము.' ౧౫౧

## కథ ౪.

ఆ రెండును (కాకమూషకములు) 'ఆకథ చెప్పు'మని యడిగినవి. మంథరుఁడు చెప్పం దొడంగెను: 'కల్యాణకటక మను నగరములో భైరవుఁడని యొక వేటకాఁ డుండెను. వాఁ డొకనాఁడు మాంసముకై విల్లు కేలఁగొని వింధ్యారణ్య మధ్యముం జొచ్చెను. అచ్చట నొకజింకను చంపి కొని పోవుచుండఁగా వానికి భయంకరమయిన పందియొకటి యెగ పడెను. అంత నావేటకాఁడు జింకను నేలడించి పందిని కోలతో కూలనేసెను. పందియు మేఘమువలె భయంకరముగా గర్జించి వానిని ముష్కములో పొడిచెను; ఆపోటునకు వాఁడు నఱికినచెట్టువలె నేలంగూలెను. ఏలయన,—

ఆ. నీరొ, నిప్పొ, విషమొ, నిశితాయుధమొ, నోవొ,
క్షుధయొ, కొండనుండి కూలిపడుటొ,
కారణం బొకండు కలిగినయంతనే
దేహమును త్యజించి దేహి యేఁగు. ౧౬

వేటకానియొక్కయు, పందియొక్కయు అడుగుల త్రొక్కుడిచేత పామొకటి చచ్చినది. ఇంతలో దీర్ఘరావ మను నక్కయొకటి మేఁతకై తిరుగుచు చచ్చిపడియున్న వానిని, జింకను, వేటకానిని, పందిని చూచి యిట్లు తల పోసెను-'నాకు విస్తారము ఆహారము దొరకినది. కాకేమి,

క. ఏవగఁ దలఁపనివే తా
మే వెతలు శరీరి కెపుడు నేతెంచెడినో

ఆవగనె వచ్చు సుఖములు,
నీవలనన్ దైన్య మొకటి హెచ్చుగ నుండున్. ౧౬౩

కానీ, వీనిమాంసములచేత నాకు మూఁడునెలల భోజనమగును. చెప్పిరిగదా,—

ఆ. మనుజుఁ డీతఁ డొక్కమాసంబునకుఁ జాలు,
రెండుమాసములకు మృగకిటు లగు,
ఒక్కనాటితిండి కురగంబు చాలును,
అల్లెత్రాటి నేఁటి కారగింతు.' ౧౬౪

ఇట్లనుకొని అట్లుచేసెను. నరములత్రాటినిఁ తెగఁ గొఱుకఁగానే విల్లు ఎగిసిపడి దీర్ఘరావమునకు ఱొమ్మునం దాఁకెను. దీర్ఘరావము చచ్చెను. కావున 'చేయఁదగును మితిగ' ఇత్యాదికమును పలికితిని. అట్లే సుమా,—

ఆ. ఏది యిచ్చినాఁడొ, యేది భుజించెనో,
ధనికి నదియె యదియె ధనము సుమ్ము,
ఒరులు క్రీడ సల్పుదురు నీలిగినవాని
దారతోడ వానిధనముతోడ. ౧౬౫

ఇప్పుడు గతమును వర్ణించుటచేత నేమిప్రయోజనము? ఏలయన,—

క. అలవడనిదానిఁ గోరక,
తొలఁగి చనినదానికొఱకు దురపిల్లక, పే
రలజడులకు డీలుపడక,
యెలమి న్వర్తింత్రు పండితేంద్రులు జగతిన్. ౧౬౬

కావున మిత్రుఁడా, నీవు ఎల్లవిధములను ఉత్సాహవంతుఁడవు గావలయును. ఏలయన,—

తే. జనుఁడు మూర్ఖుఁడె యాను శాస్త్రము సదివియు,
నాచరించెడునాతఁడే యా మనీషి,
తాల్మి నేర్చినదివ్యౌషధంబుగూడ
మాటమాత్రాన రోగంబు మాన్ప దెందు. ౧౬౭

మఱియు,—

తే. పూన్కి సేయంగ వెఱచెడు పూరుషునకు
నెంతవిజ్ఞాన మున్నను నేమి ఫలము?
హస్తముననే వెలుఁగుచున్న, నంధకునికి
దీప మేవస్తువును దాను జూపఁగలదు? ౧౬౮

కావున మిత్రుఁడా, యీయసాధారణదశలో ఓపిక సేయవలయును. ఇదియెక్కువ కష్టమని నీవు తలంపవలదు. ఏలయన,—

తే. తే జెనఁగువీరునికిఁ బరదేశ మేది?
ఎందుఁ జొచ్చునో యది గెల్చి యేలు నతఁడు;
ఏయటవిఁ జొచ్చుసింహ, మందే గజములఁ
జక్కడిచి వానిరుధిరామిషముల మెసవు. ౧౬౯

మఱియు,—

తే. కప్ప లెట్లు నిపానంబుఁ గ్రమ్ముకొనునో,
అండజము లెట్లు నేరునో నిండుచెఱువు,

అట్టి యుద్యోగవంతుని నభిసరించు
వశము గోల్పోయి సర్వసంపదలు వేగ. ౧౭౦

మఱియు,—

తే. సుఖ మెటులు వచ్చు నటులె యసుఖము వచ్చు,
నొకటి యొప్పినయ ట్లొండు నొప్పవలయు,
చక్రమున నాకులట్లు సంసారమందు
సుఖములును నసుఖములును సుడియుచుండు. ౧౭౧

మఱియు,—

తే. కడఁక గలవానిఁ, జేఁతలో వడిగలాని,
వ్యసనములు లేనివానిఁ, గ్రియావిధిజ్ఞు,
శూరునిఁ, గృతం బెఱుఁగువాని, సుదృఢసుహృదు
స్స్వయముగా, లచ్చి గోరు నివాసమునకు. ౧౭౨

విశేషముగా,—

తే. అర్థములు లేకయే ధీరుఁ డర్హితుఁడగు,
నర్థములు గల్గియును దీనుఁ డవమతుఁ డగు,
జాళువామాలఁ దాల్చినశ్వాన మెట్లు
చెందును మృగేంద్రపదమును సింగమువలె? ౧౭౩

మఱియు,—

ఆ. విభవదర్పమునకు విఱ్ఱవీఁగఁగ నేల?
విభవ మేఁగినంత వేఁగ నేల?
పడుచు లేచుచుండుఁ బరిపాటిగ నరుండు
చేతఁ గొట్టువడెడిచెండు వోలె. ౧౭౪

మఱియు,—

ఆ. జీవనంబుకొఱకుఁ జేష్టింపకుము తద్ద,
దానిఁ జేసినాఁడు ధాత మున్నె;
కడుపునుండి శిశువు పడినయంతనె చేఁపు
తల్లిచన్ను లిట నిదర్శనంబు.' ౧౭౫

ఈమాటవిని లఘుపతనకుఁ డిట్లనియె:—'కృతార్థుఁడవు మంథరుఁడా, ఎల్లవిధములను నీగుణములు స్తోత్రార్హములు సుమా, చెలికాఁడా,

క. అంచను దెలుపుగ నెవఁడు సృ
జించెనొ, చిలుకను బసరుగఁ జేసెనొ, కడుఁ జి
త్రించెనొ నెమలిని, వాఁడే
కొంచక జీవనము నీకుఁ గుదురుచు మిత్రా! ౧౭౬

మఱియు మిత్రుఁడా, పెద్దలరహస్యమును వినుము:

ఆ. గడన సేయునపుడు కష్టంబు వెట్టును,
వసట యెక్కుడిదు విపత్తులందు,
సంపదలు దలిర్ప సమ్మోహమున ముంచు,
నర్థములు సుఖావహంబు లెట్లు? ౧౭౭

మఱియు,—

ఆ. ధర్మమును బొనర్ప ధనముఁ గోరుటకంటెఁ,
గోర్కు లెల్ల మానుకొనుట మేలు,
అడుసు ద్రొక్కి కాలు కడుగుకొనుటకంటె,
నంటకుండ నూరకుంట మేలు. ౧౭౮

ఏలన,—

ఆ. పొలను మింటియందుఁ బులుగు లెట్లు భుజించు,
వ్యాళములును నేల, మీలు నీట,
అట్లి యెల్లయెడల నందఱును భుజింత్రు
ధనము కలిగినట్టి మనుజు నెపుడు. ౧౭౯

మఱియు,—

ఆ. తేనివలనఁ, గన్నగానివలన, జ్ఞాతి
జనులవలననుం, గృశానువలన,
నీటివలన, భయము నిత్యంబు ధనులకుఁ,
బ్రాణులకుఁ గృతాంతునవలనఁ బోలె. ౧౮౦

అట్లే,—

ఆ. ఆశ వదలుకొన్న నంతరం బిఁక లేదు
అర్థహీనునకుఁ బురాంతకునకు,
దాని కించుకంత దారి యిచ్చితివేని
దాస్య మెక్కు నీదు తలను మిత్ర! ౧౮౧

వేయేల? స్నేహముగా నబుసు లాడుచు నాతోఁ గూడ నిటనే కాలము పుచ్చుచుండుఁడు. ఏలయన,—

ఆ. ప్రాణ ముండువఱకుఁ బ్రణయంబు నిలుచును,
కోపమేని క్షణము సేపె యుండు,
ఎడసిపోవునప్పు డేశంక యుండదు,
వర్తనంబు గొప్పవారి కిట్లు. ౧౮౨

మఱియు,—

ఆ. ఆపదుద్ధరణమునందు సమర్థులు
సత్పురుషున కిలను సత్పురుషులె.
కడిఁది యూబిఁ బడినగంధగజము లేప
గంధగజములే ధురంధరములు. ౧౮౩

అట్లే,—

ఆ. గుణము మెచ్చువాఁడు గుణవంతుఁ జేరును,
గుణము మెచ్చనతఁడు గుణిని గనఁడు,
కాననుండి తేఁటి కమలంబుపైఁ గూడుఁ,
దోడికాఁపుకప్ప గూడ దెపుడు. ౧౮౪

మఱియు,—

క. భువిలో నరులం దొకఁడే
స్తవనీయుఁడు, ఘనుఁడు, సుకృతి, ధన్యతముండున్,
ఎవనివలన భగ్నాశత
సావయరో యర్థులును, శరణుఁ జొచ్చినవారున్.'

చిత్రాంగునిరాక

ఈతీరున నామూఁడును ఇచ్చవచ్చినట్లు తినుచు, తిరుగుచు, తనివి గలిగి సుఖముగా జీవించుచుండినవి. ఇట్లుండఁగా చిత్రాంగుఁడను జింక ఎవనికో భయపడి బెదరివచ్చి వానితోఁ గలసినది. వెనుక వచ్చుచున్న జింకనుచూచి మం

థరుఁడు నీటఁ జొచ్చెను; ఎలుక లాఁగలోఁ దూఱెను; కాకి ఎగిరి చెట్టుకొనకుం బోయెను.

లఘుపతనకము మిక్కిలిదూరము పరికించి భయకారణము నేమియు కానదాయెను. తర్వాత అన్నియు వచ్చి కలసికొని కూర్చున్నవి. 'కల్యాణుఁడా, జింకా, నీకు కుశలము; స్వేచ్ఛగా నీరులోనగునాహారము ననుభవింపుము. ఇచ్చట నీ వుండుటచేత ఈయరణ్యమును సనాథముఁ జేయుము' అని మంథరకుఁ డనియెను. 'అయ్యా, నేను వేఁటకానికి భయపడివచ్చి మిమ్ము శరణుఁజొచ్చితిని; ఏలయన,

తే. లోభమున నేని, భీతికి లోఁగి యేని,
యెవఁడు శరణాగతునిఁ ద్యజియించు వాఁడు
బ్రహ్మహత్యాసమం బగుపాప మొనయు
ననుచు వచియింత్రు తత్త్వజ్ఞు లైనమునులు. ౧౮౬

కావున మీతోఁగూడఁ జెలిమిని గోరియున్నాఁడ.' అని చిత్రాంగుఁడు పలికెను. అంతట హిరణ్యకుఁ డిట్లనియె:- 'అయ్యా, చెలిమి నీకు మాతో నిప్పు డయత్నముగానే సిద్ధించినది. ఏలయన,—

ఆ. తెలియు, ఔరసుండు, కలితసంబంధుండు,
అటులె కులపరంపరాగతుండు,
ఎడరునందుఁ గావఁబడినయతండును
చెలులు నాల్గువగలఁ జెల్లుచుంద్రు. ౧౮౭

కావున నిట నీయింట నున్నట్లే అభేదముగా నుండుము'. ఆమాట విని జింక సంతోషపడి ఇచ్చవచ్చిన మేఁత మేసి నీరు త్రాగి నీటిచెంగటి చెట్టునీడలో విశ్రమించినది. ఏల యనఁగా,—

ఆ. మఱ్ఱిచెట్టునీడ, మధ్యయౌవన చామ,
ఇటుక యిల్లు, నూతి నెనఁగునీరు,
మేప కొనఁగు వెచ్చ మెచ్చుగా నీతున,
చలువ గొలుపు నూష్మసమయమందు.' ౧౮౮

తర్వాత మంథరుఁడు 'చెలికాఁడా, జింకా, ఎవనికి భయపడితివి? ఈనిర్జనవనములో వేఁటకాండ్రెచటనేని ఎప్పుడేని సంచరింతురా ఏమి?' అని యడిగెను. జింక యిట్లనియె. 'కళింగదేశములో రుక్మాంగదుఁడని రాజొకఁడు కలఁడు. అతఁడు దిగ్విజయంపువరుసలో వచ్చి, చంద్రభాగానది యొద్దున విడిసియున్నాఁడు. తెల్లవాఱునప్పటికి అతఁడు ఇచ్చట కర్పూరసరస్సుకడకు వచ్చునని వేఁటకాండ్ర మాటలవలన నానుడి కలిగియున్నది. కావున ఇటకూడ తెల్లవాఱిన తర్వాత ఉండుట అపాయకరము. అది ఆలోచించి ఏమిచేయఁదగునో అట్లుచేయుఁడు.' ఆమాటవిని భయపడి తాఁబేలు 'నే నింకొకచెఱువునకుం బోయెదను,' అనెను. కాకియు జింకయు ఆలోచించి, 'అట్లే చేయుము,' అనిచెప్పినవి. హిరణ్యకుఁడు ఆలోచించుకొని యిట్లనియె: 'మఱియొక చెఱువునం జేరినపిమ్మట మంథరునికి క్షేమమే;

నేలను పోవుచుండఁగా ఆపదం దొలఁగించుకొనుటయెట్లు ?
ఏలయన,—

ఆ. నీరమే బలంబు నీటిజంతువులకు,
దుర్గమే బలంబు దుర్గ్గులకు,
శ్వాపదంబులకును స్వస్థానమె బలంబు,
పరియ మేటిబలము పార్థివులకు.' ౧౮౯

అందులకు లఘుపతనకుఁడు 'మిత్రుఁడా, ఆయాసము యయినకు ఏదేనియుపాయ మాలోచించుకొనవలయును.' ఆమాట విని మంథరుఁడు ఆచెఱువును వదలి తరలెను. హిరణ్యకాదులును దానివెంబడినే పోవుచుండినవి. నేల మీఁద పోవుచున్న యాతాఁబేటిని వేఁటకాఁడొకఁడు అడవిలో తిరుగుచు చూచి పట్టుకొని ఎత్తి వింటికి కట్టి, ఆఁకటికి దప్పికి శ్రమపడుచు, తనయింటికేసి పోవుచుండెను. కాక మృగమూషకములు మిక్కిలిదుఃఖము పొంది వాని వెంటనే పోవుచుండినవి. అంతట హిరణ్యకుఁడు ఇట్లు వం దురెను :

క. కడఁగాన నొకవగపునకుఁ
గడలికిఁ బారమును బోలెఁ, గ్రక్కున వగపుం
గడలి మఱియొకటి లోఁగొనె,
నిడుమలు బడిబడినె దొడరు నెడరులయందున్. ౧౯౦

తే. సుకృతవశత నకృత్రిమసుహృదుఁ డబ్బ
నరయుమి యకృత్రిమంపు సౌహార్దమేమొ ?

ఏది యాపదలందును నెడసిపోదొ
అది సుమ యకృత్రిమంపు సౌహార్ద మనఁగ. ౧౯౧

తే. తల్లియందును, బ్రాణ మహాదారయందుఁ,
బుత్త్రినందును మఱి తోడఁబుట్టునందు
నమ్మకం బటు నరునకు నాటుకొనదు,
ప్రకృతి మిత్త్రునియందు నాటుకొనుభాతి.' ౧౯౨

అని మెండుగా విలపించి, ఇట్లు చింతించెను—
'అహహో! ఏమి నా దుర్దైవము;—

క. నాకర్మముల ఫలములే
నాకుం బ్రాపించె శుభము నా నశుభము నా,
మేకొంటి వాని నే నా
యా కాలములఁ భవాంతరాప్తుఁడ పోలెన్. ౧౯౩

క. కాయము నిత్యంబును సా
పాయము, సంపదలు దాఁపులగు నిడుమలకున్,
పాయుట కే కూటములగు,
మాయుట కే వస్తువితతి మహిని జనించున్.' ౧౯౪

విమర్శించుకొని,—

'క. కుం దనెడిఁ పుని గెడవును,
గందువు ప్రీతికిని నమ్మకమ్మునకును, నీ
సుందరవర్ణద్యుతియును
నుం దా నెవ్వఁడు సృజించెనో మిత్త్రాఖ్యన్. ౧౯౫

మఱియు,—

మ. నయనప్రీతి రసాయనంబు, హృదయా
నందంబు నై, యెప్డుఁ దో
డయి దుఃఖంబు సుఖం బకృత్రిమ సఖుం
డాత్మైకతం బొందెడిన్ ;
దయివాఱన్ విభవంబు, వత్తురు సఖుల్
ద్రవ్యాశచే నెందఱో,
యయినన్ వారలవన్నెఁ జెప్ప నొరగ
ల్లోఁ జూపె యిక్కట్టునన్.' ౧౯౬

ఇట్లు పనవి పనవి హిరణ్యకుఁడు చిత్రాంగ లఘుపతనకులతో—'మిత్రులారా, ఈ వేఁటకాఁడు అడవి దాఁటిపోక ముందే మంథరుని విడిపించుటకు యత్నము సేయుదము,' అనెను. 'చేయవలసిన విధములు త్వరగా చెప్పుము' అని ఆ రెండు నడిగినవి. 'చిత్రాంగుఁడు నీటి కడకేఁగి తాను చచ్చిపడియున్నట్లు అగపడుచుకొనును గాక; కాకి దానిపై నెక్కి ముక్కుతో ఏమేమో గీఱుచుండును గాక; అంతట నిశ్చయముగా ఈ వేఁటకాఁడు అచట తాఁబేటిని క్రిందఁబెట్టి జింకమాంసమున కాసపడి వడిగా పోవును. అంతట నేను మంథరుని యురులను తెగఁగొఱికెదను' అని హిరణ్యకుఁడు చెప్పెను. చిత్రాంగ లఘుపతనకులు త్వరగా పోయి అప్రకారము చేయఁగా, ఆ వేఁటకాఁడు అలసి నీళ్లుత్రాగి చెట్టుక్రింద కూర్చుండి ఆతీరున

నున్న జింకను జూచి వెంటనే కత్తెర తీసికొని సంతోష ముతో దానికడకు నడచెను. ఈ లోపల హిరణ్యకుఁడు వచ్చి ఉరులు త్రెంపఁగా తాఁబేలు వడిగా చెఱువులోఁ జొచ్చెను. సమీపించిన వేఁటకానిం గాంచి జింక లేచి పాఱి పోయెను. మరల వచ్చి వేఁటకాఁడు చెట్టుక్రింద చూచు కొను నప్పటికి తాఁబేలు లేదు. అంతట వేఁటకాఁడు ఇట్లు తలపోసెను:—'చక్కఁగా చూచుకొనకుండ ప్రవర్తించి నట్టి నాకు ఇది తగినదే. ఏలయనఁగా,—

క. స్థిరము విడిచి యెవ్వం డ
స్థిరమునఁ గొనఁ బాఱు, వానిచేతికి నాయ
స్థిర మబ్బదు సరియకదా,
స్థిర మదినష్టంబు తొలిఁ ద్యజించినకతనన్.' ౧౯౭

ఇట్లు దుఃఖితుఁడై వాఁడు తన తప్పిదముచేతనే నిరా శుఁడై యూరికిం బోయెను.

క. వలయున్ మిత్రులఁ జేర్పఁగ,
వలయున్ దుర్గమవనముల వసతిం జేయన్;
ఎలుక విడిపించెఁ గాదే
యలమృగయుని చేతఁబడిన యాతామేటిన్. ౧౯౮

మంథరాదులందఱును ఆపదలీఱి తమతావు చేరి సుఖ ముండిరి.'

ఇట్లు విని రాజకుమారులు సంతోషించి 'మేము అంతయు వింటిమి; సుఖుల మైతిమి. మాకోరిక ఈడేరినది'

అని పలికిరి. విష్ణుశర్మ యిట్లనియె,—'ఇంతటితో మీకోరిక తీరినది. అయినను ఇదికూడను అగును గాక!

ఉ. ఓయన సజ్జనుల్ సఖుల
　　నొందుత, నాటను లక్ష్మికేరుతన్,
నాయ మెలర్పఁగా ధరణి
　　నాథులు ప్రోచుత ధారుణీప్రజన్,
మీాయెదకున్ ముదం బిడుత
　　మిక్కిలి నీతి నవోఢకైవడిన్,
శ్రీ యిడుతన్ గిరీశ్వరశశి
　　శేఖరుఁ డాదట నెల్లవారికిన్.' " 　　౧౯౯

మిత్రలాభము సమాప్తము



# సుహృద్భేదము

అనంతరము రాజపుత్త్రు లడిగిరి.- " 'అయ్యా మిత్త్రలాభము వింటిమి. ఇప్పుడు మేము సుహృద్భేదమును వినఁ గోరుచున్నాము.' విష్ణుశర్మ వచించెను:—'సుహృద్భేదమును వినుఁడు. అందు ఇది మొదలిశ్లోకము,—

ఆ. బొబ్బమేకముతోడ గిబ్బకు వనములో
నిండుచెలిమి పొదలుచుండఁ గాంచి
చాడిగొట్టు లోభి పాడుజంబూకంబు
చెలిమి చెఱిచి గిబ్బఁ బొలియఁజేసె.' ౧

'ఆకథ యెట్లు?' అని రాజపుత్త్రు లడిగిరి. విష్ణుశర్మ చెప్పం దొడంగెను:-

'దక్షిణాపథంబున సువర్ణవతియని నగర మొకటి కలదు. అందు వర్ధమానుఁడని ఒక వైశ్యుఁ డుండెను. అతనికి ధనము విస్తారముగా నున్నను, తనకన్న నతి సమృద్ధులయిన బంధువులను చూఁడగా, తాను ఇంకను ధనము సంపాదింప వలయునని కోరిక గలిగినది. ఏలయనఁగా,—

క. తనకన్న లేఁడు ధని యని
తనకగపడు, గ్రిందఁ గ్రిందఁ దాఁగనుచున్నన్.

తనకన్నఁ బేద లేఁ డని
తనకగపడు మీఁద మీఁదఁ దాఁగనుచున్నన్. ౨

మఱియు,—

ఆ. బ్రహ్మహంత యైనఁ బరిపూజ్యుఁ డే యగు
ధనము మెండు గాఁగఁ దనరుచున్న,
నెలకు సాటి యైన కొలమువాఁ డైనను
పేద యగును ధనము లేక యయిన. ౩

మఱియు,—

ఆ. అలసుఁ డగుచు, దైవమందె మనం బుంచి,
సాహసంబు గొనక, జతను మాని
యుండువాని లక్ష్మి యొల్లదు చేపట్ట,
ముసలిమగనిఁ బ్రౌఢముదిత వోలె. ౪

మఱియు,—

క. అలసతయు, జన్మభూవ
త్సలతయు, స్త్రీసేవ, రోగితయు, భీరుతయుం,
గలపాటికిఁ దనియుటయున్,
బొలియింప మహత్త్వమును బ్రభువు లీయాఱున్. ౫

ఏలయన,—

క. తనకుఁ గల సంపదకు నే
జనుఁ డల్పంబునకె సంతసముఁ జెందెడి, నా
తనికి విధాతయుఁ దనచే
సినదే చాలు నని పెంపు సేయఁడు దానిన్. ౬

మఱియు,—

క. పూనిక వాలిక్కి, పూజ్యం
బానందము, బలము సున్న, యరులకు ముదముం
దా నిడెడి, నాసుతునికై
కానఁపు నేసతికినేని కలిగింప కజా! ౭

అట్లే చెప్పిరి,—

ఆ. అబ్బకున్న యర్థ మాసింపు మెంతయు,
అబ్బినప్డు కావు మాదరమున,
కాచి దాని లెస్సగా వృద్ధి గావించి
తీర్థవర్గమందుఁ దిరము సేయు. ౮

క. దానోపభోగవంధ్యత
నేనరుఁడు దినంబు లెల్ల నేఁగించెడినో,
ఆనరుని కేడ జీవము?
తా నూర్పునఁగాక కొలిమిదరితిత్తి వలెన్. ౯

ఏలయనఁగా:- లేనిధనమును కోరనివానికి, ప్రయోజనమునుబట్టి చూడఁగా, ధనము లేనియట్లే; దొరకిన దానిని కాపాడుకొననియెడల నిధియైనను స్వయముగా నశించును; వృద్ధిసేయనిధనము కాటుకవలె ఎంతకొంచెపాటి వ్యయముచేతనయినను క్షీణించును. అనుభవింపని ధనము నిష్ప్రయోజనమే. అట్లేగదా చెప్పినారు;—

తే. తానుఁ గుడవని యీయని ధన మదేల?
పగతురను నొంపలేని యాబలము నేల?

ధర్మము చరింపఁ గాని శ్రుతంబు నేల?
అవిజితేంద్రియుఁ డైనమానవుఁడు నేల? ౧౦

మఱియు,—

*తే. పుట్ట లిసుమంత నిడనిడఁ బొదలు పెఱిఁగి,
పుడుకఁ బుడుకంగఁ గాటుక పోకఁజూచి,
విత్తసముపార్జనము సేయు వృత్తులందుఁ
జిత్త మిడినట్టి వానికిఁ జేటు లేదు. ౧౧

తే. బొట్టుబొట్టుగఁ బడునీటిపోఁతచేత
ఘటము క్రమముగఁ గొంతసేపటికి నిండు;
అదియ సాటువు సర్వవిద్యాధిగతికి,
దానకర్మకు, నట్లె యధ్యయనమునకు.—' ౧౨

ఇట్లు తలపోసి సంజీవక నందకములనెడి యెడ్లను రెంటిని పూంచి, బండినిండ నానావిధద్రవ్యము లెక్కించి, వర్తకమునకై కాశ్మీరమునకుం దరలెను. ఏలయనఁగా,—

తే. అతిభరం బొండుగలదె సమర్థులకును?
దూర మొక్కటి గలదె యుద్యోగులకును?
విద్యగలయాతనికి లాఁతివిషయ మేది?
ప్రియము పల్కెడువానికి ద్వేషి యెవఁడు? ౧౩

తర్వాత నతఁడు పయనము నడచుచుండఁగా సుదుర్గ మనుపేరి మహారణ్యములో కొండలో సంజీవకము మోఁకాలు విఱిగిపడినది. దానిఁగని వర్ధమానుఁ డిట్లు చింతించెను:—

క. ఎంతేనియు గృషి సేయుతఁ
బంతంబున నీతిపరుఁడు పరిపరిగతులన్,
అంతియ ఫల మగు దానికి,
నెంత మనంబునను దైవ మేర్పఱిచెడినో. ౧౪

అయినను,

ఆ. అదురుగుండె మానుమా యెల్లవిధముల,
నది విరోధి యఖిలయత్నములకు,
కాన నదురుగుండె మాని కార్యంబులఁ
బెంపుమీఱ నిర్వహింపవలయు.' ౧౫

ఇట్లు చింతించి సంజీవకము నచట విడిచిపెట్టి, వర్ధమానుఁడు తానే ధర్మపురమను పట్టణమునకుం బోయి గొప్ప యెద్దును మఱియొక దానిని గొని నొగకుం బూంచి తరలెను. సంజీవకము ఎట్టకేలకు మూఁడు కాళ్లమీఁదనే తనబరువు వూనుకొని లేచినది; ఏలన,—

తే. మునిఁగిపోయినను మహాసముద్రమందు,
ఉన్నతాద్రి శిరమునుండి యుర్విఁ బడినఁ,
దక్షకుఁడు కోపమున ఘోరదంశమిడిన,
నాయువుంబట్టులను గాచు నాయువున్న. ౧౬

మఱియు,—

ఆ. అబ్ధి మున్గఁగాక, యగ్నిలోఁ బడుఁగాక,
కొండక్రేవునుండి కూలుఁగాక,

ఆటలాడుఁగాక యాశీవిషములతోఁ,
గాదు మృత్యు వెపు డకాలమందు. ౧౭

క. కోలల నూర్లం గొట్టినఁ,
గాలము గాకున్నఁ బ్రాణి కనదు మరణమున్;
కాలము వచ్చినఁ, గుశశిఖ
లీలం దాఁకినను మృత్యులీఢంబ యగున్. ౧౮

ఏలయన,—

తే. కావకున్నను విధిరక్ష గల్గ నిల్చుఁ,
గాచినను విధిహతము దక్కకయ సమయు,
బ్రదుకు నడవి ననాథుం డరక్షితుండు,
ఇంటఁ గృతయత్నుఁ డయ్యును నెనయు మృతిని. ౧౯

తర్వాత దినములు గడచుచుండఁగా సంజీవకము తన కిష్టమయిన మేఁత లోనగునవి దొరకినందున అడవులలోఁ దిరుగుచు సంతోషముచేత దేహము బలియఁగా బెట్టిదముగా అంకె వైచెను. ఆ యడవిలో పింగళకమను సింహము తన బాహుబలముచే సంపాదించుకొన్న రాజ్యసుఖమును అనుభవించుచు నివసించెను. పెద్దలు చెప్పిరి;-

ఆ. వనిమృగములు సింగమున కభిషేకంబు
చేసి రాజు గాఁగఁ జేసికొనెనె?
విక్రమమున రాజ్య మాక్రమించి కడఁక
నెనయుఁ గాదె యది మృగేంద్రపదవి. ౨౦

అది యొకనాఁడు దప్పిగొని నీరు ద్రాగుటకై జమున కసెమునకు పోయి, అచట ప్రళయకాల మేఘగర్జితము వంటిదానిని, మున్నెన్నఁడును విననట్టి యాసంజీవకధ్వనిని, విని భయపడి నీరు ద్రాగకయే వెనుకకు మరలి తన యునికిపట్టునకు వచ్చి, ఇదేమో అని ఆలోచించుచు ఊరక యుండెను. ఆస్థితిలో నున్న యాసింహమును దానిమంత్రి కుమారులు, కరటకదమనకములనెడి నక్కలు, చూచినవి. అంత దమనకుఁడు కరటకుని 'మిత్త్రుఁడా, ఏల మనదొర నేఁడు దప్పిగొనియు నీరు ద్రాగక వచ్చి యూరకున్నాఁడు?' అని యడిగెను.

కరటకుఁ డిట్లనియె :—'మిత్త్రుఁడా, నేను విశ్వాసముతో నితనిం గొలుచుటలేదు. ఇతని చేష్టల విచారము మన కేల? కావున ఈదొరచేత అవమాన మొందిన వార మయి కడుంగడు దుఃఖము ననుభవించినారము. మఱియు;-

క. ఒడమెకునై సేవించెడు
చెడుగులు సేవకు లదేమి సేసిరొ కనుమా;
ఒడలి స్వతంత్రత యేదో
వెడగులవలె దానిఁ గూడ పీడ్కొని రహహా. ౨౧

మఱియు,—

క. చలి కెండకు గాలికి నే
[illegible]యలజడి పడిపడి పరాశ్రయముం బందుదురో;

తెలివి గలిగి యుం దర్థము
నలుఁగుడుచేఁ దపము సేసినను సుఖ మబ్బున్. ౨౨

మఱియు,—

క. ఇదియే జన్మఫలం బగు,
నెది యనఁగ, స్వాతంత్ర్యవృత్తి నెనఁగుట, మఱియు
ట్లొదవని యన్యాధీనులె
బ్రదికినవారేని, మృతు లెవరో పేర్కొనుమా. ౨౩

క. పాముల నాడింతురు, పర
భామలతోఁ గ్రీడఁ దేలఁ బొల్పుదురు రహిన్,
భూమీశు నేనిఁ గొలిచెద,
రీమనుజుల సాహసంబు నే మనవలయున్? ౨౪

మఱియు,—

క. 'రా, పో, పదు, లే, పలుకుము,
ఛీ పో, నో ర్మూసికొనుము, చెడుగా, బడుగా.'
ఈపగిది నానభూతము
చేపట్టినయర్థి నపహసింతురు ధనికుల్. ౨౫

మఱియు,—

ఆ. అబుధు లర్థలాభ మాసించి యాసించి,
తమ్ముఁ దామె పణ్యతరుణులట్లు,
సంస్కరించుకొనుచు సారెసారెకు లెస్స
పరగుదురు పరోపకరణవృత్తి. ౨౬

మఱియు,—

క. ఏది నిసర్గచపలమో,
యేది పడునో యశుచిమీఁదనే, యర్థి నొయిన్,
ఆదారదృష్టిని సయితము
నాదట సేవకులు దొడ్డ యని యెంతు రరే. ౨౭

విశేషముగా,—

క. ప్రణమిల్లెడు నున్నతికై,
మనుగడకై ప్రాణములను మానక విడుచున్,
వనటమునుఁగు సుఖమునకై,
కనుదుమె వేఱొకని సేవికన్నఁ బిసాళిన్? ౨౮

మఱియు,—

ఉ. మానముచేత మూఁగ, తగు
మాటల వెఱ్ఱియొ ప్రేలుగాయరో,
హీనకులస్థుఁ డోర్వమి, స
హించిన భీరువు, ప్రాయికంబుగా
తోనిలువంగఁ డెంపరి, వి
దూరత నిల్చిన బేలమాసి యా;
నీనెఱి సేవిధర్మము, ము
నీంద్రుల కైన నగమ్య మారయన్.' ౨౯

దమనకుఁ డనియె;—'మిత్రుఁడా, ఎంతమాత్రము ఇట్లు చెప్పఁగూడదు. ఏలయన,—

క. కనుఁగొని యచిరంబుగ, ముద
మెనసి, మహావిభవజాత మిచ్చెడివారిన్
బెనుజతనంబున నేనియు
జననాథుల నేల గొల్వఁ జనదో చెపుమా. ౩౦

మఱియు,—

క. సేవ యొనర్పని వారికి
నేవిధమునఁ గల్గు జల్లు లెగసెడి సిరులున్,
సౌవర్ణదండ మెల్లి మ
దావళరథ జవనహయ పదాతిశ్రేణుల్.' ౩౧

అందులకు కరటకుఁడు పలుకుచున్నాఁడు ;—'అయి నను ఈ వ్యవహారము మన కేల ? జోలిమాలిన వ్యవహార ములయందు ఎంతమాత్రము ప్రవేశింపఁగూడదు. చూడు,—

క. పనిగానిపనిని దిమురునఁ
బొనరింపఁగ నేనరుఁడు పూనుకొనెడినో,
వినిహతుఁడై నాఁ డీల్గును
గొనకొని మేకుం బెరికిన క్రోఁతియుఁబోలెన్.' ౩౨

'ఆకథ యెట్లని దమనకుఁ డడిగెను. కరటకుఁడు చెప్పుచున్నాఁడు :—

కథ ౧.

'పూర్వము మగధదేశములో ధర్మారణ్యముచెంత నొకచోట శుభదత్తుఁడని యొక కాయస్థుఁడు బౌద్ధాలయ

మండపమును కట్టింప నారంభించెను. అందు వడ్రంగి యొక స్తంభమును అంపముతో గొంతకోసి ఆ నఱదలో గూటమును గొట్టియుంచెను. అక్కడికి అడవికోఁతులదండు ఆడుచు వచ్చెను. అందులో నొకకోఁతి యమదండముచే ప్రేరింపఁబడినదియుంబోలె ఆగూటమును రెండుచేతుల తోను బట్టి పెరుక సమకట్టెను. ఆ సమయమున దాని వృషణద్వయము ఆరెండు తుండ్ల నడిమికోఁతలో వ్రేలు చుండెను. తర్వాత ఆకోఁతి తనకు స్వాభావికమయిన చాపల్యముచే బలమంతయు వైచి ఆగూటమును పెకలించి వైచినది. వెంటనే రెండు తుండ్లును చేరుకొనఁగానే వాని నడుమ వృషణద్వయము చిదియఁగా చచ్చినది. కావున నేను 'పనిగానిపనిని' ఇత్యాదికముం జెప్పితిని.'

అందులకు దమనకుఁడు 'అయినను, సేవకుఁడు తప్ప కుండ దొరయొక్క వ్యాపారమును పరికింపవలసినది,' అనెను. కరటకుఁ డిట్లనియె:—'సర్వాధికారమందు నియమింపఁబడిన ప్రధానమంత్రి యెవఁడో అతఁడు అట్లు చేయును గాక. ఏలయనఁగా, సేవకమాత్రునికి ఒరులయధికారమును తడవుట సరిగాదు. చూడు,—

క. దొరమేలు గోరి యెవ్వఁడు
పరాధికారంపుఁజర్చ బరఁగించెడినో,
పొరయును వాఁడు విషాదము,
ఖర మొంగ్రడ రచిఁచి హాతుల గాసిలినగతిఁ.' 33

'ఆకథ చెప్పు'మని దమనకుఁ డడిగెను. కరటకుఁడు చెప్పందొడంగెను:—

కథ ౨.

'కాశిలో కర్పూరపటుఁడని చాకలి యుండెను. వాఁ డొకప్పుడు లేజవరాలగు కాంతతో కడుందడవు క్రీడించి బిగ్గ గవుంగిలించి నిద్రపోయెను. తర్వాత వానివస్తువులను దొంగిలుటకు ఇంటిలో దొంగ చొచ్చెను. దానిముంగిట గాడిద యొకటి కట్టఁబడియుండెను. కుక్కయు కూర్చుండెను. అంత గాడిద కుక్కతో నిట్లనియె. 'ఇది యిప్పుడు నీవని. మఱి నీవేల బిగ్గరగా మొఱిగి దొరను లేపవు?' కుక్క చెప్పినది.—'నాపనిని నీవు విచారింపవలదు. నే నెట్లు రేయుంబవలు నతనియింటిని కాచుచున్నానో నీవే యెఱుఁగవా యేమి? అందుచేత నితఁడు చిరకాలముగా హాయిగా నుండి నాయుపయోగమును ఎఱుఁగకున్నాఁడు. అందువలన నా కిపుడు ఆహారమిడుటకు కూడ మనసొప్పకయున్నాఁడు. ఏలయనఁగా, ఇక్కట్టును గానని యెడల దొరలు సేవకులమీఁద ఆదరము చాల్పరు.' అందులకు గాడిద 'ఓరి మూర్ఖుఁడా, పుట్టుకచేతనే కుక్కజాతి తాఁకఁ గూడనిది. అందులోను సేవకజాతివి నీవు. చూడు.—

ఆ. వేఁడుకొనును గార్యవేళ నెవ్వఁడు, వాఁడు
పాడుభటుఁడు, వాఁడు పాడునఖుఁడు ;

అవసి చనిరె నేని యాకార్య, మపు డేల
యాభటాధముండు నా సఖుఁడును.' 38

కుక్క పలికినది ;—

'క. పనివేళనె నిజభృత్యులఁ
దనియించెడు నేప్రభుం డతఁడునుం బ్రభుఁడే ?
దినదినము గావవలదే
జనపతి భృత్యవ్రజమును సహధర్మచరిన్. 39

ఏలయన,—

క. భృతి యాశ్రితులకు నొసఁగన్,
పతిసేవ యొనర్ప, ధర్మపరిచింతనకున్,
సుతులం బుట్టించుటకున్,
ప్రతిహస్తకు లుండరయ్య భద్రచరిత్రా !' 40

అంతట గాడిద కోపముతో నిట్లనియె ;—'నీవు మహాపాపివి; ఏలయన, ఆపదయందు దొరపనిని ఒప్పరికించుచున్నావు. కానీ, దొరను ఇదిగో నేను మేల్కొలిపెదను. ఏలన,—

క. సేవింపు వీపుచే రవి,
సేవింపుము వహ్నిఁ బొట్టచేతను నియతిన్,
సేవింపుము స్వామి నఖిల
భావంబులచే, నమాయఁ బరమపదంబున్.' 41

ఇట్లు పలికి గాడిద మిక్కిలి బిగ్గరగా ఓండ్రపెట్టెను.

చాకలి ఆయోంద్రకు మేల్కొని నిద్ర చెడఁగొట్టిన కోపాన దుడ్డుగఱ్ఱతో గాడిదను మోఁదెను. దాన నది కాలధర్మము నొందెను.

కావున నేను 'దొరమేలు కోరి' ఇత్యాదికమును చెప్పితిని. మఱియుం జూడుము పసరములను వెదకుట మనపని. మనపనిని చర్చించు కొందము. (ఆలోచించి) ఆచర్చవలన నిప్పుడు ప్రయోజనము లేదు; ఏలయన, తినఁగా మిగిలిన తిండి మనకు విశేషముగా కలదు.'

అందులకు దమనకుఁడు కోపించి యిట్లనియె: 'ఏమి యిది! నీవు ఒక్క తిండికొఱకే రాజును కొలుచుచున్నావా? నీవు చెప్పినమాట సరికాదు. ఏలయన ;

తే. నెయ్యురకు నుపకారంబు నెరపుకొఱకు,
శత్రులకు నపకారంబు సల్పుకొఱకు,
బుధులు నృపసేవ ముదమునఁ బూనుకొంద్రు;
పొట్టమాత్ర మెవఁ డసేవఁ బూడ్చికొనఁడు? 30

క. ఏపురుషుఁడు బ్రదుకొందిన,
బాపలు, బంధువులు, సఖులు బ్రదు కొందుదురో,
ఆపురుషుజన్మ సఫలము
ప్రాపింపఁడు బ్రదుకు నెవ్వఁ డాత్మార్థముగాన్. 31

మఱియు,—

క. బ్రదికిన నెవ్వఁడు పలువురు
బ్రదుకుదురో వాఁ డొకండె బ్రదుకుంగాతన్;

ఉదరంబు నించుకొనదో
చదురునఁ గాకియును దనదుచంచుపుటమునన్. ౪౦

చూడుము,—

క. ఒకఁడు దైవపురాణములకె
ముకుళితహస్తుఁ డయి దాస్యమును బూనఁ గొనున్,
ఒకరుఁడు లక్షకుఁ దనిసెడి,
ఒకరుఁడు లక్షలకు నేని యొల్లఁడు గొలువన్. ౪౧

మఱియు;—

తే. సర్వమానుషజాతియు సమత నుండ,
నందు భృత్యత్వ మన నతినిందితంబు;
అందునం బ్రథముండు గానట్టివాఁడు
ప్రాణిసంతతిలో లెక్కఁ బడయ డొక్కొ. ౪౨

అట్లు చెప్పిరి;—

తే. హయములం, దేన్గులందు, లోహములయందుఁ,
గొయ్యలందును, శిలలందుఁ, గోకలందు,
నెలఁతలందుఁ, బురుషులందు, నీళ్ళయందు
నంతరంబులు గలవు మహాత్తరములు. ౪౩

అట్లు మఱియు,—

ఉ. కుక్కకు నిష్ఫలాస్థి యొక
కొంచెపు స్నాయులుఁ గ్రొవ్వు కంపు నై
దక్కిన దానికే తనివి
దార్కొను; నాఁకలి దానఁ దీఱునే?

ప్రక్కను నక్క వీడి మద
వారణముఁ మృగరాజు గూలుచుఁ
జక్కటి నేనరుండును న్వ
సత్త్వసమానఫలంబె కోరెడుఁ. ౪౪

మఱియు సేవ్యసేవకుల యీయంతరముం బరికింపుము:

తే. వాల మాడించుఁ, గాళ్లతో నేలఁ ద్రవ్వ,
భూమి వెదకిలఁ బడి నోరుఁ బొట్టఁ జూపు,
కుక్క పిండదు ద్రెవాలను; గుంజరంబు
బెట్టుగాఁ జూచుఁ, జాటువుల్ వినుచుఁ గుడుచు. ౪౫

మఱియు,—

తే. మాన మెడలక శౌర్యవిజ్ఞానయుక్తిఁ
బ్రథితముగ క్షణమేనియు బ్రదుకు టేదొ,
అదియె బ్రదుకని బుధవర్యు లభినుతింత్రు;
బ్రదుకుఁ గాకియు సుచిరము గదుకు బలిని. ౪౬

మఱియు,—

తే. మేలుగీళ్లను దలపోయు మెలవు లేక,
నిగమమర్యాదలకు దప్పి నింద వొంది,
కడుపు పూరించుకొనుటె లోకముగ బ్రదుకు
నరపశువు పశువునకన్న నాణె మెట్లు?' ౪౭

కరటకుఁడు 'మనమేమో ప్రధానులముగాము. మఱి మనకేల యీవిచారము?' అనెను. మరల దమనకుఁడు

పల్కుచున్నాఁడు:- ప్రధానతనుగాని, అప్రధానతనుగాని మంత్రియెంతలో పొందెడును ? ఏలయన,—

తే. ఎవ్వఁడును సహజంబుగా నెవనికేని,
 గౌరవార్హుండునుం గాఁడు, ఖలుఁడుఁ గాఁడు;
 తనదుచేష్టితములె తెచ్చుఁ దనకు నెప్పుడు,
 గౌరవము నేనియును, దిరస్కార మేని. ౪౮

మఱియు,—

ఆ. గండశిలను మోచి కొండపై కెక్కింప
 నమిత మైనజతన మభిలషితము,
 దానిక్షణములోన ధరకు ద్రొబ్బఁగ వచ్చుఁ,
 నాత్మ కిట్లి యగు గుణాగుణములు. ౪౯

తే. క్రిందికిం గ్రిందికి న్మఱి క్రిందికి దిగు
 మీఁదికిని మీఁదికి న్మఱి మీఁది కేఁగు
 నరుఁడు తనచేతచేతనే నాయముగను,
 నూతిఖనకుండు వప్రనిర్మాతయుబలె. ౫౦

కావున మంచివాఁడా, తనగౌరవము తనప్రయత్నములోనున్నది.' 'అటులయిన నీవు ఏమిచేయుమని యెదవు?' అని కరటకుఁడు అడిగెను. 'మనదొర పింగళకుఁడు ఏకారణమువలననో భయపడి మరలివచ్చి కూర్చున్నాఁడుగదా?' అని దమనకుఁ డనెను. 'ఆకారణమును నీవెఱుఁగుదువా?' అని కరటకుఁ డడిగెను.- 'ప్రజ్ఞావంతులకు తెలియని దేమున్నది ? చెప్పిరిగదా.—

క. గతిచేతఁ, జేష్టచేఁ, భా
షితమున, దృగ్వక్త్ర వికృతిచేఁ, నాకృతి, నిం
గితములచేత మనీషులు,
మతిలోపలి గుట్టుఁ గంద్రు మహితప్రతిభన్. ౫౧

తే. పల్కునర్థంబును గ్రహించుఁ బసులు గూడ,
కరులు హరులు వహించు హెచ్చరికనుడికిఁ,
జెప్పనిదియును దాఁగ్రహించెడిని జాణ,
బుద్ధికిఁ బరేంగితార్థంపుబుద్ధి ఫలము. ౫౨

కావున నీయసందర్భములో నేను నాప్రజ్ఞాబలముచేత నితని నావానింగాఁ జేసికొనెదను. ఏలన,—

ఆ. అవసరమున కర్హ మైనట్టిమాటయు
నమ్రకమ్మునకు నెన యగుప్రియముఁ
దనదుశక్తికిం దగినయట్టికోపంబు
నెఱిఁగినట్టిఁడే మనీషిసుమ్ము.' ౫౩

కరటకుఁడు పలుకుచున్నాఁడు ;-'సఖుఁడా, నీవు సేవాధర్మ మెఱుంగవు. చూడు ;—

౧. నృపతిఁబ్రోలఁ జొచ్చు నెవఁ డనాహూతుఁడై ;
పెల్లు వాకొనెడి నపృష్టుఁ డయ్యుఁ,
దనకు నతఁడు కూర్చునని యెంచుకొనుచుండు,
దుష్టబుద్ధి వాఁడు కష్టమొందు :* ౫౪

దమనకుఁ డనెను. 'భద్రుఁడా, నేనా సేవానభిజ్ఞుఁ
డను? చూడు ;—

క. సుందరము నసుందర మని
యెందు స్వభావమున వస్తు వెనఁగదు సుమ్మీ;
పొందు నెది యెవనిబుద్ధికి
సుందర మగువాని కది వసుంధరయందున్. ౫౫

ఏలయన,—

ఆ. ఎవనిమనసునందు నేభావ ముండునో,
దాని ననుసరించి వానిఁ జొచ్చి,
మెలపుతోడఁ గరము మెప్పించి మేధావి
తనకు వశ్యుఁ జేసికొనఁగ వలయు. ౫౬

మఱియు,—

క. ఇనుఁ 'డెవ రక్కడ' నన, 'నే'
ననఁదగు, 'సెలవిండు మొదల'యని వేఁడఁ దగున్,
పనిచినపని నవితథముగఁ
దనశక్తికొలంది చేసి తనుపఁగవలయున్. ౫౭

మఱియు,—

క. ఱేనికి నాజ్ఞాభంగము,
భూనిర్జరునికి నవజ్ఞ, పొలఁతికి వేఱే
పానుపు, నివి ఖడ్గముచేఁ
గాని వధంబు లని మదినిఁగణియింపు సఖా! ౫౮

మఱియు,—

ఆ. కొంచెమునకు సంతసించుచుఁ, బ్రజ్ఞతో
నీడవోలె సతము గూడియుండి,
ఆజ్ఞయిడినదాని కట్టిట్టు వల్కక
చేయువాఁడు, నగరఁ జేరఁ దగును.' ౫౯

కరటకుఁడు 'ఒకవేళ అనవసరముగా చొచ్చితివని నిన్ను దొర అవమానించునేమో?' అనెను. అందునకు దమనకుఁడు చెప్పుచున్నాఁడు, 'అట్లే అనుకొమ్ము. అయినను సేవకుఁడు తప్పక సన్నిధిలో నుండవలసినది.

ఆ. చెఱుపగునో యటంచు వెఱచి, యారంభమే
సలుప కుంట పాలసులమతంబు ;
చెప్పవయ్య, యెవ రజీర్ణభయంబున
నన్నభుక్తి మానుకొన్నవారు? ౬౦

చూడుము,—

తే. చెంత నున్నాతనినె ఱేఁడు చేరఁ దివుచు,
హీనకులుని, నవిద్యు, నహృద్యునేని ;
ప్రమదలును, భూపతులు, లతల్, ప్రాయికముగఁ
బ్రక్క నెలకొన్నవానినే ప్రబ్బికొనెడి.' ౬౧

'అక్కడ కేఁగి ఏమిచెప్పెదువు?' అని కరటకుఁ డడిగెను. 'స్వామి నాయందు ప్రీతి కలవాఁడో కాఁడో తెలిసికొనె దను.' అని దమనకుఁ డనెను. 'దానిం దెలిసికొనుటకు చిన్నె

లేమి ?' అని కరటకుఁ డడిగెను. దమనకుఁడు చెప్పుచు న్నాఁడు - 'వినుము.—

ఉ. దూరమునం బెదుర్కొనుట,
తోన హసించుట, ప్రశ్న లడ్గుటన్,
దారపుటాస, చాటునను
దొడ్డతనంబు ప్రశంస సేఁతయున్,
పేరిమి వస్తులందుఁ దల
పెట్టుట, తద్భటులందుఁ బ్రీతియున్,
గూరిమి నీవియున్, గుణతఁ
గొంట దొసంగున, రక్తచిహ్నముల్. ౯౨

క. జరుపుడు పెట్టుట, యాసలఁ
బరివర్ధనచేసి తుదకు భంగించుటయున్,
బరఁగు విరక్తుని గుఱులుగఁ,
బరికింపఁగవలయు వీనిఁ బ్రౌఢి దలిర్పన్. ౯౩

దీని నెఱిఁగిన వాఁడనై యితఁ డెట్లు నాకు వశపడు నో అట్లు పలికెదను. ఎట్లనఁగా :—

తే. చెట్టఁగనుగొని కానున్న యట్టి కీడు,
సాధనము గని కానున్నసాధ్య సిద్ధి,
నీతి విధియోగమునఁ జేసి, నిపుణమతులు
కంద్రు, ప్రమోలను గన్పట్టుకరణి, మిత్త్రి!' ౯౪

కరటకుఁడు పల్కుచున్నాఁడు.—'అయినను అప్ర స్తుతము నీవు పలుకఁగూడదు ; ఏలన,—

తే. పల్కునప్రాప్తకాలంబుఁ బల్కె నేని
ధిక్కృతిం బొందు నిక్కంబు ధిషణుఁ డైన;
కలరు సతతంబు ప్రియమునే పలుకు, జనులు
పథ్య మగునప్రియము వినఁ బలుక లేరు.' ౬౯

దమనకుఁ డనియె;—'మిత్త్రుఁడా, భయపడకు; నేను సమయముగాని మాటను బలుకువాఁడను గాను. ఏల యనఁగా,—

క. ఆపద, నుత్పథగామిత
ప్రాపించెడువేళ, బనికి హాద నెడలు నెడన్,
భూపహితకరుఁడు మంత్రి
వ్యాపృతుఁడు వచింపవలయు, నడుగక యున్నన్.

మఱి యవసరము కలిగినను నేను ఆలోచన చెప్పఁ గూడదేని, ఆపక్షమున నాకు ఈమంత్రిత్వమే తగదు. ఏలయనఁగా,—

క. ఏగుణముచేత జీవిక
బాగుపడునో, బుధులు పొగడఁ బాలుపడుదురో
ఆగుణము నది గలాఁడును
రాగంబునఁ గావఁ దగును బ్రబలింపఁ దగున్. ౭౧

కావున మంచివాఁడా, నాకు సెలవిమ్ము; పోయె దను.' నీకు మేలు కలుగు గాక; నీదారులు మంగళము లగుఁ గాక. నీవు కోరినయట్లు చేయుము.' అని కరటకుఁ డనియె.

## సుహృద్భేదము

అంతట దమనకుఁడు పింగళకుని సన్నిధికి వెఱఁగుపడిన వాఁడుంబోలె పోయెను. దూరమునుండియే రాజు చూచి ఆదరముతో రప్పించుకొనఁగా సాష్టాంగప్రణామము కావించి కూర్చుండెను. 'ఏమి, చిరకాలమునకు కనఁబడితివి?' అని రాజు అడిగెను.

దమనకుఁడు చెప్పందొడంగెను.— 'శ్రీమంతులయిన యేలినవారికి నాసేవవలన ఇంచుకేనియు ఉపయోగము లేకపోయినను, సమయము వచ్చినప్పుడు సేవకుఁడు తప్పకుండ దగ్గఱ నుండవలసినది గదాయని వచ్చినాఁడను. ఏలయనఁగా ;

క. ఏభటు లని నసినిహతుల
నైభశిరంబుల ధరిత్రి నర్చించెదరో,
ఆభటులకును విభుకడ మ
హాభయమున నెల్గు భిన్నమై త్రోఁపుపడుఁ. ౬౮

మఱియు,—

క. నరపతియెడ, బుధులనడుమ,
మరుకేళిసమాగమమున, మహిళలతోడన్,
దరదూషితహృదయుఁడు, నుడి
గురుఁడైనను, గాతరత్వగోచరుఁడ యగుఁ. ౬౯

నావలనను ఒకానొకహేతువుచేత ప్రయోజనము కలదు. చెప్పుదురుగదా ;—

క. పలు దోమనేని, కర్ణం
బులగులగుల దీర్చునేని, పూరిఫుడుకచేఁ
గలదు పని యీశులకుఁ; గయి,
పలు, కంగంబులు, గలానిఁ బలుకవలయునే? ౭౦

ఏలినవారు చిరకాలము అధికారమునుండి తొలఁగించియున్న నాకు తెలివి పోయినదని తలంతురేమో? అట్లునుం దలంపవలదు; ఏలయన,—

క. ఎవనికి నేగుణములు గల,
వవి వలదన్నను, వికాసమందు, స్వయముగా;
నవమృగమద సౌరభ్యము
నివర్తిలునె యొట్టు వెట్టి నిలు రా కనినన్? ౭౧

మఱియు,—

క. దొరలుతఁ బదములలో మణి,
శిరమునఁ గాచము చెలఁగుత శేఖరపదవిన్,
ధరయేర్పడుతఱి, నంగడి,
స్థిరపడు మణికాచములకుఁ దిరుగుడు నడిలోన్. ౭౨

ఆ. ధీరచిత్తు నెంత దిగువ కణంచిన,
వానిబుద్ధి కెప్పుడు హానిగాదు,
నిప్పు నెంత క్రింద నిలిపినఁ, దచ్ఛిఖ
గ్రాలునే యధోముఖంబు గాఁగ. ౭౩

మహాప్రభూ, ప్రభువు తారతమ్యము నరయువాఁడు గావలయును.

ఆ. సర్వభృత్యకులము నిర్విశేషంబుగా
రేఁడు సమతఁ జూచునాఁడు, దేవ,
ఉద్యమతులకు నుత్సాహభంగమగు ;
రేనికార్యములకు హాని గలుగు. ౭౪

క. ఉత్తమమధ్యాధములుగ
ముత్తెఱఁగుల నంద్రు, దేవ, పురుషులు ధరలో ;
నత్తారతమ్య మారసి,
హత్తింపఁగవలయు వారి నయ్యోపనులన్. ౭౫

ఏలయన,—

క. సేవకులఁ, దొడవులను, దమ
తావులనే నిలుపవలయు ధరణిపుఁ డెపుడున్ ;
ఏవా రయినను వలఁతురె
కావింపఁగఁ గాలితొడవుగా మౌళిమణిన్. ౭౬

మఱియు,—

తే. బంగరుం దొడవునఁ బొదువంగఁదగిన
మణిని దగరపునగలో నమర్చెనేని,
వడ్వఁదడి, దీప్తి కోల్పోవ దించుకేని,
అట్లు కూర్చినవానికే యగును నింద. ౭౭

మఱియు,—

క. చరణాలంకృతి మణి నిడి,
కిరీటమున గాజుతునియఁ గీలించినచోఁ,
బోరఁబాటు లేదు మణికిన్,
బోరయును ధిక్కృతిని సాధువు జనంబులచేన్. ౭౮

చూడుము ;

క. వీఁ డనురక్తుఁడు ప్రాజ్ఞుఁడు,
వీఁడో శూరుండు, భయమువీఁ డిడుననుచున్
బోఁడిగ భృత్యుల నెఱిఁగెడు
ఱేఁడు కొదువ లేక క్రిక్కిఱియు భృత్యులతోన్. ౭౯

అట్లైగదా,—

క. తురగము, శస్త్రము, శాస్త్రము,
నరుఁడును, వీణయును, వాణి, నారియుఁ, దమ్మున్
బొరసెడిపురుషుని యనుసృతిఁ
బరగున్ గుణదోషములకు భాజనముగుచున్. ౮౦

మఱియు,—

క. భక్తుఁ డశక్తుం డేలా?
సక్తిన్ జెఱుపే యొనర్చుశక్తుం డేలా?
భక్తుని శక్తుని నన్నున్
యుక్తముఁ గా దయ్య, దేవ, యొప్పరికింపన్. ౮౧

ఏలన,—

ఉ. భూరమణుం డవజ్ఞ యిడఁ
బొందు బలంగము బుద్ధిలోపమున్,

వారివిధంబు గాంచి బుధ
వర్యులు సేరరు వాని సన్నిధిన్,
వారు త్యజింప రాజ్యమును,
బాఱదు నీతి సమంజసంబుగా
నేరుపు డిందినట్టికొఱ
నీతికి నా డవసన్న మయ్యెడున్. ౧౨

మఱియు,—

క. రా జెవ్వనిఁ బూజించునొ,
భూజను లందఱును వానిఁ బూజింతు రొగిన్;
రా జవమానించు నెవని
భూజను లాతని నవజ్ఞ పొందింతు రొగిన్. ౧౩

మఱియును,—

క. బాలునిభాషిత మైనను,
శీలింపఁగవలయు బుధులు చెన్నుగ నున్నన్;
హేళి కవిషయత దీప
జ్వాల వెలుంగదె వరార్థసందర్శినియై*. ౧౪

పింగళకుఁడనియె,— 'మంచివాఁడా, దమనకుఁడా, ఇదియేమి? నీవు మాకు ప్రధానమంత్రి కుమారుఁడవు. ఇంతకాలము కొండీంద్ర మాటలు విని రాకుంటివి. ఇప్పుడు

* పా. బాలవచన మైన శీలింపఁగాఁ దగు
యుక్తియుక్త మగుచు నొప్పెనేని
రవి వెలుఁగనిచోట దివియ వెలుంగదే
అఖిలవస్తుచయము నగపఱచుచు.

నీయిష్టమేమో చెప్పుము.' అందులకు దమనకుఁడు 'ప్రభూ, ఒకమాట యడిగెదను, చెప్పుము. ఏలినవారు నీరుద్రాగఁ బోయి త్రాగకయే నివ్వెఱగొన్నట్లు మరలివచ్చియున్నందులకు కారణమేమి?' అని యడిగెను. 'చక్కఁగానే యడిగితివి. మఱియేమన, ఇదిరహస్యము; చెప్పుటకు తగిన నమ్మకపుఁజోటు దొరకకున్నది. అయినను ఏకాంతముగా చెప్పెద వినుము; ఇప్పుడు ఈయడవిలో నొకయపూర్వ జంతువు నెలకొనియున్నది. కావున మనము దీనిని విడిచి పోవలయును. ఈకారణముచేత వెఱఁగుపడియున్నాను. అట్లే నేనును గొప్పయపూర్వశబ్దమును వింటిని. ఆయులివుంబట్టి యాలోచించిన, ఆప్రాణి మహాబలిష్ఠమయినదిగా నుండ నోపును.' అని పింగళకుఁడు పలికెను. దమనకుఁ డిట్లనియె;- 'దేవా, అవును మహాభయంకరమయిన యా శబ్దమును మేమును వింటిమి. అయినను ఎవఁడు ముందుగా దేశత్యాగమును, తర్వాత యుద్ధమును ఉపదేశించునో వాఁడు దుర్మంత్రి. మఱియు; సేవకులవలని ప్రయోజనమును ఈకార్యసందేహములోనే తెలిసికొనవలయును. ఏలయనఁగా,—

క. పురుషుని కాపద యనియెడి
యొరగంటను, బంధుభృత్యయువతులయందుఁ
బరగెడి సాకాసారత
స్థిరపడు; నట్లే స్వకీయధీసత్త్వమతుల్.' ౮౯

సింహము 'ఓయి మంచివాఁడా ; నన్నొక గొప్పసందేహము బాధించుచున్నది.' అని పలికెను. అందులకు దమనకుఁడు 'కాదేని రాజ్యసుఖమును వదలి దేశాంతరము పోవుటకు నేల నాతో ప్రస్తావింతువు?' అని మనస్సులో అనుకొని ప్రకాశముగా, 'దేవా, నేను బ్రదికియున్నంతవఱకు, భయపడ నక్కఱలేదు. అయినను కరటకాదులను కూడ కూడఁ దివిచికొనవలయును. ఏలయనఁగా ఆపదలకు ప్రతిక్రియ సేయు పురుషసముదాయము దుర్లభము.' అని చెప్పెను. అంతట రాజు కరటక దమనకులకు గొప్ప పసదనం బొసంగి సత్కరించెను. వారును ఆభయమునకు ప్రతీకార మొనర్చెదమని ప్రతినవట్టి చనిరి.

కరటకుఁడు నడచుచు దమనకు నడిగెను.– 'మిత్త్రుఁడా, ఏమి ? ఈభయహేతువునకు ప్రతిక్రియ చేయఁగలమో చేయలేమో తెలియకయే భయమునడంచెదనని ప్రతినవట్టి యీమహాప్రసాదమును గ్రహించితివి? ఏలయన, ఎవరికేని ఉపకారము చేయనివాఁడు వానివలన బహుమానము గైకొనఁగూడదు. ముఖ్యముగా రాజువలనఁ గైకొనఁగూడదు. చూడు,—

క. కరుణావీక్షను లక్ష్మియుఁ,
బరాక్రమమునందు సిరియుఁ, బ్రతిఘనృతియున్,
బరగెడు నెవ్వనివలనన్
స్థిరాప్రభుఁ డతండు సర్వతేజోమయుఁడా. ౭౬

అశ్లేగదా,—

తే. బాలు డయినను నవమానపఱుపఁదగదు
భూరమణు నరమాత్రుఁ డన్కారణమున;
అవతరించె నరాకృతి నవనియందు
ధర్మసంస్థాపకము మహాదైవత మిది.' ౧౭

అందులకు దమనకుఁడు నవ్వి 'చెలికాఁడా, ఊరకుండు. భయకారణము ఎద్దు అంకెయని నేను తెలిసికొంటిని. ఎద్దు మనకే ఆహారమే. ఇఁక సింహమునకు చెప్పవలయునా?' అనెను. 'అట్లయిన యేలిక భయమును అక్కడనే యేలతీర్పవైతివి?' అని కరటకుఁ డడిగెను. దమనకుఁడిట్లనియె.— 'దొరయొక్క భయమును అక్కడనే తొలఁగించినయెడల ఈగొప్ప బహుమాన మెట్లు దొరకును? మఱియు;—

క. ఏమిపనియుఁ దమతోడనె
సామికి లేకుండునట్లు సవరింపుదురో
ఏమూఢభటులు, వారలు
తామె క్షయింపుదురు సూవె దధికర్ణువలెన్.' ౧౮

కరటకుఁ డడిగెను. 'ఆకథ యెట్లు?' అని. దమనకుఁడు చెప్పందొడంగెను:—

## కథ. 3.

ఉత్తరాపథమందు అర్బుదశిఖరమను పర్వతములో మహావిక్రముఁడనుపేరిసింహముండెను. అది కొండగుహా

లో నిద్రించుచుండునప్పుడు ఎలుకయొకటి జూలుగొనను గొఱుకుచుండినది. ఖండమయిన జూలుగొనను చూచు కొని కోపగించి సింహము, లాఁగఁగోఁదూఱిన యెలుకను, పట్టలేక, యిట్లు చింతించెను.—

తే. 'క్షుద్రశత్రుఁ డెవండేని కూయి సేఁపఁ,
జిక్కఁ డేప్పాట విక్రాంతిచేతఁ దనకు,
వానిమీఁదికి గొంగగా వానిసముని
సైనికునిఁ బంపఁ దగు నీతిశాస్త్రవిదుఁడు.' ౮౯

ఇట్లాలోచించి పట్టణమునకుం బోయి దధికర్ణుఁడు అనుపేరి పిల్లిని తెచ్చి మాంసఖండములు గానుకలు పెట్టి, సంతోషపెట్టి లాఁగకడ నెలకొలిపినది. అది మొదలు ఆపిల్లికి భయపడి ఎలుకయు బయటికి రాకుండినది. దానం జేసి సింహము జూలు తెగక హాయిగా నిద్రించుచుండినది. ఇట్లుండఁగా ఒకనాఁడు ఆయెలుక ఆఁకటికి నిలువలేక బయటికి రాఁగా, దానింబట్టుకొని పిల్లి చంపినది. తర్వాత సింహము చిరకాలము ఎలుక కనఁబడనందునను, దాని యెలుఁగుకూడ వినఁబడనందునను మఱి పిల్లివలన ఉపయోగము లేకుండుటంబట్టి దానికి మేఁత యిడుటకు అసడ్డ చేసినది. కావున 'ఏమిపనియుఁ దమతోఁ డఁ' ఇత్యాదికము చెప్పితిని.'

తర్వాత దమనక కరటకములు సంజీవకుని కడకు పోయినవి. అట కరటకుఁడు చెట్టుక్రింద ఠీవిగా కూర్చుండెను.

దమనకుఁడు సంజీవకుని దగ్గఱఁగాపోయి యిట్లనియె.—
"ఓరీ ఎద్దుగా, వీఁడుగో నిన్ను పింగళమహారాజుచేత అడవికి కాపుదలకై సేనాపతిగా ఏర్పరింపఁబడినవాఁడు కరటకుఁడు ఆజ్ఞాపించుచున్నాఁడు.- 'తత్క్షణమే రమ్ము; రావేని ఈయడవినుండి దూరముగా పో. అట్లు చేయవేని నీకు కీడు మూఁడును. కోపించిన మాయేలిక ఏమిచేయునో ఎఱుఁగను' అని"

అంతట ఆ దేశపు వ్యవహారము నెఱుంగనివాఁడు గావున సంజీవకుఁడు భయపడి వచ్చి కరటకునికి సాష్టాంగ ప్రణామము గావించెను. అట్లగుటచే చెప్పిరి.—

ఆ. మతియె బలముకన్న మహితమౌ, నదిలేమి
కరుల కీయవస్థ కలిగె ననుచుఁ
జాటుటోయనంగ, శబ్దించుఁ గరిమీఁది
డిండిమంబు మావటీని హతుల. ౯౦

మఱి సంజీవకుఁడు భయముతో 'సేనాపతీ, నేనేమి సేయవలయునో చెప్పుము' అనియడిగెను. 'ఓరియెద్దా, ఈ యడవిలో నుండుటకు నీకిచ్చయేని, మాయేలినవారి పాద కమలములకు మ్రొక్కుము.' అని కరటకుఁడు చెప్పెను. 'నాకు అభయవాక్కు నొసంగుము, ఇదెవచ్చుచున్నాను'; అని సంజీవకుఁడు పలికెను. కరటకుఁడిట్లనియె:- 'వినరా, ఓరి యెద్దా, ఈభయము వలదు.

తే. తిట్టుచున్నట్టి చేది ధాత్రీవిభునికి
బదులుమాట పలుకఁడాయె యదువిభుండు;
జలదగర్జకు ప్రతికృతి సలుపుఁగాని,
నక్క యిడునూళలకు మృగేంద్రము కలఁగునె ౯౧

మఱియు,—

తే. మెత్తనై యొంతయును వంగున త్తృణమును
బట్టి పెకలింపఁ డెందుఁ బ్రభంజనుండు,
నింగిఁ దాఁకెడుతరులనే నేలఁ గూల్చు;
ఘనులమీఁదనె ఘనుఁడు విక్రాంతి సూపు.' ౯౨

అనంతరము ఆ రెండునక్కలును సంజీవకుని యెక్కువ దూరముగాకుండ నొక్కచోట ఉంచి పింగళకుని కడకుం బోయి నమస్కరించి కూర్చుండినవి. 'ఆజంతువును నీవు చూచితివా?' అని రాజడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు- 'దేవరా, చూచితిని; వినయవంతముగా చేయ నుంజేసితిని. కాని, తమరు తలంచినట్లే అది మహాబలము గల జంతువు. అయినను అది యిప్పుడు ఏలినవారి పాదములను దర్శింపఁ గోరుచున్నది. కావున సన్నద్ధులరై కూర్చుండుఁడు. ఏలయన,—

క. జలములచే సేతువు సెడు,
వెలువడు మంత్రంబు రక్ష వెట్టకయున్నన్,
చెలిమి సెడుం దంటలచేఁ,
బలుకులచేఁ జీలఁ దివియ వచ్చును బిఱికిన్. ౯౩

కావున శబ్దమాత్రమునకు భయపడఁగూడదు ; ఏల యన,—

క. ఉలివునకె యులుకఁ దగునా ?
ఉలివునకుం గారణంబు నూహింపఁదగుఁ ;
ఉలివునకు హేతువుం గని
కొల మీఱినగౌరవంబు కుట్టని వడసెఁ.' ౯౮

'ఆకథయెట్లని మృగరాజడిగెను. దమనకుఁడు చెప్పు చున్నాఁడు:—

'శ్రీపర్వతమునడుమ బ్రహ్మపురమని పట్టణమొకటి కలదు. అచ్చట కొండకొమ్మున ఘంటాకర్ణుఁడను రాక్షసుఁడు వసించియున్నట్లు లోకాపవాదము ఉండినది. ఒక ప్పుడు ఘంటనుగొని పరారియగుచున్న దొంగను ఒకనిని పులి చంపి తిన్నది. వానిచేతినుండి పడిన ఘంట కోఁతులకు దొరికినది. కోఁతులు దానిని అనుక్షణము వాయించు చుండినవి. ఊరిజనులు పులితిన్న యా మనుష్యుని దేహ మును చూచిరి ; ప్రతిదినమును ఘంటానాదమును విను చుండిరి. తర్వాత 'ఘంటాకర్ణుఁడు కోపగించి మనుష్యులను తినుచున్నాఁడు; ఘంటను వాయించుచును ఉన్నాఁడు' అని పలికి జనులందఱు ఊరువదలి పాఱిపోయిరి. అంతట, కోఁతులు గంటవాయించుచున్నవని యెఱిఁగి కుంటెన కత్తె రాజుతో 'ప్రభూ, ధనము వ్యయింతువేని, ఈఘంటా కర్ణుని నేను సాధించెదను.' అని విన్నవించెను. అంతట

రాజు దానికి విస్తారముగా ధనమిచ్చెను. అంతట అది యడవిం జొచ్చి చెట్టుక్రింద పండ్లను, బియ్యమును నేల మీఁద పెట్టినది. వెంటనే కోఁతులు గంటను వదలి పండ్ల మీఁద వచ్చి పడినవి. గంటను గైకొని కుంటెనకత్తె ఊరికి వచ్చినది; ఎల్ల వారికిని పూజ్యురాలయినది. కావున, శబ్ద మాత్రమునకు భయపడఁ గూడదని నేను వచించితిని.'

అనంతరము నక్కలు సంజీవకుని తెచ్చి దర్శనము చేయించినవి. అదిమొదలు ఆయడవిలోనే సంజీవకుఁడు మిక్కిలి సంతుష్టుఁడై చిరకాలము వసించెను.

ఇట్లుండ ఒకనాఁడు ఆసింహముయొక్కయన్న స్తబ్ధకర్ణుఁడు అనుసింహము వచ్చెను. దానికి అతిథి సత్కారము గావించి కూర్చుండ బెట్టి, పింగళకుఁడు దాని భోజనమునకై పసరమును చంపుటకు తరలెను. సంజీవకుఁడు, 'దేవరా, నేఁడుచంపినమృగములమాంస మేమైనది?' అని యడిగెను. 'దమనక కరటకు లెఱుఁగుదురు.' అని రాజు ఉత్తరము చెప్పెను. 'కలదో లేదో విచారింపవలయును.' అని సంజీవకుఁడనియె. సింహము నవ్వి, 'అది లేనేలేదు'అని పలికెను. 'ఏమి! ఇంతమాంసమును ఆయిరువురు తిన్నారా?' అని సంజీవకుఁ డడిగెను. 'తిన్నారు; వ్యయముచేసినారు; పాఱవైచినారు. ప్రతిదినమును ఇదేవరుస.' అని రాజుపలికెను. 'ఏమి శ్రీమంతులైన యేలినవారి మొఱకనే యిట్లు చేయుచున్నారా?' అని సంజీవకుఁ డడిగెను.

'నాకు తెలియకుండనే యిట్లుచేయుచున్నారు.' అని రాజు చెప్పెను. సంజీవకుఁడు ఇట్లు చెప్పుచున్నాఁడు.- 'ఇది సరి గాదు. పెద్దలు ఇట్లు చెప్పియున్నారు ;—

'క. భూపతికిం జెప్పకయే
   యేపనియుం జేయఁగూడ దేపట్టుననున్,
   ఆపద యయ్యెడు నెడలం
   గాపాడుట యొండు దక్కఁగా భృత్యవరుల్. ౯౫

మఱియు,—

ఆ. ఎప్పుడును సమాత్యుఁ డైన జలకుండికిఁ
   బుడుకు నించుకంత పడయుఁ బెల్లు ;
   క్షణ మొకండు వమ్ముగావించి మూర్ఖుఁ డొ
   రిత్త సేసి *పిర దరిద్రుఁ డగును. ౯౬

తే. ఏయమాత్యుండు కాకిణినేని పెంచు,
   నాయమాత్యుండె పతికి మహాధనంబు ;
   అమితమహాభాక్కసంబు ప్రాణములుగాని,
   ప్రాణములు ప్రాణములు గావు పార్థివునకు. ౯౭

ఇదిరాజునందు ప్రధానదోషము.-ఏమనఁగా,—

క. అపరిమిత మైనవ్యయమును,
   నపరామర్శన, మధర్మకార్థార్జన, దూ

* పిర=గవ్వ.

రపురాబడి వదలుట, యీ
త్రిపథంబుల బొక్కసంబు రిక్తతఁ జెందున్. ౯౮

ఏలయన,—

*ఆ. పిల్లి గట్టు నలకు బేరుండు డా నైన
నాయమునకు వెచ్చ మధిక మైన;
పేదయైనవాని పెన్నుద్దియై తగు
నాయమునకు వెచ్చ మల్ప మైన. ౯౯

ఆమాట విని స్తబ్ధకర్ణుఁ డిట్లనియె.—'వినుము తమ్ముఁడా, చిరకాలసేవకులు ఈదమనక కరటకులు; ఒడంబడికలు, పోరాటములు అను పనులయందు అధికారము గలవారు; వీరిని ఎప్పుడును ధనాధికారమందు నియమింపఁ గూడదు. మఱియు పనిగొనువిషయములో నేను విన్నదానిని చెప్పెదను.

తే. ముఖజ బాహుజ బాంధవుల్ బొక్కసమునఁ
దగరు; ముఖజుఁడు సిద్ధ మర్థం బొసఁగఁడు;
బాహుజుఁడు కత్తి సూపును; బాంధవుండు
సర్వము గ్రసించు బంధుతాగర్వమునను. ౧౦౦

క. చిరసేవి యగునియుక్తుఁడు
హరియించియు బొక్కసమున యర్థమ్ము కడున్,
సరకుగొనక భూమీశున్,
నిరవగ్రహతన్ భయంబు నెట్టి చరించున్. ౧౦౧

క. ఉపకర్త యధికృతుఁడు దన
యపరాధం బెంచఁ డెపుడు నౌద్ధత్యమునన్
ఉపకారంబునె చాటుచు
నపహరణము సేయుచుండు నఖిలార్థములన్. ౧౦౨

క. ఏకతమునఁ గ్రీడాసఖుఁ
డాకోశాధిపుఁడు తా స్వయము రాజుగనే
డీకొనఁ బరిచయబలమున,
నేకాలమునను నికారమే కావించున్. ౧౦౩

ఆ. లోనఁ బగనుఁ బూని పైని శాంతి వహించు
వాఁడు చెట్ట లెల్ల వరుసఁ గూర్చు;
శకుని యొక్కరుండు, శకటారుఁ డొకరుండు,
దాని కిద్దఱును నిదర్శనములు. ౧౦౪

ఆ. ఎప్పుడును నసాధ్యుఁడే యా నమాత్యుండు,
ఎల్లవహాల నతఁడు బుద్ధుఁడేని;
బుద్ధులను గుఱించి యిట్టు లాదేశంబు,
బుద్ధి యెపుడు మతివికృతి యొనర్చు. ౧౦౫

క. దొరకినదాని హరించుట,
పరివర్తన, బుద్ధిలుప్తి, పరిభోగంబున్,
గిరవొనరించుటయును, నొ
ప్పరికించు, టమాత్యదోషవరం బాఱౌ. ౧౦౬

క. భూపుల కమాత్యవైగ్రహ
ణాపాయము దప్పఁ గా నుపాయము నిత్యం

జా పై పరామరికయుఁ,
పైపద మిచ్చుటయుఁ, మార్చివైచుటయు ననఁ. ౧౦౭

తే. చెఱకుగడ గాన్గలోపల నిఱికియాడ
నించురసమును వెలికి నర్పించునట్లు
పీడ సేయు నియోగులు గోడుగుడిచి
దొంగిలినయర్థముం గ్రక్క నంగవింత్రు. ౧౦౮

తే. మాటిమాటికి స్నానంపుశాటి పిడువ
లోనిజల మెల్ల వెలికి జాల్కొలుపు భంగి,
మాటిమాటికిని నియుక్తమానవులును
గోడు గుడుపంగ వసుధార గురియుచుండ్రు. ౧౦౯

దీనినెల్ల ఎఱిఁగి సమయోచితముగా వ్యవహరింపవలయును.’

అన్న యిట్లు చెప్పఁగా పింగళకుఁడు ‘మీరు చెప్పినది సరియే; మఱి ఈ యిరువురును బొత్తిగా నామాట ప్రకారము చేయరు;’ అని చెప్పెను. స్తబ్ధకర్ణుఁ డిట్లనియె. ‘ఇదంతయు తగదు. ఏలయనఁగా

తే. ఆజ్ఞ నుల్లంఘనము సేయునట్టివారి,
నిజసుతులనైన, రాజు దండింపవలయు;
కానిచో భేద మేమి లేఖ్యగతుఁడైన
రాజునకు భూవలయ మేలు రాజునకును? ౧౧౦

తే. స్తబ్ధునికిఁ గీర్తి చెడు, గడుసరికి మైత్రి,
కులము నష్టేంద్రియుని, కార్యకునికిఁ బాడి,
విద్యవ్యసనాన్వితునికి, లోభికి సుఖంబు
రాజ్యము ప్రమత్తసచివుఁడౌ రాజునకును. ౧౧౧

మఱియు ముఖ్యముగా,—

తే. వైరివలనను, దెక్కలివలనఁ, దనదు
వల్లభువలనఁ, దనదులోభంబువలన,
నధికృతులనుండి, ప్రజల నహర్నిశంబు
ధరణిపతి గావవలయును దండ్రివోలె. ౧౧౨

తమ్ముఁడా, ఎల్ల విధములను నామాటను నెఱ వేర్పుము. మనకిపుడు భోజనముకూడ కానే అయియున్నది. ఈపైరు మేపరిని భోజనాధికారమందు నియమింపుము.' ఈమాట ప్రకారము అట్లే జరుగఁగా, పింగళక సంజీవకులకు ఇతరబంధువులతో పని లేకుండ నిండుచెలిమిగా కాలము గడచుచుండెను.

అంతట సేవకులకుసయితము రాజు ఆహార మొసంగుటయందు అసడ్డ సేయుచుండుటం గాంచి దమనక కరటకులు పెండ్లోరులతో ఆలోచించుకొనిరి; దమనకుఁ డిట్లనియె: 'ఇది మనము చేసికొన్న చెఱుపు. స్వయంకృత దోషమునకు ఏడ్చుటనయితము సరిగాదు. అట్లే చెప్పిరి;-

తే. స్వర్ణలేఖను నేఁ జన్గవక్షస్పృశించి,
కుట్టనియు రాటఁ దన్నుఁ దాఁ గట్టుకొనియు,

సాధువు మణిఁ గొనం గేలు సాచి, మేము,
సమసితిమి ముప్పురము మూఁడొసంగుచేత.' ౧౧౫

'అది యెట్లని కరటకుఁ డడిగెను. దమనకుఁడు చెప్పు చున్నాఁడు.—

కథ ౫.

'కాంచనపురమను పట్టణములో వీరవిక్రముఁడని రాజుండెను. అతని ధర్మాధికారి మంగలి నొకనిని వధ్య భూమికిఁ గొనిపోవుచుండఁగా కందర్పకేతు వను సన్న్యాసి ఒకవర్తకునితోఁ గూడ వచ్చి 'వీనిని చంపఁగూడదు' అని చెప్పి వస్త్రమునం బట్టుకొని యాఁపెను. 'ఏల వీనిని చంపఁ గూడదు?' అని తలవరులు అడిగిరి. 'వినుం'డని అతఁడు 'స్వర్ణరేఖను నే' నిత్యాదికమును పలికెను. వివరముగా చెప్పు'మని వారడిగిరి. సన్న్యాసి యిట్లు చెప్పందొడంగెను:

'నేను సింహళద్వీపరాజు జీమూతకేతుని కుమారుఁ డను. ఒకనాఁడు నేను క్రీడావనములో నుండఁగా ఓడ వర్తకుఁ డొకఁడు వచ్చి నాతో 'యిదె యిట నడిసముద్ర ములో ప్రతిచతుర్దశియందును నీటిపైకి లేచెడు కల్పవృ క్షముక్రింద రత్నాలవరుసల వెలుఁగులచేత పలువన్నెలుగల మంచముమీఁద నున్నదై, సకలభూషణ భూషితురాలై, వీణ వాయించుచు, ఒకకన్య మహాలక్ష్మివలె నగపడు చున్నది,' అని చెప్పెను. అంత నేను ఆవర్తకునిందోడ్కొని ఓడయెక్కి అచటి కేఁగితిని. అచట, అతఁడు చెప్పినట్లె

మంచములో సగము మునిఁగియున్నట్టి యాకన్యను కంటిని. వెంటనే ఆకన్నియ చేటితోఁగూడ కడలిలోపలికి మునిఁగి అదృశ్యురా లాయెను. అనంతరము ఆసుందరియొక్క సౌందర్య గుణముచేత లాఁగఁబడిన వాఁడనై అప్పటికి పుట్టిన బుద్ధిప్రకారము నీట దుమికితిని. తర్వాత ఆకల్పవృక్షము కొమ్మను పట్టుకొని ఆసుందరియొక్క కనకపట్టణమునకుం బోయి అట బంగారునగరిలో విద్యాధరాంగనలు కొలుచుచుండ మునుపటివలెనే మంచముపై నున్నట్టి యాకన్నియం గంటిని. నన్నును దూరమునుండియే కాంచి యాసుందరి చెలికత్తెను నావైపు పంపి ప్రీతితో పలుకరించిపించినది. అంతట నేనడుగఁగా ఆసఖియిట్లు చెప్పినది. 'ఈమె కందర్పకేళి యనెడు విద్యాధరచక్రవర్తి కూఁతురు; ఈమె పేరు రత్నమంజరి. ఈమెయిట్లు ప్రతినపట్టినది.– 'ఎవఁడు వచ్చి యీకనకపట్టణమును కంటితో చూచునో వాఁడే నన్ను మానాయన యెఱుకను వివాహమాడును' అని. కావున; నీవు ఈమెను గాంధర్వవివాహమునం గయికొమ్ము.' గాంధర్వవివాహము జరుగఁగా ఆకోమలితో క్రీడించుచు నేను చిరకాల ముంటిని.

తర్వాత నొకనాఁడు ఆప్రియ నాతో ఏకాంతమున 'స్వామీ, ఎల్లప్పుడును నీయిచ్ఛవచ్చినట్లు దీనినెల్ల అనుభవింపవచ్చును; కాని ఇదిగో ఈచిత్తరువునందున్న విద్యాధరిని, స్వర్ణరేఖయను దానిని నీ వెప్పుడును తాఁకఁ

గూడదు.' అని చెప్పెను. అంతట ఆమాటలవలన కుతూహలముకలిగి నేను స్వర్ణలేఖను పాలిండ్లప్రదేశమున తాఁకితిని. చిత్తరువుగానేయున్నదయ్యును ఆస్వర్ణలేఖ అడుగుఁదామరతో తాఁచిన తాఁపునకు నేను వచ్చి మూర్ఛ్యాప్తి మందు పడితిని.

అదిమొదలు దుఃఖపీడితుఁడనై నేను సన్న్యసించి భూమియెల్లఁ ద్రిమ్మరుచు ఈపట్టణము చేరితిని. అప్పటికి ప్రొద్దు క్రుంకఁగా ప్రవేశించిన సమీపముననే యున్న గొల్ల యింట బస యడిగితిని. గొల్లయు తనయింట నొకమూల నాకు చోటిచ్చి పెండ్లాముతో 'నేను వచ్చునప్పటికి ఈ యునను హాయిగా నుండునట్లు చేయుము,' అని చెప్పి పోయెను. అనంతరము అతని భార్య అంకుటాలు కుంటెనకత్తెతో గుసగుసలాడుచుండఁగా, అంతలో దానిమగఁడు ఆగొల్ల వాఁడు కొట్టమునుండి వచ్చినవాఁడై అట్లు కుట్టనితో మాట్లాడుచున్న భార్యను చూచెను. గొల్లది మగనిం గాంచి తటాలున తెలివిదెచ్చుకొని మరలి యింటిలోనఁ జొచ్చి పడక లోనగు నుపచారములను కావించెను. అంతట గొల్లయు దానిని మోఁది కంబమునకు కట్టివైచి నిద్రపోయెను. తర్వాత నడికిరేయి దానిదూతి మంగలిది మరల వచ్చి యాగొల్లభామతో నిట్లనియె.-'ఆమహానుభావుఁడు మరణావస్థలో నున్నాఁడు, నీయెడఁబాపే అతనిని నిప్పయి కాల్చుచున్నది. చెప్పిరికదా;—

క. ముదివెన్నెలచేఁ జంద్రుఁడు
సదమదముగఁ గూల్పఁ దిమిరసంహతి నెల్లన్,
మదనుండు పూవుటమ్ముల
వెదకివెదకి యువమనముల వ్రేయం దొడఁగెన్. ౧౧౮

కావున నేనిట నన్ను కట్టుకొని యుండెదను. నీవు అటకేఁగి అతనిని సంతోషపెట్టి త్వరగా రమ్ము.' గొల్లదియు ఆప్రకారమే చేసెను. ఇంతలో గొల్ల మేల్కొని 'ఓసి, ఇప్పుడు మిండని కడకు పోవేమి?' అని యడిగెను. అందులకు దూతి మాఱుపలుకదాయెను. అంతట 'ఇంతపొగరా నీకు? ఉత్తరమయినను పలుకవా?' అని గొల్ల కోపమున దాని ముక్కును కోసివైచి తాను మరల నిద్రపోయెను. తర్వాత గొల్లది వచ్చి కుంటెనకత్తెను 'ఏమివార్త?' అనియడిగెను. 'నాముఖముచూడు, నాముక్కే వార్తనంతయు చెప్పును.' అని కుట్టనిపలికెను. తర్వాత గొల్లది ఎప్పటియట్లే తన్ను స్తంభమునకు కట్టుకొని యుండినది. కుట్టని తెగిపడియున్న ముక్కునుకైకొని తనయింటికి పోయి ఖేదపడుచు ఉండినది.

తెల్లవాఱఁగా మంగలి పెండ్లామును పొదితెమ్మనెను. అది పొదితేక ఒకకత్తిమాత్రము తెచ్చియిచ్చినది. అందులకు కోపగించి మంగలి దూరముగా ఇంటిలో కత్తిని పాఱవైచెను. ముక్కు కత్తిరింపించుకొన్న యీమంగలిది 'నావలన ఏతప్పులేకయే ఇతఁడు నాముక్కును కోసివైచి

నాఁడు' అని మొఱవెట్టుచు వానిని ధర్మాధికారి కడకు గొనిపోయినది.

గొల్లయడుగఁగా గొల్లది యిట్లనియె.-'ఓరీ, పాపాత్ముఁడా, మహాపతివ్రతను నన్ను రూపుచెఱుచుటకు నెవ్వని తరము? నానడువడిలో దోషము లేదని దిక్పాలకులు ఎన మంద్రును ఎఱుంగుదురు. ఏలయన,—

తే. రవియు, శశి, నిప్పు, గాలియు, రాత్రి, పగలు,
నింగియును, రెండుసంజలు, నీరు, జముఁడు
హృదయమును, ధర్మమును, భూమి యివి యెఱుంగు
నరునివృత్తంబు నెల్లను నరవరేణ్య! ౧౧౭

కావున నేనే మహాపతివ్రతనేని నా మగనిం దక్క-ఒరుని మనస్సులోనయినను తలంపనేని, నాముఖము గాయము లేకుండుఁగాక.' అంతట గొల్లబోయఁడు దీపము తెచ్చి గాయములేని దానిముఖమును గన్నంతట 'నా నేరమి మన్నింపుము' అని ప్రదక్షిణము తిరిగి సంతోషముతో నిండినమనస్సుతో కట్టు విప్పి దానిపాదములలో వ్రాలి 'ఇట్టి పతివ్రతయయిన పెండ్లాము కలయట్టి నేను ధన్యుఁడను!' అనిపలికెను.

ఓతలారులారా, ఈవర్తకుని కథను సయితము వినుఁడు. ఇతఁడు ఇల్లువెడలి పండ్రెండేండ్లు వర్తకముచేసి నానావిధములయిన యపూర్వరత్నములను మలయపర్వత సమీపమునసుండి తెచ్చి నిన్న ఈయూరు చేరినాఁడు.

ఇట భోగము దానియింట నిద్రించినాఁడు. అట కుట్టని యింటి గడపకడ పెట్టియున్న, కొయ్యబేతాళుని నెత్తి మీఁద మిక్కిలి మేలయిన రత్నమొకటి యున్నది. దానిం గని ధనలోభముచేత ఈవర్తకుఁడు రాత్రి లేచి రత్నము మీఁద చేయి యుంపఁగానే ఆ బేతాళుఁడు దారముల మూలమున సంచరించునట్టి తన బాహువులతో ఈయనను పట్టి నలఁపఁగా ఈయన నొగిలి యేడ్వ సాగెను. అంతట తాఁర్పకత్తె మేల్కాని వచ్చి 'వర్తకుఁడా, అబ్బాయీ, మలయము కడనుండి వచ్చితివి. నీరత్నములనెల్ల ఇమ్ము. ఈవేని ఇది నిన్ను విడువదు. ఈపనివాఁడు ఇట్టివాఁడు,' అనిచెప్పెను. అంతట ఈయన తనరత్నముల నన్నిటిని దానికి ఇచ్చెను. ఇట్లు సర్వధనముం గోలుపోయి ఇపుడు ఈతఁడు నాతో కలసి కొన్నాఁడు.'

ఇదంతయు విని తలవరులు ధర్మాధికారితో చెప్పి, న్యాయము ప్రకారము చేయించిరి. కావున నేను 'స్వర్ణలేఖ' నిత్యాది పలికితిని. కావున ఇది మనము స్వయముగా తెచ్చి కొన్నకీడు! ఈవిషయమున విలపించుట సయితము తగదు. (ఇంచుకసేపు ఆలోచించి) మిత్రుఁడా, ఈపింగళక సంజీవ కులకు ఎట్లు చెలిమి చేసితినో అట్లే చెలిమికి భంగమును కూడ నేను చేయువలయును ; ఏలయన,—

క. సమమున నిమ్నోన్నతములఁ
గమనీయతఁ జూపుచిత్రకారులభంగిన్

భ్రమ గొల్పి నమ్మఁజేయుదు
రమిథ్యగా మిథ్య ధూర్తు లతిపేశలతఁ. ౧౧౬

ఆ. ఎది యుపాయమునకు నింపుగా సాధ్యమో
యది పరాక్రమమున కలవి గాదు;
కనకసూత్రమునను గాకి చంపించెను
దరుబిలంపు నల్లఁ ద్రాచుఁబాము.' ౧౧౭

'ఆకథ చెప్పు'మని కరటకుఁ డడిగెను; దమనకుఁడు చెప్పం దొడంగెను.

కథ ౭.

'ఒకానొక చెట్టున కాకి దంపతులు కాఁపుర ముండినవి. వానిపిల్లలను ఆచెట్టుతొఱ్ఱలో నెలకొనియున్న నల్లత్రాఁచు తినివైచినది. మరల కడుపై కాకి కాకముతో నిట్లనియె: 'స్వామీ, ఈచెట్టును వదలుము. ఇట ఆనల్లత్రాఁచుమూలముగా ఒకవేళ మనకు సంతతి క్షయించును. ఏలయన,—

ఆ. చెడినభార్య, యెదురు సెప్పెడుభృత్యుండు,
చెలువు గూఢముగను జేయుసఖుఁడు,
పాముచేరినట్టి గీమున వాసంబు,
సంశయంబు లేదు చావెసుమ్ము.' ౧౧౮

అందులకు కాకము 'ప్రాణేశ్వరీ, నీవు భయపడకు. దీని పెనఁదప్పిదమును నేను మాటిమాటికి క్షమించితిని.

ఈమాఱు క్షమింపను,' అనెను. 'బల్లిదమయిన దీనితో పోరాడుటకు నీకు బల మెక్కడిది?' అని కాకి యడిగెను. కాకము, 'ఈభయము మానుము, ఏల యనఁగా,—

ఆ. కలదు బలము బుద్ధి గలిగిన యెడలను,
లేదు బలము బుద్ధి లేనియెడల,
కను మదోత్కటంపుఁ గంఠీరవంబును,
బుద్ధిచేత శశము పొలియఁజేసె.' ౧౧౯

'ఆకథ యెట్లని కాకి యడిగినది; కాకము చెప్పుచున్నది.

### అవాంతరకథ ౧.

'మందరపర్వతమందు దుర్దాంతమను పేరి సింహముండెను. అది సర్వదా మృగములను చంపుచుండెను. మృగములన్నియుకూడి సింహమునకు 'ఏల యెల్ల మొకములను చంపెదవు? మేమే నీకు ఆహారముకై ప్రతిదినము ఒకమృగమును ఇచ్చెదము.' అని విన్నపముచేసి కొన్నవి. సింహము 'వల్లె'యని అదిమొదలుకొని దినదినము అవి పంపిన యొకొక్క పశువును భక్షించుచుండెను. ఇట్లుండఁగా నొకప్పుడు ఒక ముసలికుందేటివంతు వచ్చినది. అది యిట్లు తలపోసెను:

ఆ. బ్రదుకునాశచేత భయకారణమునకు
వినతి సేయఁ దగు వివేకయుక్తిఁ,

జావఁ బోవునేను సవదరింపఁగనేల
పింగదృష్టియెడల వినయవృత్తి? ౧_౨౦.

కావున నేను మెల్లమెల్లఁగా పోయెదను.' అంతట సింహము ఆఁకటికి నొచ్చి కోపమున కుందేటిని 'ఏమి! ఇంత విలంబముగా వచ్చితివి?' అని యడిగెను. కుందేలనియె.-'నాపలనం దప్పులేదు. మఱియొక సింహము నన్నుఁగని బలిమిచే పట్టి నిలిపినది. 'మరలవచ్చెద'నని ఒట్టు పెట్టుకొని, ఏలినవారికి ఆవృత్తాంతమును విన్నవించుటకు వచ్చితిని.' సింహము కోపంబున 'ఇప్పుడే వచ్చి చూపింపుము. ఎక్కడ నున్నాఁడు ఆదుష్టాత్ముఁడు?' అనెను. అంతట కుందేలు దానిని వెంటఁ బెట్టుకొని లోఁతు నూతి కడకు పోయి 'ఇటవచ్చి ఏలినవారు చూడవలయును,' అని పలికి సింహమునకు నూతి నీళ్లలోని దాని ప్రతిబింబమునే చూపెను. అంతట పొగరుచేత పిక్కటిల్లుచున్న యాసింహము కోపమున ఆనీడపైఁబడి తలక్రిందును, కాళ్లుమీఁదును అయి మునిఁగి చచ్చినది. కావున నేను 'కలదుబలము బుద్ధికలిగిన యెడలను' ఇత్యాదివాక్యమును చెప్పితిని.'

కాకి 'అంతయు వింటిని; మఱి యిప్పుడేమి సేయవలయునో చెప్పుము,' అనియడిగెను. 'ఈచెంత చెఱువులో రాజకుమారుఁడు ప్రతిదినము వచ్చి స్నానము చేయును. అప్పుడు ఒడలినుండితీసి బంగారపుఁ దీఁగను రేవు ఱాతిమీఁద నుంచును; దానిని నీవు ముక్కుతో కఱచి తెచ్చి,

ఈతోఁట్టిలో వ్రైవుము,' అని కాకము చెప్పెను. తర్వాత ఒకప్పుడు రాజకుమారుఁడు స్నాన మాడుటకు నీటఁ జొరఁ గానే కాకి ఆ చెప్పిన ప్రకారము చేసినది. అంతట బంగా రపుఁ దీఁగను అనుసరించి వచ్చిన రాజభటులు ఆ చెట్టు తొఁట్టులో నల్లత్రాఁచుం గాంచి చంపిరి. కావున 'ఏదియుపా యమునకు నింపుగా సాధ్యమో' లోనగు దానిని చెప్పితిని.'

'అటయినయెడల పద, నీదారులు శోభనములగుఁ గాక.' అని కరటకుఁడు పలికెను. అనంతరము దమనకుఁడు పింగళకుని చెంత కేఁగి మ్రొక్కి యిట్లనియె, 'దేవరా, మిక్కిలి దుఃఖకరమయిన కీడును పొడగాంచి వచ్చితిని. ఏలయన,—

క. ఆపద, నుత్పథగామిత
ప్రాపించెడు నెడలఁ, బనికి హాద నెడలు నెడన్,
భూపహితైషి యపృష్టుఁడె
వే పల్కఁగవలయు శుభము విదితముగాఁగన్. ౧౨౧

మఱియు,—

క. రా జనఁగ భోగమునకున్
భాజన మగుఁ గాని, పనికి భాజన మగునే?
రాజుపని ధ్వంస మొందిన,
భాజన మగు మంత్రి బహుళపాపంబునకున్. ౧౨౨

అది యట్లు,—వినుము, అమాత్యుఁడు తన దొర

పదవిని ఆశించువానిని ఉపేక్షించుటకన్న తన తలను తఱుగుకొని చచ్చుటయైనను మేలు.'

'మఱి నీవేమి చెప్పవచ్చితివి ?' అని పింగళకుఁడు అక్కఱతో నడిగెను. 'వీఁడుగో ఉన్నాఁడే సంజీవకుఁడు, ఇతఁడు మీమీఁద తగని వ్యవహారమును పూనియున్నాఁడు. అది యేమనఁగా, శ్రీమంతులయిన దేవరవారి ప్రభుమంత్రోత్సాహశక్తులను మా యెదుట నిందించి రాజ్యమునే తానేలఁ గోరినాఁడు' అని దమనకుఁడు వక్కాణించెను,

ఈ మాటవిని పింగళకుఁడు ఆశ్చర్యముచే ఱిచ్చపడెను. దమనకుఁడు వెండియుం బలికెను.—'దేవా, ఎల్ల మంత్రులను తొలఁగించి వీని నొకనినే సకలకార్యములకు అధికారిని చేసితివి. ఇది గొప్ప పొరఁబాటు, ఏలయన,—

తే. పదము లత్యుచ్ఛ్రితు లగు నృపతి సచివుల
పై నునిచి, లక్ష్మి నిల్చు విభ్రాజితముగ ;
బరువు నోపక స్త్రీస్వభావంబువలన
నాయిరువురందు నొక్కనిఁ బాయు వేగ. ౧౨౩

మఱియు ;-ఎప్పుడు రాజు మంత్రిని రాజ్యమునకెల్ల ప్రధానునిఁగాఁ జేయునో అప్పుడే అజ్ఞానముచేత వానికి మదమెక్కును. అంతట వాఁడు మదమువలన పనులు సేయ ప్రాలుమాలి రాజునుండి విడఁబడును. విడఁబడిన వాని హృదయములో తానే స్వతంత్రుఁడుగా ఏలవలయు

వని కోరిక కలుగును. ఆకోరికచేత వాఁడు తేనిప్రాణమును హరింపం గడంగును.

ఇట్లు చెప్పియున్నాఁడు :—

క. బెడిసిన భృత్యుని, నిలుకడ
వెడలిన దంతంబుఁ, బగ వహించి మనములో
నుడుకుచునుండు నమాత్యునిఁ,
దడయక పెకలించివైవఁ దగు మూలముతోన్. ౧౨౪

మఱియు,—

క. ఏనృపతిసేయు సచివా
ధీన నిజశ్రీ, నతఁడు తదీయవికృతిచేఁ,
బూని కయి న్నడిపించెడి
వానిం బడయని మహాంధువలెఁ, గూలఁబడున్. ౧౨౫

విశేషముగా,—

ఆ. ఎప్పుడును నసాధ్యుఁడే యగును సచివుండు
ఎల్లవహాల వాఁడు బుద్ధుఁడేని;
బుద్ధులను గుఱించి యిట్టు లాదేశంబు,
బుద్ధి యెపుడు మతికి వికృతిఁ దెచ్చు. ౧౨౬

అతఁడు ఎల్లకార్యములందును తన యిచ్చవచ్చినట్లు ప్రవర్తిల్లును. ఇందులకు తార్కాణము వలినవారికి విశదమే.'

సింహము విమర్శించుకొని యిట్లనియె;—'ఓయి, కల్యాణుఁడా, నీవు చెప్పినది వాస్తవమే; అయినను నాకు సంజీవకునితో మిక్కిలి చెలిమి. చూడు ;—

ఆ. అప్రియంబు లెన్ని యైనఁ జేయునుగాక,
ప్రియుఁ డెవండొ వాఁడు ప్రియుఁడె యగును:
ఎవరికైన దేహ మెన్నిదోషము లున్న
నప్రియం బగుటయు నవనిఁ గలదె? ౧౨౭

అట్లు,—

ఆ. అప్రియంబు లెన్ని యైనఁ జేయునుగాక
యిష్టుఁ డెవఁడొ యాతఁ డిష్టుఁడె యగు;
ఇంటిభాగ్య మెల్ల నేర్చి మాయించిన
యగ్నిపైఁ గలదె యనాదరంబు.' ౧.

దమనకుఁడు వెండి యిట్లనియె:—'ప్రభూ, అది య
గొప్ప పొరఁబాటు; ఏలన,—

ఆ. ఎవనిమీఁద నే మహీపతి యెక్కించు
హెచ్చుగాఁగఁ గన్నహీనశక్తి,
సచివుఁడో తనయుఁడో, సంబంధహీనుఁడో
వానిఁ బద్మనిలయ తానె చేరు. ౧౨౯

చిత్తగింపుము దేవా,—

తే. పథ్య మప్రియ మైనను బాకమందు
సుఖమునే యొడఁ గూర్చు భాసురము గాఁగ;
చెప్పువాఁడును దానిని జేయువాఁడు
నందురో రెండు సంపద లుండు నందు. ౧౩౦.

నీవు కులక్రమాగతులయిన భృత్యులం దొలఁగించి

తివి; క్రొత్తగా వచ్చినవారిని సమ్మానించితివి; ఇదిసరియైన పనిగాదు.

తే. మూలముట్టుగఁ దోలఁచుట మూలభటులఁ,
క్రొత్తగా వచ్చువారల గొప్పసేఁత,
అంతకన్నను దోసఁగు రాజ్యమున లేదు,
రాజ్యభేదము నది సుకరముగఁ జేయు.' ౧౩౧

సింహము అడిగినది.—'నీమాట యాశ్చర్యముగా నున్నది! ఇతనిని నేను అభయ మిచ్చి రావించి వృద్ధికిఁ దెచ్చితిని. ఇతఁడు నాకు ద్రోహ మెట్లు దలంచును?' అందులకు దమనకుఁ డనియె; 'దేవా,—

తే. చెమరుకొనఁ జేసి తైలాదికములు రాచి
ద్వాదశాబ్దంబులు నివిడ్చి త్రాళ్లఁగట్టఁ
గుక్కతోఁకకు వంకర గుదురనట్లు,
దుర్జనుని కేమిటను గల్గ దార్జవంబు. ౧౩౨

మఱియు,—

తే. పెంపు వొందించినను, గారవించుచున్న,
ఖలునకుం బ్రీతి యందుచేఁ గలుగ దెందు;
అమృతముం బోసి పెంపఁ, జిలుముకుజంబు
పథ్యకారులఁ బండులఁ బండునొక్కొ. ౧౩౩

కావున నేను జెప్పున దేమనఁగా,

సుహృద్భేదము

క. ఏతని కవమతిఁ గోరవో,
యాతనికిం బల్కు హితము నడుగకయున్నన్;
నీతి యిది సాధులకు, విప
రీతము పెఱల, కని, యవధరింపుము మిత్రా! ౧౩౪

క. కీడుడుపు నతఁడె మిత్రుఁడు,
పాడి తొఱంగనిది కర్మ, పరసతి మదిలోఁ
గూడి మెలఁగునది, వాఁడే
ప్రౌఢ, మెవఁడు బుధులచేతఁ బొగడంబడునో. ౧౩౫

క. సిరి మదమెక్కింపని దే,
పరమసుఖాన్వితుఁడు తృష్ణ వదలినవాఁడే,
వరమిత్రుఁ డకృత్రిముఁడే,
పురుషుం డఖిలేంద్రియముల ముడిఁచినవాఁడే. ౧౩౬

సంజీవకుఁడు బెడిసినందునం జెడనున్న యేలినవారు నేను విన్నపముచేసికొన్నను వానిని వదలరయేని, ఆపత్తుమున సేవకుఁడనైన నాయందు తప్పిదము లేదు.

క. కామాసక్తుఁడు నరపతి
యేమియును హితాహితంబు లెఱుఁగక యిచ్ఛా
భూమమునఁ జరించును మద
సామజముంబోలెఁ గరము స్వాచ్ఛంద్యమునన్.

క. దానన్ మద మెక్కుడు శో
కానలమునఁ గూలి దానికై బలు దొసఁగుల్

ప్రానిక భృత్యునితల నిడుఁ;
గానఁడు తనయవినయంబె కారణ మనుచున్.' ౧౩౭

అంతఁ బింగళకుఁడు తనమనస్సులో నిట్లనుకొనెను;-

క. పరు లిడఁదూఱుచే నె
వ్వరినిన్ దండింపరాదు వసుధాపతి తాన్;
అరసి స్వయముగాఁ దత్త్వము
సరిఁ బూజయొ, దండనంబొ, సలుపఁగవలయున్. ౧౩౮

అట్లే చెప్పి యున్నారు,—

క. గుణదోషంబుల నిర్ధా
రణ సేయక తగ దొసర్ప గ్రహానిగ్రహముల్;
ఫణినోటఁ జేయి త్రుళ్లిన
గణియింపక యిడిన నాత్మఘాత యగుఁగదా.' ౧౩౯

ఇట్లు మనస్సులో ననుకొని, అనంతరము ప్రకాశముగా, 'అటుయిన సంజీవకునిం దొలఁగింతునా?' అని యడిగెను. దమనకుఁడు తొట్రుపాటుతో నిట్లనియె:- 'దేవా, అట్లు చేయఁగూడదు. అందువలన మంత్రము చెడును. చెప్పుదురుగదా;—

క. వెలికి న్మంత్రపుబీజము
బెళుకంగానీక కావ, విన్నాణ మగున్;
వెలి కించుకేని యుబికిన,
మొలవద యది, మఱి మొదలికె మోసము వచ్చున్.

మఱియు,—

క. కానవలసిన నీవలసిన,
బనివడి కావింపవలయు పని యొకఁ డున్నన్,
వెను వెంటఁ జేయనియెడన్
మును కాని తద్రసముఁ గాలపురుషుఁడు ద్రావున్. ౧౪౩

కావున నారంభించినదానిని తప్పక గొప్పయత్నము తో నెఱవేర్పవలయును. మఱియు,—

ఆ. అన్నియంగములకు హాళి మర్దించినను
బీదగుండె వడినజోదు వోలెఁ,
జిరము మంతనంబు తిరముగా నిల్వదు,
పరులవలన భేదపడునుగాని. ౧౪౩

ఇతనిదోషము ఎఱుకపడినను, దానినుండి మాన్పి ఇతనితో సంధిచేసికొనుటయు కేవలము పొరఁబాటు. ఏల యనఁగా,—

క. బెడిసినమిత్రుని వెండియు
నొడఁగూర్పఁగ జతనపడెడునుర్వీశుఁడు దా
మెడఁ గట్టుకొనును మిత్తిని,
గడపటఁ జూలొందె పెంటికంకర వోలెన్.' ౧౪౪

సింహము, 'పోనీ, వీఁడు మా కేమిసేయఁగలఁడో దానిని తెలిసికొమ్ము' అనెను. దమనకుఁ డనియె;- 'దేవా,

క. అంగాంగిత మెఱుఁగక, యే
భంగిన్ సామర్థ్యములను బలుకఁగ వచ్చున్?

రంగత్తరంగ సాగరు
భంగింపఁగ లేదె టిట్టిభము పటుధిషణన్.' ౧౪౫

'ఆకథ యె'ట్లని సింహ మడుగఁగా దమనకుఁడు చెప్పెను:

కథ ౮.

దక్షిణసముద్రము దరిని లకుముకులు రెండు ఆలును, మగఁడును నివసించుచుండినవి. ప్రసవకాలము సమీపింపఁగా ఆఁడులకుముకి మగలకుముకితో 'నాథా, కానుపునకు తగిన ఏకాంతప్రదేశమును వెదకుము,' అని చెప్పెను.

పోతులకుముకి, 'ఓసి ఈచోటే కానుపునకు తగినది,' అనెను. 'సముద్రమునుండి పోటెక్కెడు చోటు గదా యిది' అని ఆలు చెప్పెను. 'ఓసి కల్యాణీ, నేనేమి చేతఁగాని వాఁడనని తలఁచితివా? నాయింటనుండు గ్రుడ్లను సముద్రుని తరమా అపహరించుటకు?' అని మగఁడు పలికెను. అందులకు టిట్టిభి నవ్వి 'నాథ, నీకును సముద్రునికిని ఎంత వార, కాక,—

తే. హెచ్చు కుందు వివేచింప నెవఁడు నేర్చు,
నెవఁడు యోగ్యు నయోగ్యుని నెఱుఁగ నేర్చు,
శిల్పమున శాస్త్రమున వాసిఁ జెందు నెవఁడు,
చెడఁడు వాఁ డిమ్ముదప్పులు చెనయునపుడు. ౧౪౬

మఱియు,—

క. తగనిపనిఁ బూనుటయు, బం
దుగులవిరోధంబు, నధికుతో స్పర్ధయునుఁ,
మగువల నమ్మాట యును, నా
లుగు మృత్యువు వచ్చువాకిళులు ధరణీశా!' ౧౪౨

తర్వాత ఎట్టకేలకు మగనిమాటకు లోఁబడి టిట్టిభి అట నే గ్రుడ్లు పెట్టినది. ఇదంతయు వినుచుండి సముద్రుఁడు టిట్టిభుని శక్తి నెఱుంగువాఁడై ఆగ్రుడ్ల నపహరించెను. అంతట టిట్టిభి దుఃఖపీడితయై మగనితో, 'నాథా, కష్టము వచ్చినది; నాగ్రుడ్లను సముద్రుఁడు హరించినాఁడు.' అని మొఱపెట్టెను. అందులకు టిట్టిభము 'ప్రియా, భయపడకుము,' అని చెప్పి పక్షులగుంపును వెంటఁగొని పక్షినాయకుఁడైన గరుత్మంతుని కడకుఁబోయి సకలవృత్తాంతమును గరుటాళువారిమ్రోల చెప్పుకొనెను:—'దేవా, సముద్రుఁడు నా యింటనున్న నాకు నాతప్పిదమేమియు లేకయే కీడుచేసినాఁడు,' ఆమాటమీఁద గరుత్మంతునిచేత అతనిదొర సృష్టిస్థితిసంహారహేతువయిన భగవంతుఁడు నారాయణుఁడు విన్నవింపఁబడినవాఁడై 'గ్రుడ్లు ఇచ్చివేయు'మని సముద్రుని కాజ్ఞాపించెను. అంతట భగవంతుని యాజ్ఞను శిరమునఁ దాల్చి సముద్రుఁడు గ్రుడ్లను టిట్టిభునికి సమర్పించెను. కావున నేను 'అంగాంగిత మెఱుఁగకయే' ఇత్యాదిం జెప్పితిని.

క. తనకన్న నధికబలు మీఁ
దను బగ సాధింప నెవఁడు దలఁచు, నతని కా

తనివలనఁ బరిభవం బగు,
వనరాశికి టిట్టిభంబువలనం బోలెన్'. ౧౪౮

రా జడిగెను.—'ఇతఁడు ద్రోహబుద్ధి యని యెట్లు తెలిసెను ?' దమనకుఁడు వెండియుఁ బలికెను.—'ఎప్పుడు వీఁడు పొగరుతో కొమ్ములఁగొనలతో పొడుచుటకు సిద్ధముగా బెదరినట్లు దగ్గఱునో అప్పుడు ఏలినవా రెఱుంగ వచ్చును.' ఇట్లు నిట్లుపలికి సంజీవకుని తావునకుంబోయి మెల్లమెల్లగా దగ్గఱి దిగులుపడినవాఁడువోలె నగపడెను. సంజీవకుఁడు గౌరవముతో 'కల్యాణుఁడా, నీకు కుశలమా ?' అని యడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు, 'సేవకులకు కుశలమెక్కడిది ? ఏలయనఁగా ;—

క. తమసంపదలు పరాధీ
నములు, మనస్సున సుఖంబు నాభససుమహా,
తమయాసుఱునన్ సందే
హము నృపసేవకులభాగ్య మాశాస్యంబే. ౧౪౯

మఱియు,—

చ. ధనములచేత గర్వ మగుఁ,
దప్పును జేసియనుగ్రహంబు, ఖం
డన మగుస్త్రీలచే మతికి,
డాకొనుమృత్యువు, భోగసక్తిచే
మునుకొను ముప్పు, గౌరవము
పోవును యాచనచేతఁ, బూన్కి దు

ర్జనములు పన్నువాగురల
ప్రాలి నశింపమి లేదు ధారుణిన్.' ౧౫౦

'మిత్త్రుఁడా, ఇదేమో స్పష్టముగాఁ జెప్పుము' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు పలుకుచున్నాఁడు ;-'ఏమి చెప్పుదును మందభాగ్యుఁడను ? చూడు;—

క. మున్నిట మును(గు మానిసి
పన్నగ మొక్కండు చేతఁబడినన్ దానిన్
గ్రన్నన విడువఁడు పట్టం
డన్నయమున మూఢబుద్ధి నైతిని నేనున్. ౧౫౧

ఏలయన,—

క. ఇట జేనినమ్మకము సెడు;
నటఁ బ్రియబంధునికి జీవితాపాయ మగున్;
ఎటు పోదు? నేమి సేయుదు?
కటకట! దుఃఖాబ్ధి మున్గుగతి నా కయ్యెన్.' ౧౫౨

ఇట్లు పలికి నిట్టూర్పు నిగిడ్చి కూర్చుండెను. 'మిత్త్రుఁడా, అయినను విశదిగా నీమనస్సులోని దానిని చెప్పుము.' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు మిక్కిలిరహస్య ముగా ఇట్లు చెప్పెను.- 'జేని నమ్మకమును వెలిఁబుచ్చఁ గూడదు. సరియే, అయినను నీవు మాయందలి నమ్మ కముచేత వచ్చినవాఁడవు; వినుము: ఈదొర నీమీఁద బుద్ధి మాఱి ఏకాంతమున నాతో 'సంజీవకునే చంపి నాపరి

వారమునకు సంతర్పణచేసెదను;' అని చెప్పినాఁడు.'
ఈమాట విని సంజీవకుఁడు మిక్కిలిఖేదమును పొందెను.
పిండియు దమనకుఁడు 'దుఃఖపడకు; ఇప్పటికి చేయవలసిన
కార్యమును చేయుము.' అనెను.

సంజీవకుఁడు క్షణము ఆలోచించి తనలో తానిట్లు
తలపోసికొనెను.—'పెద్దలు చెప్పిన యీమాట మిక్కిలి
సరిగా నున్నదిగదా,—

క. నారులు ధూర్తులచేతఁ బ్ర
తారిత, లవనిపుఁ డపాత్రదాత తఱచుగా,
స్వారాజు వార్ధులందుఁ
ధారాళతఁ గుఱియు, లక్ష్మి దార్కొనుఁ గృపణుఁ.

ఇది దుర్జనుని చేష్ట యగునా కాదా యనువిషయము
వర్తనవలన నిర్ణయింపఁ దరముగాదు. ఏలన,—

క. ప్రాపించును గుజనుఁడు దనుఁ
జేపట్టిన యాశ్రయంబుచేత సుజనతఁ,
నేపాళరాజు మొగమున
నేపగు కర్దమ మెనయదె మృగమదశంకఁ.' ౧౫౭

(ఆలోచించి, ప్రకాశముగా) కట్టా! ఏలయిది సంభ
వించినది! ఎందులకనఁగా,—

తే. ఎంత సేవించినను బతి కించుకేని
సంతసము కలుగమి కడు వింతయంట!

వింత యిది యెంత? యెంత సేవింతు మంత
ద్వేషమే యెచ్చు నేమి యీాధీవిభవము? ౧౫౫

కావున ఈసందర్భము ఊహింప నలవిగాకున్నది. ఎట్లనఁగా—

తే. ఎవ్వఁడు నిమిత్తముం జూచి యెనయుఁ గిన్క,
నది సనిన వాని కదియును నంతరించు;
నేనివ్హృదయం బకారణద్వేష మొందు,
వాని సంతోషపెట్ట నెవ్వానితరము? ౧౫౬

తేనికి నేనేమి యపకారము గావించితిని? అట్లుఁగా నేల? నిమిత్తములేకయు, రాజులు చెఱుపుచేయుదురు!' దమనకుఁడు పలుకును,- 'ఇదియిట్లు; వినుము,—

తే. విజ్ఞనెయ్యంపుటుపకృతి ద్వేష్యమె యగు,
అన్యసాతూదపకృతి ప్రియంబె యగును,
నైకభావాశ్రయులచర్య యెంతవింత?
కొలువుగుట్టు గహానము యోగులకునైన. ౧౫౭

తే. దుష్టునెడల నూఱుపకృతుల్ నష్టమయ్యె,
అబుధునెడ నూఱుసూక్తులు నష్టె యయ్యె,
మాట నేయనతనికి నూఱ్మాటలట్లె,
మొద్దునకు నూఱిపోయు నూఱ్బుద్ధులట్లె. ౧౫౮

మఱియు,—

క. మలయద్రుమములఁ ద్రాచులు,
జలములలో సారసములు, లచటనె మొసళ్లున్,

ఖలులు సుఖభోగఘాతులు,
కలుగ నవిఘ్నంబులగుసుఖంబులు జగతిన్. ౧౫౯

మఱియు,—

తే. బోదె త్రాచుల కిల్లగుఁ, బు వ్వళులకుఁ,
గొమ్మ కపులకు, శిరము ఖగమ్ములకును,
గండపున్నాగ్రికున కది యొక్కటియు లేదు,
హింస్రతరములకుం దావు నీయ దేది?' ౧౬౦

సంజీవకుఁడు పలికెను.—'ఈస్వామికి నోరుతీపును, మనసు విషమును అని నాకు ఎఱుఁగనయినది. ఏలయన,—

ఉ. కానఁగ దాల నెత్తుఁ గయిఁ,
గమ్మఁగ నశ్రులు గౌఁగిలించు, హా
స్థాన నిజార్ధపీఠ మిడుఁ,
ప్రశ్నలు నుత్తరముల్ ప్రియంపడన్;
లోన విసంబుఁ దేనె వెలి,
లోఁగక మాయలలోన జాణలై
యీనవనాటకక్రమము
నేగతి నేర్చిరో ధాత్రి దుర్జనుల్. ౧౬౧

అట్లే,—

తే. కడలి దాఁటుట కోడ, చీకటికి దివ్వె,
గాలి లేమికి వీవన, కరికి సృణియు,
నిఖిలమున కిట్టుపాయముల్ నేర్పె, ధాత్ర
శక్తి లేక త్యజించె దుర్జనుల మతికి.' ౧౬౨

(సంజీవకుఁడు) వెండియు నిట్టూర్పువుచ్చి 'అయ్యయ్యో! పైరుమేపరిని నన్ను సింహము పరిమార్చుట ఏటి పని! ఏలయన,

క. ఏయిరువురకుఁ విత్తము
నేయిరువురకుఁ బలంబు నీడుఁ జోడుఁ,
ఆయిరువురకు వివాదము
న్యాయం, బన్యాయ ముత్తమాధములకగుఁ. ౧౬౩

(మఱల ఆలోచించి) ఎవరు నామీఁద రాజునకు కోపము తెప్పించినవారో తెలియఁజాలకున్నాను. శేషమొందిన రాజువలన నెప్పుడును భయమే. ఏలయన;—

తే. ఎవ్వరిని గూర్చి యేని పృథ్వీశుమతిని
విఱిచె నేని యమాత్యుండు, వెండి దాని
నవిసినట్టి స్ఫటికవలయంబుఁబోలె
దొంటియట్లుండ నదుకంగ దొర యెవండు? ౧౬౪

మఱియు,—

తే. పిడుగునుఁ రాజతేజ, మీద్వితయ మన్న,
నతిభయంకర మగు, సందియమ్ము లేదు;
కాని, మొదలిది పడెడి నొక్కటనె యెపుడు,
రెండవది పడు నఖిలధరిత్రి మీఁద. ౧౬౫

కావున పోరిలో చచ్చుటయే మేలు. ఇపుడు అతని యాజ్ఞను అనువర్తించుట సరిగాదు. ఏలయనఁగా,—

క. శూరులకు రణపథంబున
దోరిన స్వారాజ్య మగును, తొడరి గెలిచినన్
జేరును భూసామ్రాజ్యము,
ఈరెండును దుర్లభంబు లితరజనులకున్. ౧౬౬

ఇది యుద్ధమునకు సరియైన కాలము:—

క. పోరని చో మృతి తప్పదు,
పోరిన నెప్పు డది తొలఁగి పోకయుఁ గలదో,
వీరుల కదియే కాలము
పోరఁగ, నని చెప్పుదురు ప్రభూతమనీషుల్. ౧౬౭

ఏలయన,—

క. పోరనిమొన నెప్పుడు నే
కూరదొ తన కేమి మేలు, గొనకొని పోరన్
వైరియొ తానో యిరువురొ
దోరెదునెడ నప్పు డేమి దొరయునొ వినుమా.

క. గెలిచిన లక్ష్మిం బడసెదు,
పొలిసిన స్వర్భోగములను బొందెదు, కాయం
బులు క్షణ విధ్వంసంబులు,
తలఁగంగా నేల రణముఁ దన్మరణంబున్.' ౧౬౮

ఇట్లాలోచించుకొని సంజీవకుఁడు 'మిత్త్రుఁడా, ఇతఁడు నన్నుఁ జంప నుంకించుట ఎట్లు తెలియును? ' అనియడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.- 'ఎప్పు డతఁడు చెవులు

నిక్కఁబొడుచుకొని, తోఁకయెత్తి, నోరుతెఱచుకొని నిన్ను చూచునో, అప్పుడు నీవే నీపరాక్రమమును చూపుదువు. ఏలయన,—

క. బలియుఁ డయినను దేజము
వెలయింపనివాని నభిభవింతురు జనముల్ ;
తలఁగుదు రగ్నికి; బసుమం
బులపైఁ బద మిడ నెవరును బొందరు వెఱపున్. ౧౭౦

కాని, యిది యెల్ల పరమరహస్యముగా చేయవలసినది; రహస్యము బయలువడెనేని నీవు ఉండవు, నేను ఉండను.'

ఇట్లు చెప్పి దమనకుఁడు కరటకునికడకుఁ బోయెను. 'ఏమి జరిగినది ?' అని కరటకుఁ డడిగెను. 'ఇదె ఒండొరులనుండి వేఱుబందము నివ్వటిల్లినది.' అని దమనకుఁడు చెప్పెను. కరటకుఁడనియె.- 'ఇందు సందేహ మేమి ? ఏలన,—

క. అనఁగనఁజెలి యెవఁడు కూళకుఁ?
గినియఁ డెవం డర్థి వచ్చి గీపెట్టినచోఁ ?
దనియు నెవఁడు ధనములచే ?
నెనయఁ డెవఁడు నేర్పు దుష్టకృత్యంబులకున్ ? ౧౭౧

మఱియు,—

క. ఖలులు తమ పెంపుకై భూ
వలయేశు నొనర్తు దుష్టవర్తనుఁ గాఁగన్,

ఖలసంసర్గం బేచే
బోలయింపదు యాశ్రయాశుఁ డుపమానముగాన్.'

తర్వాత దమనకుఁడు పింగళకుని కడకుంబోయి 'స్వామీ, ఆపాపాత్ముఁడు వచ్చినాఁడు; ఏలినవారు సిద్ధపడి యుండవలయును;' అనిచెప్పి మున్ను చెప్పినరూపున నుండఁజేసెను. సంజీవకుఁడును వచ్చి, ఆతీరున సింహము ఆకారము మాఱియుండుటం గాంచి తనకు తగినట్లు పరాక్రమించెను. ఆ రెంటిపోరిలో సంజీవకుఁడు సింహముచేత మడిసెను. అంతట సేవకుఁడయిన సంజీవకునిం జంపి పింగళకుఁడు దుఃఖాక్రాంతుఁడుగా నుండి ఇట్లు వక్కాణించెను. 'ఏల నేను క్రూరకృత్యమును చేసితిని! ఎట్లన,—

క. పరు లనుభవింత్రు రాజ్యము,
నరపతి కేవలము భాజనం బఘమునకున్;
కరిఁ గూల్చునఘము హరికిన్,
గరిపాల భుజియించువేడుకలు నక్కలకున్. ౧౭౩

మఱియు,—

తే. గుణి భటుఁడు, కొంతభువియును గుణియె, రెంట
భటుఁడు పోయినఁ గల్గును బతికి మి త్తి,
పోవు భూఖండమును వెండి పొరయవచ్చుఁ,
బ్రాజ్ఞులగు భటులనిన దుర్లభులు జగతి. ౧౭౪

దమనకుఁ డనియె;- 'స్వామీ యిదేమో క్రొత్త

న్యాయముగానున్నది. ఏదనఁగా, శత్రువును జంపి వగచుట.
ఇట్లు చెప్పియున్నారు:—

తే. తండ్రియేని, సహజుఁడేని, తనయుఁడేని,
సుహృదుఁడేని, తనుంజంపఁ జొత్తురేని,
తనదుశ్రేయంబు నిలుపుకోఁ దలఁపుగలిగి
వారిఁ బరిమార్పవలయు భూవరుఁడు వేగ. ౧౭౫

మఱియు,—

తే. ప్రభువు ధర్మార్థకామతత్త్వంబు లెఱిఁగి
కేవలకృపాప్రవణుఁ డైనఁ జేవ యెడలు;
చేతిలోనియన్నమును భుజింపఁ గూడ
క్షముఁడు గాఁ డిలఁ గేవలక్షముఁడు నరుఁడు. ౧౭౬

మఱియు,—

తే. శత్రుమిత్త్రులయెడలను సమము గాఁగ
మునివరులకన్న క్షమ గొప్పభూషణంబు,
ధర్మసేతువు నవియించు దండ్యులయెడ
దొరల కనిన నదే మహాదూషణంబు. ౧౭౭

తే. రాజ్యలోభంబు పూని, గర్వంబు మీఱి,
స్వామిపదమును గోరెడు బాలిశులకుఁ
బాచితం బిది యొక్కటే పరఁగు భువిని,
బాడు ప్రాణానిలంబుల వీడుకొనుట. ౧౭౮

మఱియు,—

తే. క్ష్మాపతిని ఘృణి, సర్వభక్షకుని విప్రు,
వశపడనియాలి, దుష్టస్వభావు ననుఁగుఁ,
బగ గొనినభృత్యునిఁ, బ్రమాదపడుని యోగి,
నేడుగురను, గృతఘ్నుని విడవలయు. ౧౭౯

విశేషముగా,—

తే. ఋతయు ననృతయుఁ, బరుషయు హృద్యవచన,
హింస్రయు దయాళువును, లుబ్ధ యీవి గలది
అవిరతవ్యయ యవిరతాత్యాయతియును,
పణ్యాసఖివోలె నృపనీతి బహుళకీతి. ౧౮౦

ఇట్లు దమనకుఁడు సమాధానపెట్టఁగా పింగళకుఁడు స్వస్థమానసుఁడై గద్దియపై కూర్చుండెను. దమనకుఁడు, 'మహారాజు సర్వోత్కృష్టుఁడుగా నుండునుగాక ; సకల లోకములకును మంగళమగుఁగాక' అని పలికి సుఖముగా కూర్చుండెను.

విష్ణుశర్మ, 'రాజపుత్త్రులారా, మీరిపుడు మిత్త్రభేదమును వింటిరి' అని హెచ్చరించెను. 'నీయనుగ్రహమువలన విని మేము సుఖము పొందినారము.' అని రాజపుత్త్రులు చెప్పిరి. విష్ణుశర్మయనియె- 'అయినను ఇదియు నగుఁగాక.

ఉ. మీరిపువేశ్మశాలిని స
మిద్ధసుహృద్భిద రూపుమాపుతన్ ;
సారెకు సారెకున్ ఖలులు
సంక్షయమొందుతఁ గాలచోదనన్ ;

సు హృ ల్లే ఖ ము

కేరళ సర్వభోగములు
గేహముల న్విలసిల్ల మీప్రజల్ ;
ఈరమణీయసంకథల
కెంతయు బాలురు నుత్సహించుతన్. ౧౮౧

సుహృల్లేఖము సమాప్తము.

---

# విగ్రహము

మరల కథ యారంభించుతఱిని రాజకుమారులు 'అయ్యా, మేము రాజకుమారులముగాన విగ్రహతంత్ర మును వినఁగోరుచున్నాము' అనిరి. 'మీకు ఇచ్ఛ యున్నదిగాన చెప్పెదను. విగ్రహమును వినుఁడు; అందు ఇది మొదలిశ్లోకము.—

క. నెమళులకు హంసములతో
సమకొన విగ్రహము తొల్లి, సమవిక్రమతన్
సమయించె హంసములఁ గా
కము లిలు సొత్తెంచి నమ్మకముగఁ గొలుచుచున్.' ౧

'ఆకథ యెట్లో చెప్పు'మని రాజకుమారు లడిగిరి. విష్ణుశర్మ చెప్పందొడంగెను:—

'కర్పూరద్వీపమందు పద్మకేళి యని సరస్సు కలదు. అందు హిరణ్యగర్భుఁడను రాయంచ వసించుచుండెను. దానిని నీటి పక్షులన్నియు చేరి పక్షిరాజ్యమునకు పట్టాభి షేకము చేసినవి. ఏలయన,—

ఆ. శాస్త్రసమ్మతముగఁ జదురుగా నడిపింపఁ
బ్రభుఁడు లేఁడ యేని, ప్రజ రయమున

ఆరకాటి లేక వారాశి మధ్యలో
నౌక వోలె సర్వనాశ మొందు. ౨

మఱియు,——

ఆ. ప్రజను రేఁడు గాచుఁ, బ్రజయు రేనిం బెంచుఁ,
బెంపుకన్నఁ గాపె పెద్ద సుమ్ము;
కాపు లేనిపట్ల కలదియు లేనిదే,
లేని దట్లు పెంచు రేనిఁ జెపుమ. ౩

ఒకప్పుడు ఆ రాజహంస విశాలమైన తామరపూ మంచముపై సుఖముగా కూర్చుండి యుండెను. పరివారము చుట్టురా నిలిచియుండెను. అంతట, ఏదేశమునుండియో వచ్చి దీర్ఘముఖుఁడనెడు కొంగ నమస్కరించి కూర్చుండెను. 'దీర్ఘముఖుఁడా, దేశాంతరమునుండి వచ్చితివే, వృత్తాంతము చెప్పుము;' అని రాజడిగెను.

దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు:- 'స్వామీ, గొప్ప వృత్తాంతము కలదు; దానిని చెప్పుటకే నేను వడిగా వచ్చితిని. వినుఁడు:- నేరేటిదీవియందు వింజమని కొండగలదు. అందు చిత్రవర్ణుఁడను పక్షులదొర నెమలి వసించుచున్నాఁడు. అతనిసేవకులు కాలినయడవిలో సంచరించుచున్న నన్నుఁజూచి, 'నీవెవరవు? ఎటునుండి వచ్చితివి?' అనియడిగిరి. అంతట, 'కర్పూరద్వీపపుఁజక్రవర్తి హిరణ్యాగర్భుఁడను రాజహంసయొక్క సేవకుఁడను నేను. కుతూహలముచే దేశాంతరములు చూడవచ్చినాఁడను,' అని

నేను చెప్పితిని. ఆమాటలు విని ఆపక్షులు 'ఈ రెండుదేశ ములలోను ఏది శ్రేష్ఠము? దేనిరాజు శ్రేష్ఠుఁడు?' అని యడిగినవి. 'ఇసీ, ఏమి ఇట్లడిగెదరు? వారి విస్తారము; ఎట్లనః- కర్పూరపు దీవి రెండవస్వర్గము; హిరణ్యగర్భుఁడు రెండవ దేవేంద్రుఁడు. ఈయెడారిలో ఉండి మీ రేమిచేసెదరు? మాదేశమునకు రండి.' అని నేను వచించితిని. అంతట నామాట విని ఆపక్షులన్నియు కోపించినవి. అట్లును చెప్పి యున్నారు;—

క. పామును బాలిడి పెంచిన
   నే మగు? విష మెచ్చు, మఱి యమృతము వెరుఁగునే?
   క్షేమంకరోక్తి సెప్పినఁ
   దామస మగుఁ గాని శాంతి దాఁకునె మూర్ఖున్? కి
మఱియొకటి;—

క. ఉపదేశింపంగాఁ దగు
   విపశ్చితుని కైనఁ, దగదు విపరీతునికిన్;
   ఉప దేశించి ఖగంబులు
   కపులకుఁ, దమతావు విడి వగల జనలేదా?' గీ
'అదియెట్లని రాజడిగెను.—దీర్ఘముఖుఁ డిట్లు వక్కాణించెను;—

కథ ౧.

'నర్మదానది యొడ్డున గొప్పబూరుగుచెట్టు కలదు. అందు గూండ్లుకట్టుకొని పక్షులు వసించుచుండినవి. ఒక

వ్వాడు వర్షాకాలములో నీలమేఘములు ఆకాశము నావ
రించి గొప్పజడివాన గురిసెను. అంతట చలికి వణఁకుచు
చెట్టుక్రింద నున్నట్టి క్రోఁతులంగని పక్షులు దయాపూర్వ
కముగా 'ఓహో! క్రోఁతులారా, వినుండు,—

ఆ. ముక్కుమాత్రముననె పోఁచలఁ గొని తెచ్చి,
గూండ్లు నేము కట్టుకొంటి మయ్య!
కాళ్లు చేతు లుండి, వ్రేళ్లు గోళ్లును గల్గి,
యీడిగిలెద రేల యీర లిట్లు?' ౬

దానిని విని క్రోఁతులు కోపావిష్టములై 'ఓహో! గాలిలేనిగూండ్లలో సుఖముగా నున్న యీపక్షులు మనలను హేళనము చేయుచున్నవి! కానీ, వాన వెలియనీ.' అని యాలోచించుకొన్నవి. తర్వాత ఒకక్రోఁతి యిట్లనియె,—

ఆ. 'సూచిముఖములార, నీచవృత్తములార,
ప్రాజ్ఞమానులార, పలువలార,
మేము గృహము కట్ట నేము నేరము గాని,
కూల్చ వైవ మేము కోవిదులము.' ౭

తర్వాత వాన వెలిసినంతట ఆక్రోఁతులు చెట్టెక్కి గూండ్ల నన్నిటిని పాడుచేసినవి. పక్షులగ్రుడ్లను నేలకు దొర్లించినవి. కావున నేను 'ఉపదేశింపంగాఁదగు' ఇత్యాదికముం జెప్పితిని.'

'తర్వాత ఆనెమళ్లు ఏమిచేసినవి?' అని రాజడిగెను.

‘ఎవరు ఈరాజహంసను రాజును చేసినవారు?’ అని యవి కోపమున నడిగినవి. అందులకు నేను కోపము వచ్చి ‘మీ నెమలిని ఎవఁడు రాజుంజేసెను?’ అని యడిగితిని. ఆ మాటను విని అవియన్నియు నన్ను చంపవచ్చినవి. అంతట నేనును నాశౌర్యమును రుచి చూపితిని. ఏలయన,-

ఆ. మగల కొండు వేళ *నగఁగా నెసఁగు నోర్పు
మడఁతుకలకు లజ్జమాడ్కి మిగుల,
పరిభవమున కెదురు భాసిల్లు శౌర్యంబు,
మారుకేళి ధార్ష్ట్యమహిమవోలె.’ ౮

రాజు నవ్వి యిట్లనియె:—

క. ‘పరిపంథులకుం దనకుం
బరఁగుబలాబలము లెవఁడు పరికించియునం
తర మెఱుఁగకుండు నాతఁడు
పరిభవముం దప్ప కొందుఁ బరిపంథులచేన్. ౯

మఱియు,—

క. పులితో ల్దొడిగెడు పేరిమిఁ
బొలమున నిత్యంబు సస్యముల్ మేసి, తుదిన్
దెలివి తలఁగి, ఖర మోండ్రలు
సలిపి, కడఁది మోఁదు లొంది, సమయుదె మిత్రా!’ ౧౦

*నగ=భూషణము.

'అది యెట్లో చెప్పు'మని కొంగ యడుగ, రాజు వచిం చెను:—

కథ ౨.

'హస్తినాపురమందు విలాసుఁడని చాకలియుండెను. వానిగాడిద అమితముగా మోచిమోచి సత్తువపోయి చావుదశకు వచ్చినది. అంత నాచాకలి ఆగాడిదను పులి తోలుఁ గప్పి కాటివెంబడి పైరుపొలములో నిలిపెను. అంతట దానిని దూరమునుఁడి కని పొలముకాఁపులు పులి యనుకొని వడిగా పాఱిపోవుచుండిరి. గాడిద పైరుమేసి దినదినమునకు ఒడలెల్ల బలిసినదాయెను. ఇట్లు జరుగు చుండఁగా ఒకప్పుడు పొలముకాఁపు ఒకఁడు బూడిదవన్నె కంబళముతో చేసిన కవచము దాల్చి, విల్లును అమ్మును సిద్ధము చేసికొని ఏకాంతమున నుండెను. వానిని దూర ముననే కాంచి గాడిద ఓండ్రపెట్టుచు వానికేసి పరుగెత్తి నది. అది గాడిదయని పొలముకాఁపు తెలిసికొని ఆటగానే దానిని చంపెను.—కావున 'పులితోలు' ఇత్యాదికమును నేను వచించితిని.'

దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు;—'ఓరిపాపీ, పాడు కొంగా, మాభూమిలో తిరుగుచు మాయేలినవారిని దూ షించెదవా? దానిని మేము ఇపుడు క్షమింపము,' అని పలికి, ఆపక్షులన్నియు నన్ను ముక్కులతో పొడిచి కోప మున వచించినవి. 'చూడరా మూర్ఖుఁడా, ఆహంస, నీదొర,

ఎల్లవిధములను మెత్తనివాఁడు. వానికి ఏలుటకు యోగ్యతయే లేదు. ఏలయన, కేవలమ్మృదువు చేతిలోని ధనమును కూడ కాపాడుకోనేరఁడు. అట్టివాఁడు పుడమి నేలుట యెక్కడిది? వానికి దొరతన మెక్కడిది? మఱి నీవో నూతిలోనికప్పకు సముఁడవు. కావున వానిని కొలువు మని మాకు నేర్పవచ్చితివి. విను;—

ఆ. పండు, కాయ, నీడ, యుండు మహావృక్ష
మండ గొనఁగవలయు నరసి బుధుఁడు;
దొరకదేని పండు దుర్దైవవశమున
నీడఁ బొలఁచునట్టి ప్రోడ యెవఁడు? ౧౧

మఱియు,—

క. అండగొనరాదు నీచుల,
నండగొనంగాఁ దగును మహాత్ముల నెందున్;
శౌండిని కైఁగొని తెచ్చిన
నందురు పా లయిన మద్య మనియే లోకుల్. ౧౨

మఱియు,—

ఆ. కూడి నిలువ రాదు, కూడి నడువ రాదు,
క్షణమయినను దుష్టజనులతోడ;
దుష్టసంగమంబు తోడితెచ్చును మిత్తి,
సాధుసంగ మమృతసారఘుటిక. ౧౩

మఱియు,—

తే. ఎంతటిగుణోత్కరంబైన నుంత యగును
హీనగుణు నాశ్రయించిన మానవునకు,
అధికరణమున నాధేయ మణఁగుఁ గాదె,
చూడమే యద్దమున నేన్గు సూక్ష్మమగుట ? ౧౮

తే. పేరు చెప్పినమాత్రఁ జేకూరు సిద్ధి,
యధిపుఁడు మహాసమర్థుఁ డై యలరునేని,
శశధరునిపేరు సెప్పి శశములు వనిని
జెలఁగవే సుఖముగ నిష్టసిద్ధిఁబొంది?' ౧౯

'అదియె'ట్లని నేనడుగఁగా పక్షులు చెప్పినవి:—

కథ ౩.

'ఒకానొకప్పుడు వర్షాకాలములో సయితము వాన కురియనందున దప్పికి తాళలేక ఏనుఁగుపిండు పరికాని తో నిట్లు చెప్పుకొనెను : 'దొరా, మాకు జీవనోపాయ మేమి ? క్షుద్రజంతువులకుఁ గూడ స్నానమునకు చోటు లేదు. మేము స్నానము లేనందున గ్రుడ్డివారముం బోలె నున్నాము. ఎటకుఁ బోదుము ? ఏమి సేయుదుము ? ' అంతట ఏనుఁగుదొర ఒకపాటి మారముపోయి నిర్మలమయిన చెఱువును చూపినది. దాని దరిని నివసించియున్న కుందేళ్లు ఏనుఁగుగుంపుయొక్క కాళ్ల దెబ్బలకు నలినలియైనవి. అంతట శిలీముఖమను పేరి కుందేలు ఇట్లు ఆలోచించినది: 'ఈ యేనుఁగుపిండు దప్పికి కలఁగి ప్రతిదినమును ఇటకు వచ్చెడిని. అందుచేత మనకులమే నశించును.' అందులకు

విజయుఁడను ముసలికుందేలు 'ఖేదపడకుఁడు, నేను ఇందు లకు ప్రతిక్రియ చేసెదను:' అని ప్రతిజ్ఞ చేసి తరలెను. పోవుచు ఆకుందేలు దారిలో ఆలోచించెను: 'ఏనుఁగు పిండు కడ నిలిచి నేనేమి సేయఁగలను ? ఏలన ;—

ఆ. దంతి నిమురుచునె వధం బొనరించును,
పాము మూర్కొనుచునె ప్రాణముఁ గొను,
రాజు ప్రోచుచునె శిరంబును దివియుఁచు,
తులువ కడునగుచునె పొలియఁ జేయు. ౧౬

మఱి నేను కొండకొమ్మున కెక్కి పరికానితో పలికెదను.' అట్లే చేయఁగా పరికాఁడు, 'ఎవరవు నీవు ? ఎటనుండి వచ్చితివి ?' అని యడిగెను. కుందేలు 'నేను దూతను; చంద్రభగవానుఁడు పంపఁగా వచ్చితిని' అనెను. 'వచ్చినపని చెప్పు'మని పరికాఁ డడిగెను. విజయుఁడు చెప్పుచున్నాఁడు :—

ఆ. 'కత్తు లెత్తి పొడువ గమకించుచున్నను,
దూత పలుకఁ డొండురీతిగాను,
ఎప్పుడును నవధ్యుఁడే యాట, నాతండు
తథ్యమే వచించు ధర్మయుక్తి. ౧౭

కాన నేను నాదొరయగు చంద్రునియాజ్ఞచేత చెప్పుచున్నాను. వినుము,—'చంద్రసరస్సునకు కాపున్నట్టి యాకుందేళ్లను నీవు వెడలఁగొట్టితివి; అదిమంచిపని గాదు.

ఏలయన, వానిని నేను కాపాడుచున్నాను. అందుననే నాకు శశి యనిపేరు.' రాయబారి యిట్లు పలుకఁగా, పరి కాఁడు వెఱపున నిట్లనియె:-'ఇది నేను తెలియక చేసితిని. ఇఁక మరల నిటకు రాను.' దూతచెప్పెను;-'మఱి ఈచెఱువులో కోపముచేత కంపించుచున్న చంద్రభగవానులను ప్రణమిల్లి అనుగ్రహింపఁ జేసికొని పొమ్ము.' తర్వాత ఆ కుందేలు పరికానిని రాత్రి తోడ్కొనివచ్చి నీటిలో చలించుచున్న చంద్రప్రతిబింబమును చూపి నమస్కారము చేయించి, 'స్వామీ, ఈతఁడు తెలియక చేసిన తప్పిదమును క్షమింపుఁడు.' అనివచించి పరికానిని పంపివైచెను. కావున నేను 'పేరు చెప్పినమాత్ర' నిత్యాదికముం జెప్పితిని.'

అంతట నేను చెప్పిన దేమనఁగా-'ఆమా యేలిక యే మహాప్రతాపము గలవాఁడు; అతిసమర్థుఁడు. ఈమూఁడు లోకములను ఏలుటకు అతఁడే తగినవాఁడు.'అంతట నన్ను ఆపక్షులు కట్టి 'మాదేశములో నీవెట్లు సంచరించెదవు?' అని పలికి వారి రాజు చిత్రవర్ణుని కడకుం గొనిపోయినవి. రాజుమ్రోల ఆపక్షులు ప్రణమిల్లి నన్నుఁగూర్చి యిట్లు చెప్పినవి:-'ప్రభూ, చిత్తగింపవలయును. ఈచెడుకొంగ మనదేశములో తిరుగుచుండియు ఏలినవారిని నిందించుచున్నది.' 'ఎవరు వీఁడు? ఎటనుండి వచ్చినాఁడు?' అని రాజడిగెను. 'వీఁడు హిరణ్యగర్భుఁడను రాయంచకు సేవ

కుఁడు; కప్పూరపు దీవినుండి వచ్చినాఁడు.' అని వారు చెప్పిరి. అంత మంత్రిగద్ద 'అచట ముఖ్యమంత్రి యెవఁడు?' అని నన్నడిగెను. 'సర్వశాస్త్రపారీణుఁడు సర్వజ్ఞుఁడను పేరి జక్కవ' అని నేనుచెప్పితిని. 'తగును; ఈతఁడు మీరాజు నకు స్వదేశమువాఁడు గదా.' అని గద్ద చెప్పెను. ఏల యన,—

సీ. 'తననాటివాఁ, శుద్ధకులు, శుద్ధాచారు,
సుపథాశువైని, ధీరు, సుచితవృత్తు,
శాస్త్రజ్ఞు, సప్తవ్యసనములం దొకఁ డైన
లేనివానిఁ, బ్రసిద్ధుఁ డైనవాని,
వ్యభిచారదోషవివర్జితు, వ్యవహార
ధర్మజ్ఞు నర్థశాస్త్రప్రవీణు,
మూలమంత్రులవంశమున జనించినవాని,
సకలార్థపాళి సంసాధనరతు,
తే. తనకు మంత్రివరునిఁ గాఁగ ధరణివిభుఁడు
నేసికొనఁ, దనప్రజలకు సేమ మొదవి,
తనకు నహింభయ మణఁగి, శాత్రవకులములు
వెరగుపడ, నింద్రభోగముల్ వెలయుచుండు.' ౧౮

ఇంతలో చిలుక యిట్లనియె:—'స్వామీ, కప్పూరపు దీవిలోనగునవి చిన్నదీవులు; జంబూద్వీపములో చేరినవే. వానిమీఁదఁగూడ ఏలినవారికి దొరతనము గలదు.' అంత రాజు 'అవును అట్లే.' అనిపలికెను. ఏలయన,—

క. కైపున నున్నాతఁడునుం,
బాపఁడు, ధనగర్వితుఁడుఁ, బ్రమాదియు,నృపుఁడున్,
జేపడనిదాని వలతురు,
చేపడి యెడి దానిమాట చెప్పవలయునే? ౧౯

'మాటమాత్రాననే దొరతనము కలుగునెడల, ఆ పక్షమందు, మాదొర హిరణ్యగర్భునికి జంబూద్వీపము మీఁదకూడ దొరతనము కలదు.' అని నేను వచించితిని. 'ఇందులకునిర్ణయ మెట్లు?' అని చిలుక యడిగినది. 'యుద్ధముననే' అని నేనుపలికితిని. రాజు నవ్వుచు 'ఓయి, పోయి నీదొరను సిద్ధపఱుపుము.' అనెను. 'మీదూతను కూడ నంపుఁడు' అని నేనంటిని. రా జిట్లనియె:–'దూతగా ఎవనిని పంపుదము? ఏలయన, ఎట్టివాఁడు దూతగా పంపఁదగినవాఁడనఁగా;—

ఆ. భక్తుఁ, డవ్యసనియుఁ, బరమర్మవేదియు,
క్షమియు, దంట, శుచి, ప్రగల్భుఁ డైన
బ్రాహ్మణుండు, గుణియుఁ, బ్రతిభానవంతుండు
దూత్యకర్మమునకు దొడ్డవాఁడు.' ౨౦

గద్దయిట్లనియె ;–'ఉన్నారు దూత లనేకులు ; అయినను బ్రాహ్మణునే దూతఁగాఁ బంపవలయును. ఏలయన;–

తే. విప్రుఁడు ప్రసాద మొనరించు విభుని కెందు,
సంపదలఁ దనకొఱకు వాంఛింపఁ డెపుడు,

ఈశ్వరునితోడ సంగాత మొనసియున్న
కాలకూటంబు కోల్పోదు కాళిమంబు.' ౨౧

'అట్టయిన చిలుకయే చనునఁగాక; చిలుకా, నీవే యీతనితోఁ గూడ నేఁగి మాయిష్టమును చెప్పిరమ్ము.' అని రాజు ఆజ్ఞాపించెను. చిలుక యిట్లనియె.-'ఏలినవారి యాజ్ఞప్రకారము చేసెదను. కాని యీకొంగ దురాత్ముఁడు; దురాత్మునితో నెప్పుడును నేను పోను. పెద్దలు అట్లే చెప్పియున్నారు.—

క. ఖలుఁడు చెడునడత నడచిన,
ఫలము తదీయంబు సాధుబాధాకరమౌ;
జలధికి బంధన మయ్యెఁ
బలాశి సీతను హరించి పఱతెంచుటచేఁ. ౨౨

మఱియు,—

ఆ. కూడ నిలువరాదు, కూడఁబోవఁగ రాదు,
ఖలునితోడ నెప్పుడుఁ గలనైన;
కాకితోడ నుండి కాంచె మిత్తిని హంస,
వెలిచెపిట్ట కూడ వెడలిచచ్చె.' ౨౩

'ఆకథయెట్లు?' అని రాజడిగెను. చిలుక పలికెను;—

కథ ౪.

'ఉజ్జయినికి పోయెడి యెడారిదారిలో గొప్ప రావిచెట్టు ఉన్నది. దానిపయి హంసయు కాకియు కాఁపురముండినవి.

ఒకప్పుడు వేసవికాలములో బాటసారియొకఁడు బడలి ఆచెట్టుక్రింద విల్లు నమ్ములు నుంచి నిద్రించెను. తర్వాత క్షణములో వానిమొగము మీఁదనుండి నీడ తొలఁగి పోయెను. అంతట వానిమొగముపై ఎండ పర్వియుం డఁగా చూచి కనికరించి చెట్టుమీఁది హంస ఱెక్కలు విప్పి నీడకలుగఁజేసెను. ఆతఁడు చక్కఁగా నిద్రించి ఆ సుఖముచేత నోరుతెఱచి ఆవులించెను. అంతట ఒరుల సుఖమును చూడనొల్లనిదైన కాకి తనస్వాభావిక దౌష్ట్య ముచేత అతనినోట రెట్టవైచి ఎగిరిపోయెను. అంతనాతఁడు లేచి పైనిచూడఁగా హంస యగపడుడు దానిని కోల నేసి చంపెను. ఏలయన,—

క. ఖలసంసర్గము వదలుము,
కొలువుము కడు సాధుజనులగోష్ఠిని బ్రీతిక్ ;
సలుపుము పుణ్యం బనిశము,
తలఁపుము వస్తులయనిత్యతక్ హృదయమునక్. ౨౭

మహారాజ, వర్తకపక్షికథనుంగూడ చెప్పెదను,—

కథ ౫.

ఒకప్పుడు పక్షులన్నియు గరుత్మంతునికి జాతర సేయుటకై సముద్రముదరికి తరలినవి. అందు కాకితోఁ గూడ వెలిచెపిట్ట పోవుచుండినది. దారిలో గొల్లవాఁ డొకఁడు పోవుచుండఁగా వానినెత్తిమీఁది పెరుఁగుకుండ

లోని పెరుఁగును కాకి మాటిమాటికిఁ ద్రాగుచుండినది. అంతట వాఁడు పెరుఁగుకుండ నేలఁబెట్టి మీఁదచూడఁగా కాకియు వెలిచెయు నగపడినవి. వానికి బెదరి కాకి ఎగిరి పోయినది. తనయందు తప్పులేమిచేతను, మెల్లఁగా పోవు స్వభావము కలదిగావునను వెలిచె వానికి దొరకి చంపఁ బడెను. కావున నేను 'కూఁడనిలువరాదు' ఇత్యాదికముం జెప్పితిని!

అంతట నే నిట్లంటిని.—'అన్నా చిలుకా, ఏలయిట్లు పలికెదవు? నాకు శ్రీమంతులు ఏలినవా రెట్లో నీవును అట్లో' శుకముచెప్పినది.—'అగుఁగాక. అయినను;'

క. ఖలు లెలనవ్వులతోఁ బ్రియ
ము లె సెప్పినవట్టివియును బుట్టించు వెఱఁ,
విలసిల్లుచు నుత్పాతం
బులు గ నకాలభవ పుష్పములునుం బోలెఁ. —౨౫౭

నీవు దుర్జనుఁడవని నీమాటలధోరణిచేత ప్రత్యక్షమయినది. ఎట్లన, ఈరాజుల కిరువురకు పోరు పొసఁగినందులకు నీమాటయే మూలకారణము. చూడు:—

క. తనయెదురనె దోషముచే
సినను మూర్ఖుండు సాంత్వమునకుఁ దనియుఁ ;
వినవె నజారను, నిజ భా
ర్యను నౌదల మోచె మున్ను రథకారుఁ డనఁ.

'ఆకథయెట్లని రాజడుగ, చిలుక చెప్పుచున్నది :—

కథ ౬.

'శ్రీనగరమందు మందమతియని వడ్రంగియుండెను. వానికి తనభార్య చెడిప యని తెలిసినది, కాని మిండనితోఁ గలసియుండఁగా తనకంటితో చూడలేదు. అందువలన వడ్రంగి పొరుగూరికి పోయెదనని చెప్పి తరలి కొంచెము దూరముపోయి మరలవచ్చి తనయింట మంచముక్రిందఁ దూటి దాఁగియుండెను. మఱి యాచెడిప మగఁడు గ్రామాంతరము పోయెనని నమ్మి జారుని సంజప్రొద్దున పిలిచి తెచ్చినది. తర్వాత వానితోఁగూడ మంచముపై యథేష్టముగా క్రీడించుచుండెను. మంచముక్రింద కొంచెము ఒడలితాఁకువలన తనపతియేయని తెలిసికొని దిగులు పడెను. అంతట జారుఁడు ,ఏల నాతో పెల్లుగా క్రీడింపవు ? దిగులొందిన ట్లగపడుచున్నావు ? ' అని యడిగెను. చెడిప యిట్లనియె. ,నాప్రాణేశ్వరుఁడున్నాఁడే ఆయన నేఁడు గ్రామాఁతరము పోయినాఁడు; దానంజేసి యీయూరు సకల జనులతో నిండియున్నను నాకు అడవిగాఁ కనఁబడుచున్నది. ఆపరస్థలమందు ఆయన యెట్లున్నాఁడో ? ఏమి భుజించినాఁడో ? ఎట్లునిద్రించినాడో ? అని నాగుండె పగిలిపోవుచున్నది.' 'అటయిన, నీతో జగడమాడుచు నిన్ను అంకుటాలని పలుకు వడ్రంగిమీఁద నీకు ఇంతప్రేమ

డితూ?' అని మిండగాఁడు అడిగెను. అందులకు అది యిట్లని యె.-'పోరా! కఠినుఁడా, ఏమనెదవు? వినుఁ.—

క. వరుఁడు బెడిదముగఁ దిట్టిన,
గరకర నిప్పుకలు గ్రక్కుకనులఁ గనిన, సా
దరయు, ప్రసన్నముఖియు, యే
వరసతి యది యతనిధర్మభాగిని చుమ్మా. ౨౭

మఱియు,—

తే. పురమునం దున్న, వనినున్నఁ, బుణ్యుఁ డైనఁ,
బాపుఁ డైనను, భర్త యెవ్వ తెకుఁ దనియు
ఆసతికి నగుఁ బ్రాణనాయకునితోడ
నూర్ధ్వతమభువనములు మహోదయములు. ౨౮

మఱియు,—

ఆ. భర్తయే సతులకుఁ బరమభూషణము సూ,
భూషణములు గావు భూషణములు;
అతఁడు లేనియట్టి వారిణాయ తాత్ములు
శోభనలె యగుదు రశోభనలుగ. ౨౯

నీవు మిండఁడవు. నిన్ను బుద్ధిచాపల్యము చేత-పువ్వులను తాంబూలమును ఎట్లో అట్లే-ఎప్పుడేని పొందుచున్నాను. ఆయన నాయొడయఁడు, నన్ను అమ్ముటకును, వేల్పులకును బ్రాహ్మణులకును ఇచ్చుటకును శక్తుఁడు. వేయేల?

ఆ. బ్రదికియున్న నతఁడు బ్రదికి యుండెద నేను,
మృతుఁ డయిన నతండు మృతను నేను,
మృతుని నతని ననుగమించుటయే నాకు
గడఁదినిశ్చయంబు గా నెఱుంగు. ౩౦

ఏలయన,—

ఆ మనుజదేహంబునందు రోమంబు లెవ్వి
మూఁడుకోటులు నరకోటి మొనయుచుండు,
భర్తతో సొదఁ గాలినపడఁతి యన్ని
వత్సరము లుండు నతనితో స్వర్గమందు. ౩౧

మఱియు,—

ఆ. బిలమునుండి వెలికి బలిమి వ్యాళగ్రాహి
పాముఁ దివుచుభంగిఁ బతిఁగొనిచని
సహగమన మొనర్చు సాధ్వి యాతనితోడ
నాకమున సుఖంబు లనుభవించు. ౩౨

మఱియు,—

క. మృతుఁ బ్రియు క్షితిపై నెవ్వతె
కుతుకంబునఁ గౌఁగిలించుకొని దఱికొనునో,
శతలక్షదోష యయ్యును
బతితో నాసాధ్వి స్వర్గభాగిని యగుఁబో. ౩౩

ఏలయన,—

తే. అయ్యగాని తదనుమతి నన్నగాని
యేపురుషునికిఁ దన్నిత్తు రాపురుషుని

బ్రదికియుండిన యప్పుడు కొల్వంగవలయు
సంస్థితు నతని లంఘనసల్పరాదు.' ౩౮

ఇదంతయు విని పద్రంగి, 'నేను కృతార్థుఁడను, ఏలన, నాకు ఇట్టిభార్య ప్రేమగలదియు, ప్రియము పల్కునదియు కలదు;' అని మనస్సులో నెంచుకొని ఆమంచమును, ఆస్త్రీపురుషులతోఁగూడ నెత్తికెత్తుకొని చాలసేపు నాట్యమాడెను. కావున 'తనయెదురనె దోషముచేసి ననుఁ' ఇత్యాదికముం జెప్పితిని.

అంతట ఆరాజునన్ను ఆచారము ప్రకారము సత్కరించి పంపినాఁడు. చిలుకయు నావెనుక వచ్చుచున్నది. దీనినెల్ల నారసి ఏమిచేయవలయును.'

జిక్కవ నవ్వి యిట్లనియె;-'స్వామీ, కొంగ దేశాంతరము పోయి తనశక్తికొలఁది రాచకార్యమును సాధించినది. కాని ఇదిమూర్ఖుల స్వభావము; ఏలయన,—

క. పోరిని నూ త్రైనను నిడి
వారణ నేసికొనుట గుఱి ప్రాజ్ఞుల కెందుఁన్,
కోరి యకారణముననుం
బోరఁ గడంగుట గుఱితగు మూర్ఖుల కెందుఁన్.' ౩౯

రాజనియె;-'ఏటికీనింద? ఇప్పుడు చేయవలసినదేమో దాని నాలోచింపవలయును.' జిక్కవ పలికినది- 'స్వామీ, ఏకాంతమందు చెప్పెదను; ఏలయన,—

తే. వర్ణ మాకారమును బ్రతిధ్వానములును
నేత్రవక్త్ర వికారముల్ గాత్రచేష్ట
వీనిచే ధీరు లూహింత్రు లోనితలఁపు,
గాన మంత్రణమునకు నేకతమ వలయు.' 3౬

అంతట రాజును మంత్రియు నటనే యుండిరి. ఇతరులు ఆవలికి పోయిరి. జక్కవ చెప్పినది.-'దేవా, నా కిట్లు తోచుచున్నది;-మనయుద్యోగస్థుఁడే ఎవఁడో ప్రేరింపఁగా కొంగ ఈపని చేసినది. ఏలయనఁగా,—

తే. వైద్యునకు నెల్లెడలను జీవనము రోగి,
వ్యసనిపతి జీవనంబు సేవాపరులకు,
కోవిదుల కెందు మూర్ఖుండు జీవనంబు,
సత్కులుఁడు జీవనంబగు సజ్జనులకు.' 32

రాజనియె,-'కానీ, కారణమును తర్వాత కనిపట్టుదము. ఇప్పటి కేది ప్రస్తుతమో దానిం జెప్పుము.' చక్రవాకమిట్లు చెప్పుచున్నది.-'స్వామీ, వేగును పంపవలయును. వానివలన వారిసన్నాహమును, బలాబలమును ఎఱుంగుదము. అట్లగదా;—

క. మనుజపతికిఁ దనరాష్ట్రం
బునఁ బరరాష్ట్రమునఁ గార్యము నకార్యంబుల్
గనుకన్ను వేగు, వాఁడౌ
వ్వని కుండఁడో యతఁడు గ్రుడ్డివాఁడు ధరిత్రిన్. 3౮

వాఁడు నమ్మకమయినవాని నింకొకని తోడ్కొని పోవ లయు. అట్లుచేసిన వేగు తానచటనే యుండి అచటిమంత్ర కార్యములను మిక్కిలిగూఢముగా నిజము నెఱింగి, ఆరెం డవ వానిచేత చెప్పివంపును. అట్లును చెప్పిరి ;—

క. అమరాలయముల ధర్మా
శ్రమముల శాస్త్రాధిగమవశమునఁ దపసివే
సమునఁ దిరుగు తన వేగుల
క్షమావిభుం డేకతమునఁ గలయఁగ వలయున్. ౩౯

గూఢచారుఁ డనఁగా నీటను నేలనుంగూడ సంచ రించువాఁడు ; కావున ఈకొంగనే అందులకు వనిగొన వలయును. ఇట్టిదానినే మఱియొక కొంగను వీనికి తోడుగా పంపవలయును. వారి యింటివారు రాజద్వారమున నుండ వలయును. మఱి, రాజా, ఇదంతయు మిక్కిలిరహస్య ముగా చేయవలయును. ఏలయన,—

ఆ. ఆఱు చెవులుగలయ నవయును మంత్రంబు,
చెప్పి పంపినదియుఁ జెదరు నల్లి,
కాన నాల్గె చెవులుగాఁ దనతోఁ గూడ
నృపతిమంతనంబు నెరపవలయు. ౪౦

మఱియు,—

క. ఏదోషంబులు మంత్రో
ద్భేదమున జనించు రాజ్యభేదకములుగాన్

గా దెట్టివారికైనను
నాదోషంబులును దిద్దనంద్రు నయజ్ఞుల్.' ౮౧

రాజు ఆలోచించుకొని 'నాకు మేలయిన వేగు దొరకి నాఁడు గాఁడా?' అనెను. 'అటయిన జయము సైతము కలిగినదే.' అని మంత్రిపలికెను. ఈసమయమున దౌవారికుఁడు ప్రవేశించి ప్రణమిల్లి 'స్వామీ! జంబూద్వీపము నుండి చిలుకవచ్చి ద్వారమందున్నది.' అని విన్నవించెను. రాజు చక్రవాకునికేసి చూచెను. 'ఇప్పటికిపోయి బసలో నుండుమను. తర్వాత తెచ్చి దర్శనము సేయింతువుగాని.' అని చక్రవాకుఁడు చెప్పెను. 'ఏలినవారియాజ్ఞ' అని పలికి ద్వారపాలకుఁడు చిలుకను తోడ్కొనిపోయెను. 'పోరే మా పొసఁగినది' అని రాజనెను. జక్కవ యిట్లనియె:- 'స్వామీ, అవును. కాని ముందుగానే పోరు శాస్త్రీయము గాదు. మఱియు;—

క. వైరిని గెలుచుటకొఱకై
పోరితమునె సాధనముగఁ బూనకు మెపుడున్,
పోరెడు రిపుల కిరువురకుఁ
బోర గెలుపు నిశ్చయంబుఁ బొరయనికతనన్. ౮౨

మఱియు,—

ఆ. సామ దాన భేద సాధనంబులలోన
నొంట రెంట మూఁట యుక్తి మీఱ

జతనసేయు మరిని సాధించుటకు నెప్డుఁ,
బోరు సాధనముగఁ బూన కయ్య! ౪౩

ఏలయన,—

ఆ. పోరు లేనియపుడు శూరులే యెల్లరుఁ,
బోరు పొసఁగినపుడు శూరుఁ డరుదు,
పరునిబలము బోధపడక యున్నప్పుడు,
దర్ప మందఱకును దాండవించు. ౪౪

మఱియు,—

ఆ. కొయ్యతోడ నెట్లు గుండు లేపఁగ వచ్చు
నట్లు చేత లేప నలవి గాదు;
చిన్నయుపమచేతఁ బెన్నిధిఁ బోల్సిద్ధి
యదియు మంత్రమున మహాఫలంబు. ౪౫

మఱి పోరుపొసఁగిన నెఱింగి వ్యవహరింపవలయును.

ఏలన,—

ఆ. జతను మీఱఁ బ్రోది సల్పి కాచుచు నుండ
నెట్లు పిదప సేద్య మిచ్చు ఫలము,
అట్లె వేఱుసమయమందె నీతి ఫలించుఁ
గాని తత్క్షణంబె గాదు ఫలము. ౪౬

మఱియు,—

క. దూరపుటనికి మహాత్ముఁడు
భీరు వగున్, జెంత యనికి బీరము మెఱయున్;

చేరువయిడుమలయెడలన్
ధీరత యాతనికి సహజధీగుణముసుమా. ౪౭

మఱియు,—

ఆ. ఎల్లసిద్ధులకును నిది తొలివిఘ్నంబు,
ఎది యనఁగ మనమున నుదిలగొనుట ;
శీతలోదకంబు చీల్పదే కొండను
ఈనిదర్శనమున నెనయు తాల్మి. ౪౮

ముఖ్యముగా ఈరాజు చిత్రవర్ణుఁడు మహాబలుఁడు.

క. అని సేయరాదు బలిపై,
ననఁగ, నిదర్శనము లెన్ని యైనను గలుగున్,
మనుజుఁడు మత్తేభంబున్
జెనకిన మృతి యెవరి కగునో చెప్పవలయునే? ౪౯

మఱియు,—

క. త్వరపడి హాదనికి వేవక
దుర మపకారిపయి చేయుదుర్మతి యీల్గున్,
తరలుట బలాధికునిపైఁ
బురువునకున్ ఱెక్క లొదవి పొలియుటఁ బోలున్.

మఱియు,—

క. వ్రేటయిన నోర్చునది తా
మేటివలెన్ మేను ముడిచి మొలఁకువతోడన్,
వాట మగుతఱిని భుజగము
మేటిపడగ విప్పునట్లు మెఱయఁగవలయున్. ౫౧

క. ఏటివడి యేకరణి ను
త్పాటించును సరిగ గరికఁ బాదపమును, నా
సాటిగ నుపాయవంతుఁడు
మేటిని నల్పుని సమముగ మెట్టి జయించున్. ౧౨

మనదూతనుంగూడ ఓదార్చి ఆఁపవలయును. ఎందాఁక ననఁగా, దుర్గము యుద్ధమునకు సిద్ధమగునందాఁక. ఏలయన,

క. ఒక్కఁడు ప్రాకారస్థుఁడు
చక్కాడును ధన్విశతము, శత మొకలక్షన్
జక్కాడునట్లు గావునఁ
దక్కక దుర్గంబు వలయు ధాత్రీపతికిన్. ౧౩

మఱియు,—

క. నా డేల దుర్గహీనము ?
పా డగు నది వైరిచేత; వలసకుఁ దావున్,
గూడఁగ దుర్గముఁ గానక
యోడవగులు నరునిఁబోలె నుర్వీశుఁడగున్. ౧౪

క. నగ వన మరు సరి దాశ్రయ
ముఁగ సజల సయంత్రముగ సముచ్ఛ్రితసాలం
బుగను మహాఖాతంబుగ
నెగడంగా దుర్గమును వినిర్మింపఁ దగున్. ౧౫

ఆ. విపులతయును, నధికవిషమత, రసధాన్య
సంగ్రహములు, కాష్ఠసంచయంబు,
చొరఁగ దారి, వెలికి నరుగ దారియు, నాఁగ
నేఁడు సంపదల రహించుఁ గోట. ౫౬

ఆ. రాజు, మంత్రి, మిత్త్రి రాష్ట్రి కోశంబులు,
బలము, దుర్గ, మనఁగ బరఁగు నేఁడు
నొండొకటి కుపకృతి నొనఁగుచు రాజ్యంపు
టంగసప్తకం బనంగ వెలయు. ౫౭

క. ధనదుర్గబలాధ్యక్షులు,
జనపతికిఁ బురోధ, వెజ్జు, సచివుండును, దై
వనివేదకుండు, దూతయు,
నను నీయెనమండ్రు మంత్రు లాలోచనలన్.' ౫౮

'కోటను సిద్ధముసేయుటకు ఎవరిని నియమింతము?' అని రాజడిగెను. జక్కువ చెప్పెను:—

'క. ఏపని కెవ్వఁడు కుశలుఁడొ
యాపని కాతనినె పెట్టు మవనీనాథా;
ఏపటు శాస్త్రజ్ఞుఁడు నా
యాపని నలవాటులేమి నని యారయుమీ. ౫౯

కావున సారసుని (బెగ్గురుపక్షిని) పిలిపింపవలయును,' అనెను. అట్లుసేయఁగానే, వచ్చినట్టి సారసునింగాంచి రాజు "ఓయి సారసుఁడా, నీవు త్వరగా కోటను సిద్ధపఱుపుము,'

అనెను. సారసుఁడు నమస్కరించి యిట్లనియె ;—

"దేవ, ఇదే యీమహాసరస్సే మనకోట, చిరకాలము నుండి చక్కఁగాచూచి ఏర్పరించుకొన్నట్టిది, ఉండనే ఉన్నది. మఱి దీని నడిమిదీవిలో ధాన్యములసేకరము సేయవలయును, ఏలయన రాజా!

తే. ఎల్లసంగ్రహములను నెచ్చగు ధాన్యంపు
సంగ్రహంబు, రాజచంద్ర, వినుము ;
రత్న ముంప నోటఁ బ్రాణంబుఁ గాచునే?
అన్నగతము ప్రాణ మని యెఱుఁగవె ? ౬౦

మఱియు,—

ఆ. రసములందు నెల్ల రాజేంద్ర యుప్పు మేల్,
దాని సంగ్రహింపు దండిగాఁగ ;
ఏల యనఁగ దాని నేఁని వ్యంజనములు
గోమయత్వ మొంది కూడుఁ జెఱుచు. ౬౧

రాజు, 'త్వరగాపోయి అదంతయుచేయుము' అనెను.

మరల ద్వారపాలకుఁడు వచ్చి, 'స్వామీ, సింహళ ద్వీపమునుండి మేఘవర్ణుఁడను కాకి పరివారసమేతముగా వచ్చి హాజారమం దున్నది.' అని విన్నవించెను. రాజనెను;— 'కాకి ప్రజ్ఞగలదియు, పెక్కింటిని చూచినదియు ; కావున మనకు చేర్చుకోఁదగినది.'

చక్రవాకము ఇట్లనియె; 'కాకి నేలపక్షి, మనము

నీటి పక్షులము; కాన, మనశత్రుపక్షములో చేరినట్టిది ; దానిని మన మెట్లు చేర్చుకొనఁదగును? అట్లే చెప్పిరి:—

ఆ. తనదు స్వజనములను ద్యజియించి యెవ్వఁడు
కూడుకొనుఁ బగతురకూటములను
ఆ మొఱకుఁడు వారిచే మృత్యు వెనయును
నీలివన్నె నక్కవోలె నిజము. ౬౨

కథ ౭.

ఒకానొకయడివిలో నక్కయొకటి యుండెను. అది యథేచ్ఛముగా ఊరిచెంత తిరుగుచు, ఒకనీలి తొట్టిలో పడిపోయి మఱిలేవలేక తెల్లవాఱు నప్పటికి చచ్చినట్లు టక్కుగా పడియుండెను. తర్వాత నీలితొట్టియొడయఁడు వచ్చి అట్లు కాళ్లుపైకి పెట్టుకొని కన్నులు మూఁతపడి పండ్లు వెడల బెట్టుకొనియున్న యానక్కను చచ్చినదను కొని ఎత్తుకొని పోయి దూరమున వైచెను. నక్కపాఱిపోయి అడవి కేఁగి తననీలివన్నెను చూచుకొని యిట్లు తలపోసి కొనెను. 'నేనిప్పుడు నీలవర్ణము గలవాఁడను, ఉత్తమవర్ణుఁ డను ; కావున నా హెచ్చును నే నేల సాధింపఁగూడదు?' ఇట్లాలోచించుకొని నక్కలను పిలిచి ఇట్లు వక్కాణించెను:-'నన్ను భగవతి, వనదేవత అడవిరాజ్యమునకు ఎల్ల యోషధులరసముతోను అభిషేకించినది. నారంగును మీరు చూడుఁడు. కావున నేఁటినుండి యీయడవిలో నాయాజ్ఞప్రకారము వ్యవహరింపవలయును.' నక్కలు

ఉత్తమవర్ణముగల యానక్కను చూచి సాష్టాంగ నమస్కారము గావించి 'ఏలినవారి యాజ్ఞప్రకారము' అని పలికినవి. తర్వాత ఈవరుసను ఆనక్క తనబంధువులు తన్ను చుట్టుఁ గొలుచుచుండ, ఎల్లమృగముల మీఁదను దొరతనమును స్థాపించుకొన్నది. తరువాత, సింహము, పులి లోనగు గొప్పగొప్పపరిజనులు దొరకినంతట, నక్కలను చూచి యవమానపడి తనబంధువుల నన్నిటిని దూరము చేసికొన్నది. అందుకై ఖేదపడుచున్న నక్కలను చూచి ముదినక్క ప్రతిజ్ఞ చేసెను: 'ఖేదపడకుఁడు, నీతియెఱుఁగక ఇది ఇట్లు తనరహస్యము నెఱిఁగిన మనలను అవమానించినది. కావున ఇది యెట్లు పాడయిపోవునో అట్లు నేను చేసెదను. ఎట్లన పులి లోనగు నీజంతువులు దీనిరంగునకు మోసపోయి నక్కయని యెఱుఁగక దీనిని రాజునుగా కొలుచుచున్నవి. దీని తత్త్వమును తెలిసికొనునట్లు చేయుఁడు. అందులకై ఏమి సేయవలయు ననఁగా-సంజవేళ దీనిచెంత బిగ్గరగా ఊళపెట్టుఁడు; ఆయూళను విని జాతి స్వభావముచేత ఇదియు ఊళపెట్టును.' అవియు అట్లేచేసినవి; అదియునట్లే చేసినది. ఏలయన,—

క. నెక్కొనెడునైజగుణముల్
దక్కఁగ దక్షుండుగాఁడు ధరలో నెవఁడున్,
కుక్కకుఁ గిరీట మిడినను
నక్కఱఁ జెప్పును గఱవక యనవిఁకిఁ జమనే. ॥ ౩

౧౫౫

అట్లు జరుగఁగానే దానిని నక్కయని తెలిసికొని పులి చంపెను. చెప్పిరి:—

క. బలమును, గుట్టును, రంధ్రముఁ,
దెలియు నఖిల మేనరుండు, తెగువ నతఁడు లో
పలఁ జొచ్చి సర్వము న్దరి
కొలుపును గార్చిచ్చు శుష్కకుజముం బోలెన్. ౬౭

కావున 'తనదు స్వజనమును త్యజించి' ఇత్యాదికముఁ జెప్పితిని.

'అదినరియో, అయినను, దూరమునుండి వచ్చినాఁడు కావున ఇతనిని రప్పించి చూతము; చేర్చుకొనుటనుగురించి తర్వాత ఆలోచింతము.' జక్కవ ఇట్లనియె ;-'దేవా, చారుని పంపితిమి; దుర్గముకూడ సిద్ధమైనది; కనుక చిలుకను కూడ రప్పించి పంపివేయవచ్చును. ఏలన,—

తే. తీక్ష్ణదూత ప్రయుక్తిచేఁ దీర్చి వైచె
విష్ణుగుప్తుండు నందభూవిభుని, దాని
నారసి చరాంతరితునికి వీరవ్రతుఁడు,
నృపతి పెఱదూత కవసర మీయవలయు.' ౬౮

అంతట రాజు సభ తీరి చిలుకను, కాకిని రప్పించెను. చిలుక ఇంచుక తలయెత్తుకొని ఇచ్చినయాసనంబునఁ గూర్చుండి ఇట్లు వాక్రుచ్చెను.-'ఓయి, హిరణ్యగర్భుఁడా, మహారాజాధిరాజు, శ్రీమంతుఁడు చిత్రవర్ణుఁడు నీకాజ్ఞాపించుచున్నాఁడు.- 'నీకు ప్రాణములవలనఁగాని, సిరివలనఁ

గాని ప్రయోజన మున్న యెడ శీఘ్రముగా వచ్చి మా పాదములకు మ్రొక్కుము. అట్లు సేయవేని ఉనికికై వేఱు తావుం జూచుకొమ్ము,' అని. రాజు కోపమున 'ఇసీ! నా ప్రోల వీనిని మెడపట్టి గెంటువాఁడు ఎవ్వఁడును లేఁడా?' అనెను. అంతట మేఘవర్ణుఁడు లేచి, 'స్వామీ, నాకాజ్ఞ ఇండు. ఈపాడుచిలుకను చంపెదను;' అనెను. ఇంతలో రాజును, కాకిని ఓదార్చుచు జక్కవ ఇట్లనియె;-'ఇదిగో, వినుండు,

తే. సభ యనఁగ నేది ? పండితసమితి గలది.
పండితు లెవరు ? ధర్మంబు పలుకువారు.
ధర్మ మెయ్యది? సత్యానిధారితంబు.
సత్య మెయ్యది ? యేది యచ్ఛలము యదియ. ౬౬

ఏలయన, ధర్మ మిది. మఱియు,—

తే. దూత మ్లేచ్ఛుం డయినను వధ్యుండు గాఁడు
పతికి మఱి ద్విజుమాట చెప్పఁగవలయునె?
శస్త్రములఁ గ్రుమ్మవచ్చిన సరకుగొనక
దూత పల్కును రాజులు దూతముఖులు. ౬౭

అట్లే,—

క. తన కవమతి పెఱ కభినుతి
గనఁబడు దూతోక్తి నృపుఁడు గణియింపం గా,
దనయు మవధ్యుం డగుటన్;
దనతోఁచినయట్లు దూత తలఁకక పలుకున్.' ౬౮

అంతట రాజును కాకియు సమాధానపడిరి. చిలుకయు లేచి తరలినది. తర్వాత చక్రవాకుఁడు తెచ్చి బోధించి బంగారునగలు లోనగునవి ఇచ్చి పంపఁగా చిలుక స్వదేశమునకుం బోయి వింధ్యపర్వతమునకేగి తనదొరకు చిత్రవర్ణునికి మ్రొక్కెను. దానిం గని రాజు చిత్రవర్ణుఁడు 'చిలుకా, ఏమివార్త? ఆదేశము ఎట్టిది?' అనియడిగెను. 'దేవరా, సంగ్రహముగా ఇదేవార్త, ఇప్పుడే పోరికిసన్నాహము సేయింపుఁడు. కర్పూరద్వీపమనెడి యాదేశము స్వర్గఖండము; రాజు రెండవయింద్రుఁడు; అతనినివర్ణింపఁ దరముగాదు.' అంతట పెద్దలనందఱను పిలిపించి చిత్రవర్ణుఁడు మంత్రమునకై కూర్చుండెను. రాజిట్లనియె;—

'ఇప్పుడు చేయవలసియున్న పోరివిషయమై ఎట్లు సిద్ధపడవలయునో చెప్పుఁడు; తప్పకుండ యుద్ధము చేయవలసినది. ఇట్లు పెద్దలు చెప్పినారు;—

క. ప్రొడమిసురుఁ డసంతుష్టిఁ
జెడిపోవును, బార్థివుండు చెడు సంతుష్టిన్,
చెడును వెలయాలు లజ్జఁ,
జెడును గులాంగన యలజ్జచేత నిజముగాన్.' ౬౫

దూరదర్శియనెడిగ్రద్ద ఇట్లనియె:-'దేవా, పోరిమిఁ దియాసక్తిచేతను పోరుచేయుట శాస్త్రీయముగాదు. ఏలయన,—

క. ఎప్పు డనురక్తులు తనయెడ
నపరక్తు లరియెడఁ బ్రగడ లాత్మజులు చెలుల్
సపరిచ్ఛదునికి నృపతికి
నపుడే సుమి విగ్రహింప హాద నంద్రు బుధుల్. ౭౦

మఱియు,—

క. భూరియు మైత్రియుఁ బుడమియుఁ
బోరితమునకుఁ ఫలములు పొలుపుగ మూఁడౌ
భూరమణ, తప్ప కెప్పు డవి
చేరునొ, యదె తఱి యనికని, చెప్పుదు రార్యుల్.'

రాజు చెప్పెను.—'మంత్రీ నాబలమును చూచును గాక; అప్పుడు వీరి యుపయోగమును తెలిసికొనునుగాక; కావున జోస్యుని పిలిచి పయనమునకు మంచిలగ్నమును పెట్టు మనుఁడు.' మంత్రి చెప్పెను.—'దేవా, అట్లయినను తటాలున పయనమగుట మంచిదికాదు. ఏలయన,—

క. పరబల మెఱుఁగక యనికిఁ
జొరఁబాఱుదు రెవరు పాలసులు వారు ద్విష
త్తరవారితీవ్రధారా
పరిష్వ్వజన దీర్ఘనిద్రఁ బడయుదురు వెసన్.' ౭౧

రా జనియె: 'మంత్రీ, నాయుత్సాహమును ఎంత మాత్రమును చెడఁగొట్టకుము. జయింపఁగోరువాఁడు

తనరాష్ట్రమును, పరరాష్ట్రమును ఎట్లు స్వాధీనపఱుచు కొనునో ఆయుపాయమును చెప్పుము.'

గ్రద్దయిట్లనియె; 'రాజా, దానిని చెప్పెదను. కాని, ఆప్రకారము చేసిననే ఫలముగలుగును. అట్లే చెప్పినారు;-

క. ఏటికి మంత్రము, శాస్త్రము,
పాటి ననుష్ఠానమందుఁ బరగింపని-చోఁ ?
సూటిగ నౌషధముల నొక
కోటి యెఱుఁగ నామయమునకుఁ శమమగునే? ౭౩

రాజాజ్ఞను మీఱరాదుగావున నేను విన్నట్లు నివే దించుచున్నాను. దేవా, వినుము,—

సీ. పృథ్వీ(ధ గహాన సరి దుర్గములయందు
భయ మెచ్చ టెచ్చటఁ బరగు, నచట,
నగ్గలంబుగ దండు మొగ్గరంబులు దీర్చి
సేనాని యెలగోలు సేయవలయు;
మునుముగా సేనాని చనవలయుఁ బ్రవీర
పురుషాన్వితుండయి పూర్ణ వృత్తి,
నడిమిప్రదేశంబునను రాజునకుఁ రాణి
వాసముల్, కోశంబు, ఫల్గుధనము,
తే. ప్రక్కలను రెంట హయరథేభములు, బంట్లు,
నొకసమితిప్రక్క నొక్కటి యుండవలయు,
ఖేద మొందినవారికి మోద మిడుచు
వెనుక దుముదారుదొర యంగవింపవలయు. ౭౪

తే. ప్రగ్గడలను సుభటులను బలముఁ గొనుచు
గిరి జల విషమములఁ గరుల్, పరుల హారులు,
సీట నోడలుఁ, బత్తు లన్నిట, సమృద్ధ
సాధనములుగ నరపతి సాగవలయు. ౭౫

తే. క్ష్మాధరములందు దుర్గమార్గము లయందు
నరపతికి హెచ్చుగా రక్ష నెరపవలయుఁ,
గడఁకఁ దనజోదులే తన్నుఁ గాచుచున్న,
యోగనిద్రనె ధరణీశుఁ డొందవలయు. ౭౬

తే. నాశ మొందింపవలయు భూనాథుఁ డరుల,
నన్న పేదలనేని చేయంగవలయు,
పరుల దేశంబులం జొచ్చుపట్టులందు
నాటవికులను ముందుగా ననుపవలయు. ౭౭

తే. రాజిలవలయుఁ గోశంబు రాజుకడనె,
రాజ్య మెక్కడఁ గోశంబు పూజ్యమైన ?
భృత్యులకు దానినుండి తా నీయవలయు,
నిచ్చుదొరకై యెవఁడు పోరఁ డీజగమున ? ౭౮

ఏలయన,—

తే. నరుఁడు దాసుఁడు గాఁడయ్యె, నరున కెందు,
అధిప, దాసుం డగును నరుం డర్థమునకు.
అవనిలో గౌరవమ్ము లాఘవము రెండు
ధనము నిచ్చుట నీయమిఁ దనరుచుండు. ౭౯

క. నరిగాఁ బోరవలయు, నొం
ట్లొరులను గాచికొనవలయు ; నంపవలయు మొ
గ్గరమునడుమఁ జేవయఱిన
పరిని మహీపాలకుండు పరిరక్షణకై. ౮౦

క. మునుదెసఁ దనదండున రా
జునుపం దగుఁ గాల్బలంబు, నుద్దవిడి నరిక్
జనసీ కరి కట్టం దగుఁ
బనివడిఁ దద్దేశ మెల్లఁ బా డిడఁగఁ దగుక్. ౮౧

క. సమమున రథహయతతిఁ, దో
యమునక్ నాగజనమితుల, నవనీరుహాకుం
జమయమున విండ్లు, వెలి ఖ
డ్గములక్ డాల్కైదువులను గదనమ్ము తగుక్. ౮౨

ఆ. విసము గలిపి రిపుని కసవు నన్నము వంట
చెఱకుఁ ద్రాగునీరుఁ జెఱుపవలయు,
చెఱువు లగడిదలును ఛేదింపవలయును
కోటలను బయలుగఁ గూల్పవలయు. ౮౩

ఆ. బలములందు ముఖ్యబల మగు నేనుంగు,
అట్టి దన్యముండ దవనిపతికి.
స్వాంగముల వలననె యష్టాయుధంబని
దాని నభినుతింత్రు తజ్జ్ఞవరులు. ౮౪

క. తురగబలము సైన్యములకు
గురుబల ; మది కూడ నడచుకోట యగుఁ గదా.

తురగబలాధికుఁ డగుపతి
సరిసేలం గలనియందు జయముం బొందున్. ౧౯

క. వారువముల నెక్కి యనిం
బోరెడిరాహుతుల గెల్వఁ బోలరు సురలున్,
దూరపు రిపులును క్షణమున
వారికిఁ గరగతు లగుదు రవారితమహిమన్. ౨౦

క. కదనము నారంభించుట,
పదవులనున్ దెసలఁ జక్కఁబఱచుట, దండున్
బదిలముగఁ గాచుటయున్,
బదాతివర్గంపుఁబనులు, పార్థివసింహా! ౨౧

క. జని శూరంబు, జితశ్రమ,
మనురక్తం, బస్త్రవేది, ఖ్యాతభుజా భూ
జనభూయిష్ఠంబగు బల
మును నరనాథునికి శ్రేయముగ, నెంచు నృపా! ౨౨

క. రాజేంద్రుం డొనరించెడి
పూజకు నేయోజ రిపులఁ బోరుదురో యా
యోజన్ బహుధన మిచ్చిన,
రాజా, పోరికి నలుపరు రహిమై జోదుల్. ౨౩

క. సారవంతమైన సైన్య మల్పమె చాలు,
వట్టి తలల బారు వలవ దెందు,

సారహీనమయిన సంఖ్యలు విఱుగుచు
సారయుతముఁ గూడఁ జియ్యి విఱుచు. ౯౦

తే. అప్రసాదం, బధిష్ఠాన విప్రయుక్తి,
అప్రతీకారమును, గాలయాపనంబు,
దేయభాగాపహరణంబు నీయయిదును
రాణువకు జేనిపైని విరక్తిఁ గొలుపు. ౯౧

క. పీడించుచు రిపుబలముల,
వాడింపఁగ వలయు జయము వలచు విభుం, డా
పీడకుఁ జిర మగ్గంబై
యోడును సులభముగ వైరియొడయుని బలముల్.

సీ. దాయాదుకన్న మంత్రము లేదు విద్వేషి
పాళెంబుఁ జీల్ప భూపాలతిలక,
కావున, వైరిపై గడఁకమై నాతని
దాయాదునిఁ లేప శ్రేయమగును,
తద్యువరాజుతో, దన్ముఖ్యమంత్రితో
సంధాన మొనరించి చదురు మీఱ
అతని పాళెంబున నంతః కలహముల
విజిగీషుఁ డర్థిఁ గల్పింపవలయు,

తే. ద్వేష్యుఁడగు మిత్రుఁ బరులచేఁ దీర్పవలయు,
ఎదిరి ప్రజకుఁ దనభువిఁ జోటీయవలయు,
దానమానాదికములచేఁ దనుప వారి,
వారె తన కెల్లధనముల వలచి యిత్తు9.' ౯3

రాజు చిత్రవర్ణుఁ డిట్లనియె ;-'ఇసీ! ఎందులకు పెక్కు-మాటలు!

క. అరికెగ్గు, తనకు లగ్గును,
నిరువెఱుఁగుల నీతియెల్ల నెసఁగు నటంచున్,
ఉరరీకరించి విజ్ఞులు
గురుమతముఁ బ్రమాణముగను గొందురు ప్రీతిన్.'

మంత్రి నవ్వి యిట్లనియె:-'ఇదంతయు నాయావిశేషములను చెప్పాటు ; కాని ;—

ఆ. అడ్డులేక పేర్చునట్టి సత్త్వము వేఱు,
శాస్త్రయంత్రితంబు శక్తివేఱు,
ఒక్క తావునందె యుండ వీరెండును,
ఎండ మొల్లమియును నిర్జుఁబోలె.' ౯౫

అంతట రాజు సభ చాలించెను. తర్వాత జోస్యులు పెట్టిన లగ్నమున తరలెను.

అంతట మున్ను పంపిన వేగు హిరణ్యగర్భునికడకు వచ్చి ప్రణమిల్లి ఇట్లనియె ; 'దేవరా, ఇదిగో వచ్చినాఁడు రాజు చిత్రవర్ణుఁడు ; ఇప్పుడు మలయాద్రినెత్తమున పాళెము డిగియున్నాఁడు. అనుక్షణము మన దుర్గమును సోదన చూచుకొనవలయును ; ఏలయన, ఆగద్ద గొప్పమంత్రి ; ఇదిగాక ఎవరితోనో అతఁడు నమ్మకముగా మాటలాడుటలో ఈ సూచన తెలిసినది ;—'ఏమనఁగా, అతఁడు ఎవ

నినో మనకోటలో ప్రవేశపెట్టియున్నాఁడని;' అనెను. రాజనియె, 'ఎంతమాత్రమును కాఁడు. అగునేని వల అప్పుడు ఆవిధముగా చిలుకను గొట్టుటకు లేచును? అదిగాక చిలుక వచ్చినందువలననే వానికి పోరాటమందు ఉత్సాహము; వాఁడు చిరకాలమునుండి ఇచ్చట నున్నాఁడు.' మంత్రి చెప్పుట ;-'అయినను క్రొత్తగా వచ్చినవానిని నమ్మరాదు.' రాజనియె ;-'ఒక్కొక్కచోట ఆగంతుకులు మేలుసేయుట కలదు. విను.—

ఆ. పరుఁడు హితమొనర్చి బాంధవుఁడే యగు,
నహితకారి బంధుఁడైనఁ బరుఁడె ;
అడవిఁ బుట్టినట్టి యౌషధంబు హితంబె,
యంగజంబు వ్యాధి యహితమొయగు. ౯౬

మఱియొకటి;—

ఆ. శూద్రకుండు నాఁగ సొబగొందె నొకరాజు,
వానికుండె వీరవరుఁడు భటుడు,
క్రొత్తవాఁ డతండు కొలఁది కాలముననే,
బలియొనంగె సుతుని భర్తకొఱకు.' ౯౭

'అది యెట్లని జక్కవ యడుగ, రాజు చెప్పుచున్నాఁడు,-

కథ ౮.

'పూర్వము నేనొకప్పుడు శుభ్రిక రాజుయొక్క యాట కొలనియందు కర్పూరకేళియను రాజహంసుని కూఁతురు

కర్పూరమంజరియందు మరలుకొంటిని. అట వీరవరుఁడను క్షత్రియ కుమారుఁడు ఏదేశమునుండియో వచ్చి తేని హజారమునందు ద్వారారికుని దగ్గఱ 'నేను జీవికనిమిత్తము వచ్చితిని. క్షత్రియకుమారుఁడను. నాకు రాజుదర్శనము సేయింపుము.' అని యడిగెను. అంతట ద్వారాదికుఁడు రాజదర్శనము సేయింపఁగా ఆతఁడు రాజుతో 'దేవా, నాకొలువువలన తమకు ఉపయోగ ముండునేని నాకు జీతము ఏర్పరింపుఁడు' అని యడిగెను. శుభ్రకుఁడు 'నీ కేమిజీతము కావలయును' అని యడిగెను. 'ఆయాదిన మునకు నన్నూఱువరహాలు వలయును' అని వీరవరుఁడు చెప్పెను. 'నీసామగ్రి యేమి ?' అని రాజడిగెను. 'రెండు బాహువులు, మూడవది కత్తి' అని వీరవరుఁడు పలికెను. 'ఇది సాధ్యపడదు'అని రాజనెను. ఆమాట విని వీరవరుఁడు నమస్కరించి వెడలిపోయెను. 'దేవా, నాలుగు దినములు జీతమిచ్చి దీనితత్త్వమును ఎఱుంగుఁడు. ఈతఁడు ఈ పాటిజీతమును పుచ్చుకొనుటవలన ఉపయోగము ఉండునో ఉండదో' అని మంత్రులు పలికిరి.

రాజు మంత్రులమాటమీఁద రప్పించి వీరవరునికి తాంబూల మిచ్చి జీత మొసంగెను ;—

ఉ. కారము, చేదు, నుప్పు, గటు
కంబును, దీఁపుఁ, గషాయకంబుఁ జె

స్నారఁ గఘానిలక్రిమి మ
లాపహారంబు, సుగంధకారియున్
నోరికి భూష, దీప్తిత మ
నోజశరాగ్నియు; నాకదుర్లభ
స్ఫారగుణ త్రయోదశక
సారము, తమ్ములమింపుగొల్పెడున్. ౯౬

ఆజీతము నాతఁడు విని యోగించువిధమును రాజు రహస్యముగా కనిపట్టెను. అందు సగము వీరవరుఁడు దేవతలకును, బ్రాహ్మణులకును ఇచ్చెను. కడమ మూఁడవపాలు పేదల కిచ్చెను. మిగత భోజనమునకును, విలాసమునకును వ్యయము చేసెను. ఇదంతయు నిత్యకృత్యము చేసి రాజద్వారమందు రేయింబవలు కాపుండును. రాజు ఎప్పుడు పొమ్మని సెలవొసంగునో అప్పుడు తనబసకు పోవును.

తర్వాత కృష్ణచతుర్దశినాఁడు రాత్రి రాజునకు దుఃఖముతోడి రోదనధ్వని వినఁబడెను. 'ద్వారమందు ఎవరున్నారు?' అని రాజు పలికెను. అంతట 'దేవా, నేనున్నాను' అని వీరవరుఁడు పలికెను. 'ఆ ఏడ్పువెంబడి పొమ్ము' అని రాజు చెప్పెను. 'చిత్తము, ఏలినవారియాజ్ఞ' యని పలికి వీరవరుఁడు పోయెను. రాజు తలపోసెను.—'సూదితో పొడువఁదగిన యీచీఁకటిలో ఇతనిని ఒంటిగానిని పంపినాఁడను. అది ఒప్పిదము గాదు.' నేనును పోయి

పరికించెదను.' అంతట రాజుకూడ కత్తిం గైకొని వాని వెంట నడిచి ఊరిబయటికి పోయెను. అచ్చట వీరవరుఁడు రూపయౌవన సంపన్నురాలును, సర్వాలంకారభూషితు రాలును, అయిన స్త్రీ నొకతెను చూచి 'నీవెవతవు? ఏల యేడ్చెదవు?' అని యడిగెను, 'నేను ఈశుభ్రిక రాజు యొక్క లక్ష్మిని; చిరకాలము ఇతనిభుజము నీడను సుఖ ముంటిని. ఇప్పుడు ఇతనిం బాసిపోవ నున్నానని దుఃఖ పడుచున్నాను.' అని యామె చెప్పెను. 'అపాయ మున్న చోట ఉపాయమును ఉండును. కావున దేవీ, మఱల నీవు ఇతనిని అవలంబించు నుపాయ మేమి?' అని వీరవరుఁడు అడిగెను. లక్ష్మి 'నీవు ముప్పదిరెండులక్షణములు గల వానిని నీకుమారుని శక్తివరుని సర్వమంగళాదేవికి బలి వేయుదువేని నేను వెండియు నిట చిరకాలము వసించె దను.' ఇట్లు చెప్పి దేవి అంతర్ధాన మొందెను.

తర్వాత వీరవరుఁడు తనయింటి కేఁగి నిద్రించుచున్న తన భార్యాపుత్త్రులను మేల్కొలిపెను. వారును మే ల్కొని లేచి కూర్చుండిరి. వీరవరుఁడు లక్ష్మి పలికినదం దంతయు వారికి చెప్పెను. దానినివిని శక్తివరుఁడు ఆనంద పడి యిట్లనియె;—'స్వామిరాజ్యమును రక్షించుటకు ఉపయోగపడునట్టి యీనేను కృతార్థుఁడను. మఱి తడ వేల? ఇట్టికార్యమునందు దేహమును వినియోగించుట శ్లాఘ్యముగదా. ఏలయన;—

క. ప్రాణములను ధనములనుఁ
బూని పరోపకృతి గాఁగ బుధుఁడు త్యజించుచుఁ,
వానికిఁ దత్కారణమున
దానము మేల్, నాశమేమొ తప్పనికతనన్. ౯౯

శక్తివరుని తల్లి యిట్లనియె:—'మన కులమునకుఁ దగినదైన ఈపనిని చేయరాదేని మఱి యేపనిచేత ఈ గొప్పజీతముయొక్క ఋణము తీరును?'. ఇ ట్లాలోచించి అందరును సర్వమంగళాదేవి దేవళంబునకుం బోయిరి. అచ్చట సర్వమంగళను పూజించి వీరవరుఁడు 'దేవీ, అను గ్రహింపుము. శుభ్రకమహారాజు వర్ధిల్లుఁగాక ; ఇదె ఈ యుపహారమును స్వీకరింపుము' అని వేఁడుకొని కుమారునితలను ఖండించెను. తర్వాతి వీరవరుఁ డిట్లుతల పోసెను.—'రాజువలనఁగైకొన్న జీతమునకు ఋణము తీర్చుకొంటిని. ఇఁకను పుత్త్రహీనుఁడను బ్రదుకు నటిం చుట కూడదు.' ఇ ట్లాలోచించుకొని తనతలను నఱుకు కొనెను. అంతట పతియు సుతుఁడును పోయిన దుఃఖము చేత నొగిలి అతనిభార్య తనమెడం గోసికొనెను.

ఇదంతయు కని విని రాజు చింతించెను ;

*మావంటి క్షుద్రజంతువు
లేవలనం బుట్టరెంద, ఱెట నీల్గ రహో!
యీవీరువలె నితరులన్
గావఁగ నుసుఱిచ్చువారు గలుగుదురె ధరన్. ౧౦౦

ఇతఁడు లేక రాజ్యము నాకేల ?' అంతట తనతలం దఱుఁగుకొనుటకు శుభ్రకరాజు కత్తియెత్తెను. అంతట సర్వమంగళాభగవతి ప్రత్యక్షమై రాజుచేతిని పట్టి ఆఁపి, 'పుత్త్రుఁడా, నీకు ప్రసన్నురాల నయితిని. సాహసము మానుము. ప్రాణాంతమందును నీకు రాజ్యభంగ ముం డదు' అని చెప్పెను. రాజు సాష్టాంగముపడి మ్రొక్కి— 'దేవీ, నాకురాజ్యముతో పనిలేదు. నాయందు కనికర ముం దాల్తువేని నామిగతయాయుస్సును ఇచ్చియేనియు ఈ రాజకుమారుని దారపుత్త్రసమేతముగా బ్రదికింపుము. అట్లు చేయవేని నాకు సంభవించుగతిని నేను పోయెదను' అని వేఁడెను. దేవి పలికెను:—'ఈనీసత్త్వమహిమను, సేవకవాత్సల్యమును నేను మెచ్చుకొంటిని; పో, విజయ మొందుము. పరివారసమేతముగా ఈరాజపుత్త్రుఁడు బ్రదు కునుగాక.' ఇట్లు వచించి దేవి అంతర్ధాన మొందెను. రాజు ఆమెకు మ్రొక్కి వారికి కనఁబడకుండఁ జని, వెం టనే మేడమీఁది కేఁగి నిద్రపోయెను. వీరవరుఁడు సతీ సమేతముగా బ్రదికి తనయింటి కేఁగెను. తర్వాత వెండి యు పోయి రాజద్వారమునం దుండెను. రాజు అడుగఁగా 'స్వామీ, ఆ ఏడ్చుచున్నస్త్రీ నన్నుఁగని అదృశ్యురా లాయెను. మఱేమియు వృత్తాంతము లేదు' అనెను. ఆమాట విని రాజు తలంచెను : 'ఇతఁడు ఎంత పొగడఁ దగినవాఁడు; ఎంత మహాసత్త్వుఁడు ! ఏలయన;—

ఆ. ప్రియములను వచింపు కృపణతఁ బూనక,
పొగడుకొనకు మెపుడుఁ బోటు సూపి;
ఇచ్చునపుడు పాత్రవృష్టి గావింపుము,
ప్రతిభ కలిమి నిష్ఠురత నెనయకు. ౧౦౧

ఈ మహాపురుషలక్షణము సమస్తము ఇతనియం దున్నది.' పిమ్మట రాజు ప్రాతఃకాలమున పెద్దలను రావించి ఓలగంబు గావించి ఆ సకలవార్తయు ప్రస్తావించి కరుణ పెంపున వీరవరునికి కర్ణాటరాజ్యము నొసంగెను.

కావున, క్రొత్తగావచ్చినవాఁడు జాతిమాత్రముననే దుష్టుఁడా? అందును ఉత్తములు, అధములు, మధ్యములుం గలరు.'—

చక్రవాకుఁడు ఇట్లనియె :—

'ఆ. కార్యమనుచుఁ దప్పు కార్యంబు సాగించు
దుష్టమంత్రి పతికిఁ దుష్టిగాఁగ
నట్లు చేతకన్న నధిపుమనంబును
వెత గొలుపుటమేలు హితము సెప్పి. ౧౦౨

తే. ఏనృపుని కాడుచుండుదు రిచ్చకముల
వైద్యుఁ, డొజ్జయు, మంత్రి, యప్పటికి మెచ్చ,
నానృపుఁడు కోలు పోవు రయంబుమీఱ
నిక్కముగ మేని, ధర్మంబు, బొక్కసమును. ౧౦౩

దేవా, చిత్తగింపుము :—

క. పరులకుఁ బుణ్యవశంబున
దొరకినయది తనకుఁగూడ దొరకు నటంచున్,
బరిమార్చి నిధికి భిక్షుని
నరపతిచే దండమొందె నాపితుఁ డీల్గెన్.' ౧౦౫

'ఆకథం జెప్పు'మని రా జడిగెను. మంత్రి చెప్పు చున్నాఁడు:—

కథ ౯.

'అయోధ్యలో చూడామణియను క్షత్రియుఁ డుండెను. అతఁడు ధనము కోరి అత్యంత క్లేశము నోర్చి కొంత నెలసిగమానికప్పుసామిని ఉపాసించినాఁడు. ఆదేవుని యాజ్ఞ చేత కుబేరుఁడు ఆక్షత్రియునికి కలలో అగపడి ఇట్లాన తిచ్చెను:—'ఈరాత్రి తెల్లవాఱఁగానే నీవు క్షౌరము చేయించుకొని దుడ్డుఁగఱ్ఱ చేతఁ బూని నీయింట దాఁగి యుండుము. అంతట ముంగిటిలో సన్న్యాసి రాఁ గాంచిన వెంటనే వానిని కనికరము లేక దుడ్డుతోఁ గొట్టి చంపుము. అంతట ఆసన్న్యాసి తత్క్షణమే వరాలతో నిండినగిండి యగును. దానిని పెట్టుకొని నీవు స్వేచ్ఛగా సుఖ ముండుము.' సర్వమును అట్లే జఱిగెను. క్షౌరము చేయుటకై వచ్చినట్టిమంగలి దానినెల్లఁ గాంచి ఆలోచించెను: 'అహో! నిధి దొరుకుటకు ఇది యుపాయము! నేను కూడ ఇట్లేల చేయరాదు?' అప్పటినుండి ఆమంగలి అట్లే దుడ్డుఁగఱ్ఱను చేతనుంచుకొని ప్రతిదినమును

సన్న్యాసి ఎవఁడేని వచ్చునా యని ఎదురు చూచుచుం డెను. ఒకనాఁడు ఒకభిక్షుకుఁడు రాఁగా వానిని దుడ్డుఁగఱ్ఱ తో మోఁది చంపెను. ఆనేరమికి మంగలిని రాజపురు షులు కొట్టి చంపిరి. కావున 'పరులకుఁ బుణ్యవశంబున దొరికినయది' ఇత్యాదికము చెప్పితిని.'

రాజు వచించెను:—

'క. కారణము లేని మిత్త్రుఁడో?
కారియ పెట్టుటకు నమ్మకము గొల్పెడునో?
ఏరీతిఁ బరు నెఱుఁగనగు
వారక తొల్లింటికతలె వర్ణన సేఁతకా. ౧౦౫

పోనీ, ఇప్పుడు చేయవలసినదానిని ఆలోచింతము. చిత్రవర్ణుఁడు మలయముకడ నున్నచో మనము ఏమిచేయ వలయును ?' మంత్రి చెప్పుచున్నాఁడు:—'దేవా, వచ్చిన వేగువలన నేను వింటిని. చిత్రవర్ణుఁడు తనమహామంత్రి యగు గద్దమాటను సరకుసేయలేదని అందువలన ఆ మూఢుని జయింపవచ్చును. ఏలయన,—

క. పిసినియుఁ గూళయు నవశుఁడు
నసత్యుఁడును బంద మూర్ఖుఁ డస్థిరుఁడుఁ బ్రమా
ది సుయోధ తిరస్కారియుఁ
బిసాళియగు పతి సులువుగ భేద్యుఁ డగుఁజుమీ. ౧౦౬

కావున ఇతఁడు మనదుర్గమును ముట్టడింపకముందే ఏటిదారులలో, కొండదారులలో, అడవిదారులలోను ఇతని

దండును రూపుమాపుటకు సారసాదిసేనాపతులను పం
పుము. అట్లును చెప్పియున్నారు.—

సీ. దూరమార్గశ్రమ దుఃస్థంబు, వననదీ
గిరిదుర్గసంకట ఖేదితంబు,
ప్రాణహారక ఘోర పావకక్లిష్టంబు,
క్షుత్పిపాసాక్షోభ శోషితంబు,
అనవధాన హతంబు, నదనసంసక్తంబు,
వ్యాధివృష్టి విఘాత బాధితంబు,
అవ్యూఢ, మల్పంబు, ననిలవర్షార్తంబు,
పంకపాంసుక్లేద భంజితంబు,

తే. చెదరినది, దారిదప్పినయదియు, రిపుల
ముట్టడిభయాన నిద్దురపోకనడచి
డీలుపడి పవల్ నిదురపట్టిన యదియును,
నైన పరసైన్యము జిగీషుఁ డడఁపవలయు. ౧౦౭

కావున ఏమఱుపాటుననున్న యాశత్రుని బలమును మన సేనాపతులు పోయి సందు దొఱకినపుడెల్ల రేయుం బవలు చంపవలయును.' అట్లే జఱుగఁగా చిత్రవర్ణుని సిపాయీలును, పడవాళ్లును పెక్కండ్రు కూలిరి. అంతట చిత్రవర్ణుఁడు దిగులుపడి తనమంత్రి దూరదర్శితో నిట్లనియె:-

'బాబూ, ఏల నన్ను ఒప్పరికించుచున్నావు? నే నెంద యిన చెడునడవడి నడచుకొంటినా? అట్లును చెప్పిరి.

క. దొరకెఁగదా రాజ్యం బని
దొరకొనఁగా రాదు చెడుగుత్రోవలనడువన్,
సిరి నవినయము హరించును,
జర లోకాతీతరూప సంపదఁ బోలెన్. ౧౦౮

ఆ. దక్షుఁ జొందు సిరిని, దార్ఢ్యంబుఁ బథ్యాశి,
రోగహీనుఁ డెనరుండు సుఖము,
నుద్యమాన్వితుం.ను విద్యాబ్ధిపారంబు,
వినయయుతుఁడు ధర్మధనయశముల.' ౧౦౯

గ్రద్దయనియెః—'దేవరా, వినుముః—

ఆ. విపులనేలువాఁ డవిద్యుఁడ యయ్యును,
జ్ఞానవృద్ధసేవ సలిపి సతము,
భవ్యమయిన సిరిని బ్రాపించు ననయంబు,
నీటివెంబడి యువనిజము పోలె. ౧౧౦

మఱియు,—

క. రాజులకు దూషణములగు
నోజ స్త్రీయోషు-పాన, మువిద, మృగయయున్,
జూజము, వాక్పరుషత, యు
ద్వేజకదండంబు, నర్థవిధ్వంసనముల్. ౧౧౧

ఆ. సాహసైకరస వశంవదంబులు గావు,
కా వుపాయ మాత్రగమ్యములును,
భవ్యతరము లౌవిభవములు తేనికి
నీతిశౌర్యవశత నిలుచుఁగాని. ౧౧౨

నీవు నీదండుయొక్క యుత్సాహమును చూచి సాహసమందే ప్రీతివహించి నేను చెప్పిన యాలోచనలను ఆకళింపుసేయమియకాక పరుసములనుకూడ పలికితివి. ఆదుర్వినయమునకు ఈఫలమును అనుభవించుచున్నావు. అట్లుచెప్పియున్నారు:

తే. ప్రగడ చెడుగైన, నృపునీతిఁ బ్రబలుదొసఁగు;
ఓగిర మపథ్యమైనచో రోగ మొదవు;
సిరి గరువమిడు; మిత్తికి దొరకఁడెవఁడు?
స్త్రీలతంత్రంబు లెవనిఁ గారింపకుండు? ౧౧౩

తే. మదమును విషాదమణఁచు, నాపదను నీతి,
తమమునర్కరవి, మైత్రిఁ గృతఘ్నతయును,
దుఃఖమును శుద్ధమతి, శరత్తును హిమాప్తి
పూర్ణలక్ష్మిని సయితము దుర్ణయంబు. ౧౧౪

అంతట నేను అనుకొంటిని-'ఈరాజు తెలివిలేని వాఁడు; కాడేని నానీతిశాస్త్రోపన్యాసమను వెన్నెలను మాట లనెడి యాఁటిన కొఁఅవులతో చీఁకటిసేయునా? ఏలయనగా,—

ఆ. స్వీయ మెవనికిఁ బ్రజ్ఞ సర్వమంగళమగు
వానికేమి విద్యవలన ఫలము?
కనులు రెండులేని మనుజుని కద్దంబు
వలన నేమిఫలము వసుమతీశ! ౧౧౫

అందువలన నేనును ఊరకుంటిని.'

అంతట రాజు కేలుమోడ్చి 'బాబూ అవును; నా వలన తప్పిదమే. ఇప్పుడు మిగిలియున్న దండుతోనయిన వింధ్యాద్రికి పోవుటకు ఉపాయము చెప్పుము.' అని యడిగెను. గద్ద తనమనస్సులో ఇట్లాలోచించెను:- 'ఇందులకు ప్రతిక్రియ సేయుట సరియైనపని. ఏలయన,—

తే. దేవతలయందు, గురులందు, గోవులందు,
బ్రాహ్మణులయందు, ధారుణీపతులయందు
బాలవృద్ధాతురులయందుఁ బ్రాజ్ఞుఁ డెపుడు
కోపమును మాని యోపికఁ గొనఁగవలయు.' ౧౧౬

మంత్రి నవ్వి వెల్లడిగా నిట్లనియె:— 'దేవా, భయపడకు. ఊరడిల్లు, వినుః

తే. భిన్నసంధాన కర్మలోఁ బ్రెగ్గడలకు,
సాన్నిపాతిక కృతిలో భిషగ్వరులకుఁ,
బ్రజ్ఞ యేమాత్ర మున్నను బయలుపడును,
ఎవఁడు సుస్థంబునందు నేరువఁడు నడుప? ౧౧౭

మఱియు,—

క. ఇంచుకయె తొడఁగి, దానినె
యెంచుచు వ్యాకులితులగుదు రెంతయు నజ్ఞుల్;
ఇంచుకగఁ దొడఁగి ఘనకృతి,
నెంచక కృతబుద్ధు లుందు రెంతయు శాంతిన్. ౧౧౮

కావున ఇట నీప్రతాపముచేతనే దుర్గమును పడఁగొట్టి కీర్తిప్రతాపములతో కూడినవానినిఁగా నిన్ను త్వరగా వింధ్యాద్రి చేర్చెదను.' 'ఇప్పుడు ఈకొంచెపాటి దండుతో అది ఎట్లు సమకూడును?' అని రా జడిగెను. గద్ద చెప్పుచున్నది:- 'దేవా, సర్వమును సమకూడును. ఏలయన,-విజయమొందఁ గోరినవానికి అవిలంబముగా పనిజఱుపుట విజయమొందుటకు తప్పనిసూచన. కావున నిపుడు దుర్గద్వారమును ముట్టడింపుఁడు.'

పంపిన వేగుకొంగ వచ్చి హిరణ్యగర్భునికి ఆవృత్తాంతము చెప్పినది. 'దేవా, దండుకొంచెమే కలిగియు ఈరాజు చిత్రవర్ణుఁడు గద్ద చెప్పిన యాలోచన నవలంబించి మన దుర్గమును ముట్టడించుటకు వచ్చుచున్నాఁడు. అంతట రాజహంసుఁడు జక్కవను 'సర్వజ్ఞుఁడా, ఇపు డేమి సేయవలసినది?' అని యడిగెను. జక్కవ చెప్పుచున్నది:- 'మనదండులో చేవయు, పొల్లును విచారించి బంగారము వస్త్రములు లోనగునవి యిచ్చి వారివారికి తగినసత్కారము సేయవలసినది. ఏలయనఁగా,—

ఆ. తప్పదారిఁ బోవుదమ్మిడీనైనను
వేవరాలఁ బోలె వెదకి యెత్తు,
తమక కొసఁగు గోట్లు తటి నెవ్వఁ డాతని
రాజసింహు విడదు రాజ్యలక్ష్మి. ౧౧౯

మఱియు,—

ఆ. జన్మ, ముద్వాహనము, శత్రుక్షయము, యశ
స్యమును, మిత్రసంగ్రహము, వ్యసనము,
ప్రాణదయిత, లధనబాంధవు లనెడి యీ
యెనిమిదింట లేదు హెచ్చువ్యయము. ౧౨౦

ఏలయన,—

క. అలఁతివ్యయమునకు వెఱచి స
కలముం గోల్పోవు టొక్కగడుసుందనమే?
చులకని సుంకపువెఱ సర
కులనెల్లన్ విడుచువర్తకుఁడు ధరఁ గలఁడే?' ౧౨౧

రాజడిగెను:-'ఇప్పు డతివ్యయము సేయుట ఎట్లు తగును? ఆపన్నివారణకై ధనమును దాఁపవలసినదని గదా పెద్దలు చెప్పినారు?' మంత్రి యనెను.-'శ్రీమంతులకు ఆపద లేలకలుగును? రాజు-'ఎప్పుడైన సిరి యలిగెనేని?' మంత్రి మఱల ననియె: 'కూడఁబెట్టిన ధనముపోవును. కావున, దేవా, లోభముమాని సీజోదులను ఈవిచేతను, గౌరవముచేతను ముందఱికి తెమ్ము. అట్లు చెప్పినారు:—

క. బంధొరుల నెఱిఁగి, తుష్టిన్
నిండి, యసువులను విడువ సునిశ్చితమతులై,
యుండు కులజు లర్హితులై
చెండుదు రరిబలము నిరవశేషముగాఁగన్. ౧౨౨

మఱియు,—

క. మానిత శీలురు, సుభటులు,
ప్రాణాంతము పోర నిశ్చయముగల శూరుల్,
ఏనూర్వురు సంహాతు, లరి
సైనికసాహస్రములను జదుపుదు రాజా! ౧౨౩

మఱియు,—

తే. తారతమ్యానభిజ్ఞుఁ, గృతఘ్ను, నుగ్రుఁ
బొట్టనిండించుకొను పెనుప్రాన్కి వాని,
శిష్టులైనను విడుతు ర శేషముగను
అన్యులు త్యజింతురని వేఱ యనఁగనేల? ౧౨౪

ఎలయన,—

తే. సత్యమును, ద్యాగమును, దయ, శౌర్యమనఁగ,
నవని విభునికి నాల్గు మహాగుణములు;
ఈగుణంబులు లేని మహీశుఁ డెందు
బుధవరులచేత నిందలఁ బొందు ననఘ. ౧౨౫

ఇట్టి సందర్భములలో మంత్రులను గౌరవింప వల
యును.

తే. అధిపుతోడుత నుదయి, యత్యయియుఁగాఁగఁ
దన్ను నేసచిపుఁడు కట్టుకొన్న వాఁడో,
వాని విశ్వస్తుఁ దన ధనప్రాణములకు
రక్షకునిఁ జేయ శ్రేయంబు లక్షయములు. ౧౨౬

ఎలయన,—

ఆ. ఇంతి యేని, బాలుఁడేని, వంచకుఁడేని,
ప్రగడలగుదురో యెవనికి నతఁడు
అనయపవననిహతుఁడై కార్యజలధిలో
మునిఁగి శరణు లేక ముప్పు వొందు. ౧౨౭

వినుము దేవా,—

ఆ. కినుక, సంతసము నెవనికి సమంబులో,
శాస్త్రమం దెవనికి శ్రద్ధగలదొ,
అనుదినంబు భృత్యుల నెవండు ప్రోచునో
ధనము పిదుకు సతము ధర యతనికి. ౧౨౮

క. ఎవరికి, వృద్ధియు క్షయమును,
నవనీపతి తోడివయగు నట్టిమహితులన్
అవమానింపంగాఁ దగ
దవనీపతి తనయమాత్యులన్ గర్వమునన్. ౧౨౯

ఎందుల కనఁగా,—

ఆ. ఘనమదంబుచేతఁ గన్నులు గానక
సంస్ఖలనము నొందు జనవిభునికి
సంకరంపు సామజంబునకును లేప
సచివకరి కరప్రసార మూఁత. ౧౩౦

అంతట మేఘవర్ణుఁడు వచ్చి నమస్కరించి ఇట్లనియె "దేవరా, నావైపు చూడ్కి ననుగ్రహింపుము. వీఁడుగో శత్రువు యుద్ధము కోరినవాఁడై కోటహజారములో

నున్నాఁడు. కావున ఏలినవారి యాజ్ఞచే వెలువడి నా పరాక్రమమును చూపెదను. అందువలన ఏలినవారి ఋణమును తీర్చుకొనియెదను.' చక్రవాకుఁడు ఇట్లనియె;— 'అట్లు వలదు; వెలువడి యుద్ధము చేయఁదగునెడల కోటను అండగొనియుండుట నిష్ప్రయోజనము. మఱియు:—

తే. నీరనున్న మొసలి కడుదారుణంబు,
బయటఁబడి యవశంబయి భంగ మొందు,
అటవి వెలువడి తిరుగు పంచాననంబు
మసనపు సృగాలమునకు సమానమగును.' ౧౬౧

కాకి చెప్పుచున్నది: 'రాజా, పోయి పోరిని నడిపింపుము. ఏలయన,—

తే. బలము ముందుంచుకొని మహీపాలవరుఁడు
పోరు సేయింపవలయుఁ దాఁ గోరి కనుచు,
సామి యండయుడిన యెడ శ్వానమయినఁ
గేసరియుఁబోలెఁ బోర దేమీసరముగ.' ౧౬౨

అంతట వారందఱును కోటదర్వాజాకడకుఁ బోయి ఘోరయుద్ధముం గావించిరి.

ఆమఱునాఁడు చిత్రవర్ణరాజు గద్దతో ననియె:- 'బాబూ, నీప్రతిజ్ఞను ఇప్పుడు నెఱవేర్పుము.' గద్ద యనియె:- 'దేవా, విను,

క. కాలాసహా, మల్పంబును,
బాలిశసవ్యసనపతి, యపరిరక్షితముల్
భీలుకయోధకమును, నని
యోలిన్ దుర్గవ్యసనము లొప్పెడి నాలుల్. ౧౩౩

అవి యిపు డిట లేవు.—

క. లోలో భేద మిడుట, చిర
కాలము ముట్టడియుఁ, దటి తగన్ బయికోలుల్,
వాలుమగంటిమియును, నరి
పాళెముఁ గైకొనఁగ నా ల్గుపాయమ్ములగున్. ౧౩౪

ఇందు శక్తికొలఁది యత్నము సేసెదము.' (చెవిలో చెప్పుచున్నాఁడు) 'ఇట్లు ఇట్లు.' తర్వాత ప్రొద్దుపొడువక మునుపే నాల్గుద్వారములయందును పోరాటము మీరుచుండఁగా, కోటలోపల ప్రతియింటికిని కాకి నిప్పుపెట్టినది. అంతట 'పట్టుపడినది, దుర్గము పట్టుపడినది' అని గొల్లు వినియు, ఇండ్లయందు పెక్కింట నిప్పులెగయుచుండుటం గాంచియు, రాజహంసుని బంట్లును, ఇంక దుర్గమందు వసించియున్న ఇతరులును తటాలున మడుఁగులో చొచ్చినారు. ఎలయనఁగా,—

ఆ. లెస్సమంత్రితంబు, లెస్సవిక్రాంతంబు
లెస్స పోరితంబు, లెస్సపఱుపు,
హాదను వచ్చి నప్పు డవిచారితంబుగా
శక్తికొలఁది బుద్ధుఁడు జరుపవలయు. ౧౩౫

రాజహంసుఁడు సుఖముగా నుండినవాఁడు, స్వభావముచేత మెల్లఁగా నడచువాఁడు సారసునితోఁగూడ నుండఁగా వారిని ఇఱువురను చిత్రవర్ణుని సేనాపతి కుక్కుటుఁడు (కోడి) వచ్చి చుట్టుకొన్నాఁడు.

హిరణ్యగర్భుఁడు ఇట్లనియె:- 'సేనాపతీ, సారసుఁడా, ఏల నాకోసము నిన్ను చంపుకొనెదవు ? ఇప్పటికిని నీకు పోవుటకు శక్తియున్నది. కావున పోయి నీటఁ జేరుము. నాకొమరుని చూడామణిని సర్వజ్ఞుని సమ్మతిమీఁద రాజును జేయుము.' సారసుఁడనియె:- 'దేవా, ఇట్టి సహింపరానిమాటను చెప్పవలదు. ఎంతకాలము చంద్రసూర్యులు ఆకసములో నుందురో అంతవఱకు ఏలినవారు సర్వోత్కర్షతో నుండవలయును. నేనేగదా దుర్గరక్షకుఁడను. నారక్తమాంసములతో అలికిన దానిని శత్రువు కోటలో ప్రవేశించును గాక ! మఱియు,—

తే. క్షమియు దాతయునగు గుణగ్రాహియైన
స్వామి యవ్యాజ పుణ్యవశమున దొరకు;'

రాజనియె:—

'నేర్పరియు ననురక్తుండు నిర్మలుండు
నైనభృత్యుండు దొరకుట యద్భుతంబు.' ౧౩౬

సారసుఁడు పలుకుచున్నాఁడు:—

'తే. కలనఁ దక్కంగ మృతి యొంటఁ గలుగదేని,
యుక్తమే దాని విడి దూర మొదిఁగిచనుట ;
తొలఁగదేని మరణము జంతువునకెల్ల
వృథగఁగీర్తిని మలినీకరింపనేల ? ౧౩౭

మఱియు,—

తే. గాలిఁగంపించు దీపంపుఁ గళికవోలె
క్షణవిభంగురమైన యీజన్మమందు
ఎంతయోపుణ్యమునఁగాక యేలఁగలుగుఁ
పరులపనికై యసువులను వ్యయము సేఁత ? ౧౩౮

ప్రభూ, నీవు పలికవు ; అన్నివిధములను నిన్నుఁ గావవలయును. ఏలయన ;—

క. స్వామిని గోల్పోయి ప్రకృతి
యేమెయి జీవించు నతిసమృద్ధంబయినన్?
అమరవైద్యుం డయినను
నేమాడ్కి గతాయువునకు నిచ్చు నసువులన్ ? ౧౩౯

మఱియు,—

క. ఇనుఁడు కనుమూసినంతట
జనమెల్లను గన్నుమూయు జగతీస్థలిలో ;
నినుఁడు ప్రబోధముఁ జెందిన
జనమెల్ల ప్రబోధమొందుఁ జయ్యన మిత్రా ! ౧౪౦

మఱియు,—

ఆ. రాజు, ప్రెగడ, చెలియు, రాష్ట్రంబు, దుర్గంబు,
బలము, బొక్కసమనఁ బ్రకృతు లేడు,
ప్రాకటముగ నివియుఁ బౌరుల శ్రేణులు,
నన్ని రాజ్యములకు నంగము లగు. ౧౪౧

అందును రాజు ప్రధానాంగము.'

అంతట, కోడి వచ్చి రాజహంసుని దేహమున కరవాడి గోళ్ళతో గాయములు గావించినది. వడిగా వచ్చి సారసుఁడు అడ్డపడి రాజును నీటఁ ద్రోచినాఁడు. తర్వాత కోడిగోళ్ళ దెబ్బచేత ఒడలు శిథిలమయిన సారసుఁడు కుక్కుట సేనను మిక్కిలి రూపుమాపెను. కోడియు సారసునిముక్కు-దెబ్బకు చచ్చెను పెక్కుపక్షులు గుంపై ఒక్క సారసుని పొడిచి చంపినవి. చిత్రవర్ణరాజు దుర్గముం జొచ్చి దుర్గమందున్న ధనమెల్ల దోఁచించి వందుల జయశబ్దములచే ఆనందమొంది వెలుపలి వందుపాళెమునకుం బోయెను.

రాజపుత్త్రులు చెప్పిరి:-'ఆరాజహంసుని దండులో సారసుఁ డొక్కఁడే పుణ్యవంతుఁడు, ఎట్లనఁగా అతఁడు తన దేహము నిచ్చి రాజును కాచినాఁడు. ఏల యన;—

తే. ఆలుఁ గోడెల నీను వృషాకృతులనె,
అందు భేదంబు గలుగ దావంతయేని
కొమ్ముతోఁ గొమరయ్యెను గోకువృషభుఁ
గనెడు నా గోవతల్లి యొక్కతెయగాదె.' ౧౪౨

విష్ణుశర్మ చెప్పెను.— 'ఈ మహాత్ముఁడు స్వభావము చేతనే తనదేహ మిచ్చి విడిచినొన్నట్టి పుణ్యోత్తమశ్లోకముల లో విద్యాధరాంగనల పరివారముతో శాశ్వతభోగముల ను అనుభవించును గాక! అట్లే చెప్పఁబడినది:—

క. ఏశూరు లాహవమున ని
జేశునికై ప్రాణములు నిత్తురొ భక్తిన్
ఆశూరులు ధన్యులు త్రిది
వేశత్వముఁ బడసి చిరి రమింతురు సతమున్. ౧౪౩

ఆ. ఎవఁడు పందతనము నెనయక, బహుశత్రు
పరివృతుఁడయి పోరి ప్రాణమిచ్చు,
నాజిచణుని కతని కక్షయలోకముల్
ధన్యతముని కబ్బుఁ దత్క్షణంబ. ౧౪౪

మీరు విగ్రహము వింటిరి.' రాజపుత్త్రు లనిరి.— 'మేము విని సుఖము పొందినారము.' విష్ణుశర్మ యిట్లని యె.—'ఇట్లును అగుఁగాక:—

క. పోరికి మీ రెప్పుడు హయ
వారణ భటసేన నడుప వలవదు గాతన్!
మీరిపువులు నయతంత్రస
మీరహతిన్ గిరిగుహల శమింతురుగాతన్.' ౧౪౫

విగ్రహతంత్రము సమాప్తము.

# సంధి

వెండియు కథ ఆరంభించిన సమయమున రాజపుత్రులు 'అయ్యా! మేము విగ్రహమును విన్నారము, ఇప్పుడు మాకు సంధిని చెప్పుఁడు.' అని యడిగిరి. విష్ణుశర్మ యిట్లనియె:—'వినుఁడు, సంధినికూడ చెప్పెదను. అందులకు ఇది మొదటి శ్లోకము—

తే. దొరల కిరువురకును బెనుదురము జరుగ,
బలము లిరువాఁగునం దఖర్వముగ మ్రందఁ,
దక్కఁ గృధ్ర రథపదముల్ తత్క్షణంబ
తెన్నగా సంధిఁగూడఁబల్కికొని సలిపె.' ౧

అది యెట్లని రాజపుత్రు లడిగిరి. విష్ణుశర్మ చెప్పం దొడంగెను; 'అంతట రాజహంసుఁడు—'మనదుర్గములో నిప్పుపెట్టిన వాఁ డెవఁడు? పగతునివాఁడా, లేక పగతుని ప్రేరణచేత మనదుర్గమందు ఎవఁడైననా?' అని యడిగెను. జక్కవ యిట్లనియె;—'దేవరా, ఏలినవారికి నిష్కారణ బంధువయిన యామేఘవర్ణుఁడును, అతని పరివారమును ఇప్పుడు కనఁబడకున్నారు. కావున ఇది అతనిపని యని తలంచెదను.'

రాజు క్షణ మాలోచించి యిట్లనియె:—'అట్లే అయి
యుండును. ఇది నాదురదృష్టము. అట్లే చెప్పిరి.-

క. జతనంపుఁ బెంపుమై సుఘ
టిత మగుకార్యము విధివిఘటిత మగునేనిన్,
గత మందులకుం బ్రగడల
మతి లోపముగాదు, దైవమాయయ సుమ్మీ.' ౨

మంత్రి పలికెను;—'ఇట్లు పెద్దలు చెప్పియున్నారు.-

తే. విషమ మగుదశ తనకుఁ బ్రాపించినపుడు
దైవమును దూఱు మొప్పె, తత్కర్తగాఁగ
తనదు కర్మదోషముల మాత్రము మనమున
నెపుడునుం దలపోయఁడ యించుకేని. ౩

మఱియు,—

క. హితముం గోరెడి సుహృదుల
మతమున వర్తింపఁ డెవఁడు మతిహీనుండై
అతఁ డిలకుఁ గొయ్యనుండి ప
తితమగు తాఁబేటి మాడ్కిఁ దెచ్చికొను మృతిన్. ౪

మఱియు,—

మాట నెపుడు రక్షింపుము,
మాటవలనఁ బ్రాణహాని మానక కలుగున్;
నీటుగ సంచలు గొను తా
మేటిపతి కథఃపతనము మృతియుం గుఱిగాన్.' ౫

సంధి

అది యెట్లని రాజడుగఁగా మంత్రి చెప్పుచున్నాఁడు:—

కథ ౧.

'మగధదేశమునందు ఫుల్లోత్పలమని సరస్సు కలదు. అందు చిరకాలము సంకట వికటములను హంసలు వసించి యుండినవి. వానిమిత్రము కంబుగ్రీవమను తాఁబేలుకూడ అందు వసించుచుండెను. ఇట్లుండఁగా నొకప్పుడు జాలరులు అటకువచ్చి 'మనము ఈదినము గడపి తెల్లవాఱఁగానే ఇటకువచ్చి చేఁపలను, తాఁబేళ్లను వేఁటాడుదము' అని పలికికొనిరి. ఆమాటవిని తాఁబేలు హంసలతో 'మిత్త్రులారా, విన్నారా జాలరుల మాటను ? ఇప్పుడు నేనేమి సేయవలయును?' అని యడిగెను. 'తెలిసినది, కాని, తెల్లవాఱఁగానే అందులకు తగినట్లు చేసికొనవచ్చును.' అని హంసలు పల్కినవి. కూర్మము చెప్పుచున్నది.— 'అట్లుగాదు, ఇట్టి సందర్భమును ఒకదానిని నేనిటనే చూచి యున్నాను ; ఇట్లు చెప్పినారు ;—

ఆ. తానొకం డనాగతవిధాత, యన్యుండు
ప్రతిసముత్థమతియుఁ, బ్రతిభఁ దొప్ప
నిరువురును సుఖముగ నెసలారుచున్నారు,
యద్భవిష్యుఁ డెఱుఁగ డాసన మొందె.' ౬

అది యెట్లని ఆరెండు నడిగినవి ; తాఁబేలు చెప్పుచున్నది.—

## అవాంతర కథ ౧.

'పూర్వము ఈ చెఱువులోనే ఇట్టి జాలరులే వచ్చి నప్పుడు మూఁడు చేపలు ఇట్లు ఆలోచించుకొన్నవి.— వానిలో అనాగత విధాత (అనఁగా రాఁబోవుదానికి ముందే ఉపాయము చేసికొనునట్టిది) అనువేరి చేప 'నేను వేఱు జలాధారమునకు పోయెదను.' అని చెప్పిపోయి మఱియొక మడుగుం జొచ్చినది. రెండవది ప్రత్యుత్పన్న మతి (అనఁగా అప్పటికి తోఁచినప్రకారము చేయునది) అను పేరి చేప చెప్పినది.-'భవిష్యత్తున ఇది జఱుగును, ఇది జఱుగదు అని నమ్మకము లేనందున నే నెచ్చటికిని వెళ్లను. కార్యము వచ్చినప్పుడు అందులకు తగినట్లు చేసెదను. అట్లు చెప్పినారు ;—

ఆ. ఇడుమవచ్చినంత, బడలకయుపమచే
నుడిపి, బుద్ధిమంతుఁ డొందు ముదము.
వణిజుకాంత జారు బ్రత్యక్షముగ దాఁచె.
బరమసాధ్వియనుచు భర్తదలఁప.' 2

'అది యెట్లని యద్భవిష్యుఁడు అడుగఁగా ప్రత్యుత్పన్నమతి చెప్పుచున్నాఁడు ;—

## అవాంతర కథ ౨.

'విక్రమ పురమందు సముద్రదత్తుఁడని వర్తకుఁడుండెను. వానిభార్య రత్నప్రభ యనునది ఎల్లప్పుడు ఒకా

నొక సేవకునితో క్రీడించుచుండును.

ఒకప్పుడు ఆరత్నప్రభ ఆ సేవకుని మొగమును ముద్దు గొనుచుండఁగా సముద్రదత్తుఁడు చూచెను. అంతట చెడిప మగనికడ కేఁగి యిట్లనియె ;—'ప్రాణేశ్వరా, వీఁడు కడు సుఖి ; ఏలయన నీకై తెచ్చిన కర్పూరమును వీఁడు తిను చున్నాఁడు ; వీనినోట కప్పురంపుఁదావిని నేను గ్రోలితిని.' ఆమాట విని సేవకుఁడు కోపగించి యిట్లనియె ;-'ఏయొడ యని ఇంట ఇట్టి యిల్లాలుకలదో, సేవకుని నోటిని వాసన చూచునది, ఆయింట సేవకుఁడు ఎట్లుండును ?' ఇట్లని వాఁడు లేచి నడచెను. అంతట వర్తకుఁడు వానిని ప్రయత్న పూర్వకముగా మంచిమాటలాడి ఎట్టకేలకు నిలుపుకొనెను. కావున 'ఇడుమవచ్చినంత' ఇత్యాదికమును నేను చెప్పితిని.'

అంతట యద్భవిష్యుఁడు (ఏదికానున్నదో అది యగును గాక అనువాఁడు) ఇట్లనియె;—

క. 'ఏదికానిదో యదికానిదె ;
ఏదికానున్నదియొ తప్పకెప్పుడు నదియౌ,
నిదిచింతావిషహారమగు
నదౌషధము దీనిఁద్రాగిసౌఖ్యము గనుఁడీ.' ౘ

తర్వాత తెల్లవాఱినంతట ప్రత్యుత్పన్నమతి వలలో పడి చచ్చినట్లు తన్ను అగపఱచుకొనెను ; జాలరులు వల నుండి తివిచి పాఱవైవఁగా శక్తికొలఁది ఈఁది లోఁతునీళ్లం

జొచ్చెను. యద్భవిష్యుఁడు జాలరులకు దొరకి వారిచేతఁ జచ్చెను.

కావున నేను 'తానొకం డనాగతవిధాత' ఇత్యాదికమును జెప్పితిని. కావున ఎట్లు నేను వేఱొకమడుఁగుం జేరుదునో అట్లు చేయుఁడు.' హంసలు 'మఱియొక జలాధారమును చేరినతర్వాత నీకు సేమమేగాని నేలనుఁపోవు చుండఁగా నీగతి యెట్లు?' అని యడిగినవి. 'నన్ను మీ యిరువురును ఆకాశమార్గమున గొనిపొండు.' అని తాఁబేలు అడిగినది. 'అందులకు ఉపాయమే'మని హంసలు అడుగఁగా, 'మీరిరువురును నోట కఱ్ఱను కొనలయందు కఱచుకొనుఁడు. నేను దాని నడుమ కఱచుకొనియెదను. అంతట మీ ఱెక్కల బలమున నన్ను ఆకాశమున మోచి కొని పొండు.' అని తాఁబేలు చెప్పెను. హంసలు చెప్పినవి.—'ఈయుపాయము చక్కఁగానే యున్నది, కాని,—

క. పొంగ కుపాయాప్తికిఁ, ద
త్సంగతి నరుదెంచు చెట్టసయితి మరయుమీ;
కొంగ కనుంగొనుచుండఁగ,
ముంగిస దచ్చాబకముల ముదమున మెసవెన్.' ౯

తాఁబేలు అడిగినది, 'అదియెట్లు?' అని; హంసలు చెప్పుచున్నవి.—

## అవాంతర కథ 3.

'ఉత్తరాదిలో గృధ్రకూటమని పర్వతము కలదు. అచ్చటనే నర్మదానదియొడ్డున మఱ్ఱిచెట్టుమీఁద కొంగలు కాపురముండినవి. ఆచెట్టుక్రింద బొక్కలో పాముండినది. అది వాని లేఁతపిల్లలను తినివైచుచుండినది. అంతట దుఃఖపీడితములైన కొంగల కలవరమును విని ఒక ముసలికొంగ యిట్లనియె.—'మీరు ఇట్లు చేయుఁడు, చేఁపలను తెచ్చి ముంగిసల బొక్కనుండి పాము బొక్కవఱకు వరుసఁగా ఒక్కొక్కటిగా వేసి రండు. అంతట ఆతిండికి ఆసించి ముంగిసలువచ్చి పామును చూచెడిని; స్వభావవైరము చేత పాముకన్నము జొచ్చి పామును చంపెడిని.' కొంగలు అట్లే చేసినవి. ముంగిసలును పాము కన్నముఁజొచ్చి దానిని చంపినవి. అటుతర్వాత ముంగిసలు చెట్టుమీఁది పక్షిపిల్లల కూఁతలను విని చెట్టెక్కి కొంగల కన్నులయెదుటనే ఆపిల్లలను భక్షించినవి.

కావున మేమిరువురమును 'పొంగ కుపాయా ప్తికి' ఇత్యాదికమును పలికితిమి. మేము కొనిపోవుచుండఁగా నిన్నుఁగని లోకులు ఆశ్చర్యపడి ఏమేమో పల్కుదురు; దానిని విని నీవు బదులు పలుకుదువేని, అంతట నీచావు నిక్కము. కావున ఇచ్చటనే యుండుట ఎల్లవిధముల మంచిది.'

తాఁబేలు ఇట్లనియె,—'ఏమి నేనంత మూర్ఖుఁడనా ? నేను బదులు పలుకను. నేనేమియు మాటలాడను.' అట్లేజరుగఁగా ఆకాశములో హంసలు మోచికొనిపోవుచున్న యా తాఁబేటిఁగాంచి పసులకాపరులు అందఱు వెంటఁబరుగిడుచు 'అహాహో ఏమివింత! పక్షులు తాఁబేటిని మోచికొని పోవుచున్నవి' అని పలికిరి. అందులో నొకఁడు 'ఈ తాఁబేలు నేలఁబడెనేని నేను ఇక్కడనే వండుకొని తినెదను.' అనెను. మఱియొకఁడు 'ముక్కలుగా భాగించుకొని కొనిపోవలయును' అనియెను. మఱియొకఁడు 'ఇంటికి కొనిపోయి కాల్చుకొని తినవలయును.' అనెను. ఈప్రకారము ఓర్వరాని క్రూరవాక్యములనువిని తాఁబేలు కోపముపెంపున తొంటి తెలివితప్పి 'మీరు బుగ్గియేతిందురు' అనిపలుకుచు కఱ్ఱనుండి క్రిందపడి పసులకాపరులచేత చచ్చెను. కావున 'హితముగోరెడి సుహృదుల' ఇత్యాదికమును నేను చెప్పితిని.'

అంతట వేగుకొంగ అచ్చటికివచ్చి అతనితో నిట్లనియె.-'స్వామీ, నేను ముందే చెప్పలేదా, ప్రతిక్షణమును దుర్గమును సోదన చూచుకొనవలయుననని ? ఆపని మీరు చేయరైతిరి. ఆయేమఱుపాటునకు ఈఫలమును అనుభవించితిరి. గద్దపంపిన యా కాకి మేఘవర్ణుఁడు మనదుర్గమునకు నిప్పుపెట్టినాఁడు.'

రాజు నిట్టూర్పువుచ్చి యిట్లనియె.—

తే. 'యాచ్ఞచే నేమి, యుపకృతినరసి యేమి,
శత్రువులయందు నెవఁడు విశ్వాసమొందు,
చెట్టుకొన నిద్రవోయెడు చెనఁటివోలె
వాఁడువొందుఁ బ్రబోధంబుఁ బతితుఁడగుచు.' ౧౦

వేఁగు వచించెను,—'అట్లు దుర్గమును తగులఁబెట్టి మేఘవర్ణుఁడుపోయి దర్శింపఁగానే చిత్రవర్ణుఁడు సంతోషించి 'ఈమేఘవర్ణుని ఈకర్పూరద్వీపమునకు రాజుగా నభిషేకింపుఁడు' అని యానతిచ్చెను. అట్లు చెప్పి యున్నారు.-

*క. కృతకృత్యుం డగుభృత్యుని
కృతమును మాయింపఁదగ దొకింతయు; వానిఁ
బ్రతిఫలమానకృపావి
స్మితవాక్యంబులను హృష్టుఁ జేయఁగవలయుఁ.' ౧౧

జక్కవ 'స్వామీ, నేను చెప్పుచున్న మాటను చక్కఁగా వినవలయును' అని హెచ్చరించెను.-అంతట రాజు 'ఇంకను ఏమి విశేషము, ఇంకను ఏమి విశేషము?' అని యడిగెను. వేఁగు వక్కాణించెను.-అంతట ప్రధాన మంత్రిగద్ద యిట్లనియె.—'ఏలినవాఁడా, ఇది సరిగాదు. వేఱువిధముగా అనుగ్రహము చూపుము. ఏలయన,-

తే. యుక్తి సెప్పుట యవిచార యుక్తమతికిఁ
దండులంబులకై యాఁకదంపుటయగు;

నీచునికిఁ జేయునుపకృతి నివ్వటిల్లు
నిసుకదిబ్బపయి న్ముద్రయిడినయట్లు. ౧౨

మఱియు,—

తే. అధికు నుంపంగవలసిన యాస్పదమున
నధము నుంచుట కరము గర్హ్యంబ యగును,
మౌళిమణితావునందు నేమానవుండు
పావుకోడు ధరింపంగఁ బాలుపడును ? ౧౩

అట్లు చెప్పియున్నారు.—

ఆ. ఉత్తమాస్పదమున నుంచినచో నీచు,
స్వామినే వధింప వాఁడు గడఁగు,
పులిని జేసినంత యెలుక గర్వంబూఁది
మునివరేణ్యుఁ జంపమొనసినట్లు.' ౧౪

'అదియె'ట్లని చిత్రవర్ణుఁడడిగెను. గద్దసెప్పుచున్నది.

కథ ౨.

'గౌతమమునియొక్క యాశ్రమములో మహాతపుఁడని యొకముని యుండెను. ఆయనకు ఆశ్రమముచెంత కాకినోటినుండి జాఱిపడిన యెలుకపిల్లయొకటి కనఁబడెను. ఆయన దానిని జాలిగొని నివ్వరినూకఁ బెట్టి పెంచెను.

ఆయెలుకను తినుటకు ప్రయత్నపూర్వకముగా వెదకుచు పిల్లి రాఁగాఁ గాంచి భయపడియున్న యాయెలుకను తపోమహిమచేత బల్లిదమయిన పిల్లినింజేసెను. పిల్లి కుక్కకు భయపడినది. అంతట దానిని ముని కుక్కం

జేసెను. కుక్క పులికి వెఱచినది. అంతట నాతఁడు దానిని పులిం గావించెను. ఆపులిని సయితము ముని తొంటి యెలుకనుంబోలె బ్రోచుచుండెను. అంతట నచ్చటి జనులందఱు ఆమునిని పులిని చూచి 'ఈముని ఎలుకను ఈపులిగాఁజేసినాఁడు' అని వచించుచుండిరి. దానిని విని పులి దుఃఖించి 'ఈముని బ్రదికియున్నంత కాలము నాకు అవమానకరమయినట్టిది నావాస్తవ స్వరూపమును గూర్చిన యీవాదు పోదు.' అని తలంచుకొని మునిం జంప నుంకించెను. దాని ఇచ్ఛయెఱింగి ముని 'మఱల ఎలుకవగుము' అని పలికి ఎలుకనే కావించెను.

కావున నేను 'ఉత్తమాస్పదమున నుంచిన నీచుని' ఇత్యాదికముం జెప్పితిని-మఱియు-దేవా, ఇది అలఁతి యని తలంపఁగూడదు. వినుము—

ఆ. ఉత్తమాధమముల నొగి మధ్యమంబులఁ
బెక్కుమత్స్యములను మెక్కి, బకము
అతిబుభుక్షఁజెంది హాతమయ్యెఁ బిమ్మట
నెండ్రి నొక్కటిని రహిం గ్రహించి.' ౧౫

'అదియెట్లని చిత్రవర్ణుఁడడుగఁగా మంత్రి చెప్ప సాగెను —

కథ ౩.

'మాళవదేశమందు పద్మగర్భమనుపేరి తటాకము గలదు. అం దొకముసలికొంగ, శక్తిలేనిది బెంగపెట్టు

కొన్నట్టుగా అగపడుచు నిలిచియుండెను. దాని నొక యెండ్రిచూచి 'అయ్యా, ఏలయిట్లు నీవు తిండి మానుకొని యున్నావు?' అనియడిగెను. కొంగచెప్పుచున్నది.—చేఁపలు నాకు ఆహారము, వానిని ఇటతప్పకుండ తేపు తెల్లవాఱఁగానే జాలరులువచ్చి చంపుదురని ఊరిచెంత వార్తవింటిని. అందువలన నాకు జీవనభంగముచే మరణము మూడినదని తెలిసికొని తిండిమీఁద సయితము అక్కఱపుట్టక యున్నాఁడను.' అంతట చేఁపలు ఆలోచించినవి.—'ఈసమయములో ఇది మనకు ఉపకారిగానే కనఁబడుచున్నది. కావున దీనినే మన క్షేమయిన నుపాయము చెప్పుమని యడుగుదము. అట్లునుచెప్పిరి ;—

ఆ. రిపుఁడు సంధికర్తుఁ డుపకరించెడు వాఁడు,
చెలియనర్తుఁడెడరు సేయువాఁడు ;
లక్ష్యలక్షణముల లక్షింపువీరికి
నుపకృతియును నట్లె యపకృతియును.' ౧౬

అంతట 'మాకేమి రక్షణోపాయము?' అని చేఁపలడిగినవి. 'వేఱుజలాధారమునకు పోవుటయే మీరు బ్రదుకుటకు ఉపాయము. అచ్చటికి మిమ్ము ఒక్కొక్కరినిగా నేను కొంపోయెదను' అని కొంగ చెప్పెను. చేఁపలు భయంబున అట్లేచేయుమని యడిగినవి. అంత నా టక్కరి కొక్కెర చేఁపలను ఒకటొకటిగా కొనిపోయి ఒకచోట పెట్టుకొని తిని మరలవచ్చి 'వానిని నేను వేఱు జలాధార

ముం జేర్చితిని' అని చెప్పెను. అంతట ఎండ్రి 'కొంగా, కొంగా, నన్నుఁగూడ నచ్చటికిం గొనిపొమ్మ' అనియడిగెను. అంతట కొక్కెర మున్నెన్నఁడును నెఱుఁగని ఎండ్రి మాంసమును కోరినదై ప్రీతితో దానిని కొనిపోయి మెట్ట నేలంబెట్టెను. ఎండ్రియు చేపముండ్లను వెదచల్లియున్న నేలను చూచి 'అయ్యో! చెడితినిగదా దురదృష్టుఁడను! కానీ యిప్పటికి తగినట్లు వ్యవహరించెదను' అని ఆలోచించుకొని కొక్కెరమెడను కత్తిరించెను. కొక్కెర యీల్గెను. కావున 'ఉత్తమాధమంబుల' ఇత్యాదికముం జెప్పితిని.'

అంతట చిత్రవర్ణుఁడు వెండియు నిట్లనియె.-'ఓమహామంత్రీ వినుము; ఈవిషయమును నేనాలోచించియే యున్నాను. ఇచ్చట రాజుగానిలిచి మేఘవర్ణుఁడు కర్పూర ద్వీపములోని యుత్తమవస్తువులనెల్ల మనకు కట్నము పంపుచుండవలయును. వానితో మనము కడువిలాసముతో వింధ్యాద్రియందుండవచ్చును.'

దూరదర్శనవిద్యుఁ యిట్లనియె, 'దొరా,

ఆ. కలుగ నున్నయట్టి ఘనవిభవంబులఁ
దలఁచియెవఁ డిపుడు ముదంబునొందుఁ,
గుండఁ బగులఁ గొట్టుకొన్న విప్రునివలె
వాఁడు భంగమొందు వసుమతీశ!' ౧౭

*అదియెట్లని రాజడుగ మంత్రి చెప్పుచున్నాఁడు. —

కథ ౮.

దేవీకోట్టమను పట్టణములో దేవశర్మయని బ్రాహ్మణుఁడుండెను. అతఁడు మహావిషువత్సంక్రాంతినాఁడు మూఁకుడునిండ పేలపిండిని దానముపట్టెను. దానిని తెచ్చికొని కుండలతోనిండిన కుమ్మరిసాలలో ఒకచోట పడుకలో దేహామువైచి పిండిని కాపాడుకొనుటకు చేతనొక కఱ్ఱను పెట్టుకొని రాత్రి ఆలోచించెను. 'ఈమూఁకుటిపిండిని పదిగవ్వలకు అమ్మితినా, ఆగవ్వలతో ఇక్కడనే కుండలు మూఁకుడులు మొదలయిన వానినికొని నానావిధముల పెంచినధనములతో మరల మరల వక్కలు వస్త్రములు మొదలైనవానిని కొని అమ్మి లక్షధన మార్జించి నలువురు భార్యలను పెండ్లియాడెదను. ఆసవతులలో రూపవంతురా లెవతెయో దానిమీఁద ఎక్కువమక్కువం బూనెదను. సవతులు ఎప్పుడు కొట్లాట ఆరంభింతురో అప్పుడు కోపాకులుఁడనై నేను దుడ్డుఁగఱ్ఱతో వారిని కొట్టెదను.' ఇట్లు పలికి వాఁడు ఆదుడ్డుగఱ్ఱను విసరెను. పిండిమూఁకుడు పొడుమయినది; కుండలెన్నియో నుగ్గయినవి. ఆశబ్దము విని కుమ్మరివచ్చి ఆతీరున పగిలియున్న కుండలను చూచుకొని బ్రాహ్మణుని ధిక్కరించి సాల నుండి వెళ్లఁగొట్టెను.

కావున 'కలుగఁబోవునట్టి ఘన విభవంబుల' నిత్యా దికముం జెప్పితిని.' అంతట రాజు ఏకాంతమున గద్ద మంత్రిని అడిగెను.-'బాబూ, ఏమిచేయవలయునో మఱి చెప్పుము' అని. గద్దచెప్పుచున్నది.—

ఆ. 'మదవిఘూర్ణితుండు, మహిపతి సంకీర్ణ
దంతివోలె నుత్పథంబు వట్టి,
నందులకు జగంబునం దెల్ల వారిచే
నేతలకుఁ గరంబు నింద వచ్చు. ౧౮

ప్రభూ, మనమేమి బలగర్వముచేత కోటంగూల్చితిమా? కాదు మఱి నీప్రతాపము నడిపిన యుపాయము చేత.' రాజు 'మీయుపాయము చేత' అనెను. గద్ద యిట్లనియె.-'నామాట ప్రకారము చేసెదవేని, ఇప్పుడు స్వదేశమునకు పోవలసినది. అటు చేయనిచో వర్షాకాలము వచ్చెనేని సమానబలునితో ఈరాజహంసునితో మరల మనకు పోరుపొసఁగుడు, విదేశమున నిఱికికొనియుండు మనకు స్వదేశమునకు పోక కష్టమగును. సుఖము శోభించునట్లుగా ఒడంబడిక చేసికొని పోవుదము. కోటంగూల్చితిమి; కీర్తి రానే వచ్చినది. ఇది నా కిష్టమయిన పని. ఏలయనఁగా ;—

క. ప్రియ మప్రియ మెంచక భూ
దయితుని కెవ్వఁడు వచించు ధర్మ్యంబునె య

ప్రియమైనను దథ్యము, వాఁ
డ యాత్మనికి నొక్కఁడే సహాయుఁడు దలఁపఁగ. ౧౯

మఱియు,—

తే. సమునితో నైననుఁ గ సంధిసలుపవలయు,
జయము యుద్ధంబునందు సందియముగాన;
తుల్యబలులు సుందోపసుందు లిరువురును
నొండొరులచేత మడియరె భండనమున? ౨౦

మఱియు,—

తే. ప్రస్ఫుటంబగు రాజ్యంబు, భూరియశముఁ,
జెలిమి, దన్నును, జతురంగబలము, నెవఁడు
బాలిశుఁడు గాఁడయేని తా బవరమందు
సందియంబను నుయ్యేలయందు వైచు?' ౨౧

'అదియెట్లని రా జడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు:-

కథ ౫.

'పూర్వము సుందోపసుందులని గొప్పయసురు లిద్దఱు ముల్లోకముల దొరతన మపేక్షించి ఎక్కువఁగా దేహ ప్రయాసపడి పరమేశ్వరుని ఉపాసించిరి. అంతట వారిని మెచ్చి భగవంతుఁడు 'వరమడుగుఁడు' అనెను. వారియం దున్న సరస్వతి మూలముగా వారు ఒకటి అనఁబోయి మఱియొకటి అనిరి.-'మాయందు భగవంతునికి సంతోష మేని, ఆపక్షమున పరమేశ్వరుఁడు మాకు తనప్రియను

పార్వతిని ఇచ్చునుగాక.' అందులకు పరమేశ్వరుఁడు కోపించియు వర మీఁకతప్పనందున తనభార్యను పార్వతిని ఇచ్చెను. ఆమెయొక్క రూపలావణ్యములకుం జిక్కి లోకఘాతకులు మనంబున నువ్విళ్లూరుచు పాపాంధులై 'నాదియీతరుణి, నాది యీతరుణి,' అని ఒండొరులతో జగడమాడుచు, తగవుతీర్చువాని నెవని నేని అడుగవలయునని యుద్దేశింపఁగా, పార్వతీపతియే ముసలి బ్రాహ్మణుని రూపమున వచ్చి యట నిలిచెను. అంతట వా రాతనితో 'ఈసుందరిని మేము మాబలముచే సంపాదించితిమి. మాయిరువురలో ఎవనిది కాఁదగును?' అని యడిగిరి. బ్రాహ్మణుఁ డిట్లనియె.—

'తే. కులసుధాంశుఁ, డగ్రకులుఁడు సంపూజ్యుండు,
బాహుసంభవుండు బలయుతుండు,
విత్తధాన్యరాశి విదితుండు, వైశ్యుండు,
పాదజుండు ధర్మ్యపథరతుండు. ౨౨

కావున మీకు క్షత్త్రియధర్మోచితమయిన యుద్ధముచేతనే తగవుతీఱవలయును.' అతఁ డిట్లు చెప్పఁగా వారు 'సరి' యేయని సమబలులు ఒక్కుమ్మడిని ఒండొరులం గొట్టుకొని మడిసిరి.

కావున 'సమునితో నైనను సంధి సలుపవలయు' ఇత్యాదికమునుం జెప్పితిని.' రాజు అడిగెను.—'ముందే ఏల యీమాట నాకు మీరు చెప్పకుంటిరి?' మంత్రియనియె.—

'అప్పుడు నామాట నంతయు వలుకు మీరు విన్నారా ? ఈయుద్ధమే నాసమ్మతిచేత జరిగినట్టిది గాదు. ఈహిరణ్యగర్భుఁడు మంచిగుణములు గలవాఁడు ; ఇతనితో పోరు పెట్టుకొనుట సరిగాదు. అట్లు చెప్పియున్నారు.—

ఆ. తథ్యవంతుఁ, డార్యధార్మికానార్యులు,
భ్రాతృసంఘయుతుఁడు, బల్లిదుండు,
బహుసమరవిజయియు, బరఁగుదు ర్వాత్రవుల్
సంధి కర్హమయిన సప్తకముగ. ౨౩

సీ. సత్యవంతుఁడు తనసత్యంబు పాలించు,
సంధి నుల్లంఘన సలుపఁ డెపుడుఁ,
బ్రాణబాధలనైనఁ బడయనొప్పనుగాని,
యార్యుండు ద్రోక్కఁ డనార్యపథము,
అని ధార్మికునినెల్ల రనుఁగమింతురు, ధర్మ
జనరాగవంతుఁ డసాధ్యుఁ డతఁడు,
నాశ మ్మొదలుట కనార్యునితో సంధి
యర్హమ్మగు నకాలయాపనముగ,
తే. సంహతపుఁ గంటకమయ వంశతతివోలె
భ్రాతృసంఘి సంధేయుఁ డబాధ్యుఁడగుటఁ ;
బ్రబలుపైఁ బోరు మన నిదర్శనము లేదు,
గాలి కెదురేఁగు మేఘంబుఁ గంటి మెచట ? ౨౪

తే. ఎల్లరును, నెల్లతావుల, నెల్లతఱుల,
జామదగ్న్యునిఁ బోల్బహు జన్యవిజయి

నండగొని తత్ప్రతాపజ మనుభవింత్రు
నిందు సిగి, నందువలన సంధేయుఁ డతఁడు. ౨౫

కావున నిట ఈ చెప్పిన గుణములలో అనేకములు గల యట్టి యీ రాజహంసునితో సంధి చేసికొనవలసినది.

చక్రవాకము పలికెను.-'సర్వమును బోధపడినది. ఓహోంగా, త్వరగాపోయి, ఇంక నచటి విశేషమును మరలం గనుంగొని రమ్ము.' అంతట హిరణ్యగర్భుఁడు జక్కవను, 'మంత్రీ, సంధి సేయఁదగనివారు ఎందఱు? వారిని వినఁ గోరికగా నున్నది,' అని యడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు.-'దేవరా, చెప్పెదను —

సీ. బాలుండు, వృద్ధుండు, పటుదీర్ఘరోగియు,
జ్ఞాతి సంఘాత నిష్కాసితుండు,
భీరుకజనుఁడును, భీరుకుండును, మఱి
లుబ్ధజనుండును, లుబ్ధు స్వాయము,
విప్రకృతామాత్యవితతియు, విషయాతి
మగ్నుండు, బహుచిత్త మంత్రయుతుఁడు,
దేవబాడబదూషి, దైవహతుఁడు, దైవ
పరుఁడు, దుర్భిక్షియు, బహురిపుండు

తే. దేశ, కాలచ్యుతుఁడు, బలద్విష్టుఁ, డస్త
సత్యధర్ముండు, ననెడి వింశతి విధముల
నృపులతో సంధివలదు పోరే రచింపు,
వడిగ వారలు రిపు వశంవదు లగుదురు. ౨౬

సీ. అల్పప్రభావుఁడ యగుఁగాన బాలుండు,
వానికై పోర నెవ్వాఁడు రాఁడు;
ఏల నా బాలకుం డీలేఁడు ఫలముల:
యుద్ధంబునకును నయుద్ధమునకు
నుత్సాహశక్తిశూన్యు లగుట వృద్ధుండు
దీర్ఘామయుండును దీనమతులు
పరిభూతు లగుదురు స్వజనంబుచేతనే;
యిందులో సందేహ మెంచవలదు;

తే. ఎల్లజాతులచే బహిష్కృతుఁడౌవండు,
వానిఁ గెడపుట సులువగు, వానిజనులె
సమయమును వేచియుండి, యాశ్రయముదొరక,
వానిఁ గూల్తురు, విజిగీషువశముఁ జెంది. ౨౭

సీ. అని మాని భీరుఁడు సనుసట్టులే భీరు
జనులు తేనిఁ ద్యజింత్రు సమరమందు;
లోభికై యనుజీవులు దురంబు నేయరు,
వేతనం బీయమి విడుతు రతని;
దానంబుచే వారు దాయకు లోనయి
తమదొరనే కూల్తు దాయకొఱకు;
ప్రకృతులు బవరంపుఁబ్రస్తావనలయందు
ద్యజియింపుదురు విరక్తప్రకృతిని;

తే. విషయములయం దమితసక్తి వెలయువానిఁ
బెక్కువిధముల సులభంబు వెల్లగింప,

మంత్రులు త్యజింత్రు బహుచిత్తమంత్రుఁ జేని ;
ద్వేష్యుఁడగువారి కతఁ డవస్థితిరహితుఁడు. ౨౮

సీ. ధర్మంబె బలిగాన దైవహతుఁడు దేవ
విప్రదూషియుఁ జేటు వెసఁ గుడుతురు,
దైవజములు విపత్సంపద, లని, దైవ
చింతి స్వోద్యము పూనికసేయఁ డెపుఁడు ;
దుర్భిక్షహతుఁడు డిందును స్వయమే, బల
వ్యసని తాఁబోర నవశతఁ జెందు;
స్థానబలాపేతుఁ జంపుఁ గంటకుఁడును
నీరిలో మొసలి యేనికనుఁ బోలె;

తే. బహురిపుఁడు డేగకదుపులోఁ బావురంబు
భంగి నెటఁ జను నచటనే భంగ మొందుఁ;
గాలబలి పరిమార్చు నకాలబలిని,
గౌశికము రాత్రిహతదృష్టిఁ గాకిఁ బోలె. ౨౯

ఆ. సత్యధర్మహరుఁడు సంధి కర్హుఁడు గాఁడు,
సంధిచేసికొనియు సాదుగామి;
నచిరముగనె వాఁడు పచరించు విక్రియ,
తగును సంధ్యసంధి తత్త్వ మిట్లు. 30

ఇంకనుం జెప్పెదః-సంధి, విగ్రహము, ఆసనము, యానము, సంశ్రయము, ద్వైధీభావము, అనునవి ఆఱు గుణములు; పనులయొక్క ఆరంభోపాయము, పురుష

ద్రవ్యసంపద, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము, కార్యసిద్ధి, అనిమంత్రమున నయిదంగములు; సామదాన భేదదండములు నాలుగుడుపాయములు; ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, అనిమూఁడుశక్తులు. ఇదంతయు నిత్యము ఆలోచించి గొప్పవారు జయింపఁ గడంగుదురు.

క. ప్రాణము నర్పించిననుఁ
మానవులను గనని యారమా దేవత తా
నే నీతి విద్వ ఋషులగే
హానకుఁ జంచలయ య్యా నరుగుఁ బరువునఁ.

అట్లును చెప్పినారు:—

ఆ. ఎవనిధనము సమముగ విభక్త మెపుడును,
జరగతులును మంత్ర మరయఁ గావు,
ఎవని నేని పల్కఁ డెవఁ డప్రియములను,
వాఁడు సాంతెరీపవసుధ నేలు. 3౨

మఱియు, మహామంత్రి సంధి నుపదేశించినాఁడు గాని, ఇపు డారాజు జయగర్వముచేత దానిని అంగీకరింపఁడు. కావున మన మిట్లుచేయుదము. మనమిత్రుఁడు, సింహళరాజు మహాబలుఁడను బెగ్గురు నేఁటిదీవియందు, కలహములు పుట్టించుఁగాక! ఏలయున,—

క. తను లెన్స గాచికొని, చ
క్కనఁ గూడినదండు తోడఁ గదలుచు, రిపునిఁ

జను నభితప్తునిఁ జేయఁగ,
ననువగుఁ ద ప్తంబు నదుక నభిత ప్తముతోఁ౯.'     33

అంతట రాజు 'అట్లే యగుఁగాక' అని విచిత్రుఁ డనెడి కొక్కెరచేత మిక్కిలి రహస్యమైన జాబును ఇచ్చి సింహళ ద్వీపమునకుం బంపెను.

తర్వాత వేగు మరల వచ్చి నివేదించెను.- 'దేవా, అచ్చటి ప్రస్తావమును వినుము, అచ్చట గద్ద ఇట్లనియె.- 'ప్రభూ, మేఘవర్ణుఁడు అచట చిరకాల మున్నవాఁడు; ఆరాజు హిరణ్యగర్భుఁడు సంధిచేయఁదగిన గుణములు కలవాఁడో కాఁడో అతనికి తెలియును.' అంతట వానిని రప్పించి రా జడిగినాఁడు.-'కాకీ, ఆ రాజు హిరణ్యగర్భుఁ డెట్టివాఁడు? అతనిమంత్రి చక్రవాకుఁడు నెట్టివాఁడు?' మేఘ వర్ణుఁ డిట్లు వచించెను.-'దేవరా, ఆ హిరణ్యగర్భరాజు ధర్మరాజునంత దొడ్డవాఁడు; సత్యసంధుఁడు. చక్రవాకుని వంటి మంత్రి మఱియెక్కడను కానరాఁడు.' 'అట్లయిన నీచేత నతఁ డెట్లు మోసపోయినాఁడు?' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.——

క. 'కడునమ్మి చేరువారలఁ
దడయక వంచించుటయు విదగ్ధత యగునే!
ఒడ్డి నిద్రఁ గూరినాతనిఁ
గెడపుటచేఁ బౌరుషంబు కీర్తిత మగునే.     ౩౪

వినుము రాజా, ఆమంత్రి నన్ను చూచినప్పుడే కని పట్టినాఁడు; కాని, ఆరాజు దొడ్డవాఁడు. అందువలన నాకు మోసపోయినాఁడు.

క. తనవలె సత్యుండని దు
ర్జను నెవ్వఁడు విశ్వసించు, సత్యాత్ముని నా
తని, ధూర్తులు వంచింతురు
కనుకట్టో యనఁగ మేఁకకై ద్విజుఁ బోలెణ.' ౩౫

'అదియె'ట్లని రా జడుగఁగా మేఘవర్ణుఁడు వక్కాణించెను.

కథ ౬.

గౌతములవారి తపోవనమునందు ఒకబ్రాహ్మణుఁడు యజ్ఞము సేయఁ బూనుకొని అందుకై గ్రామాంతరమున మేఁకను విలిచి బుజమునం బెట్టుకొని పోవుచుండఁగా దారిలో ముగ్వురు మోసగాండ్రు చూచి, ఏయుపాయ మునసైన ఈమేఁక మనకు దొరకెనా అందువలన మనకు తెలివి హెచ్చును. అని యాలోచించుకొని దారిపొడుగు నను కోసుకోసుదూరమున మూఁడుచెట్లక్రింద ఆబ్రాహ్మ ణుని రాకను ఎదురు సూచుచుండిరి. బ్రాహ్మణుఁడు సమీపింపఁగానే మొదటివంచకుఁడు 'ఏమయ్యా, బాప నయ్యా, కుక్కను బుజానమోచుచున్నావు?' అనియడి గెను. 'ఇది కుక్క గాదు. యజ్ఞానికి మేఁక.' అని బ్రాహ్మ ణుఁడు చెప్పెను. అటుతర్వాతి ధూర్తుఁడును బ్రాహ్మ

ణుని అట్లే అడిగెను. ఆమాట విని బ్రాహ్మణుఁడు మేఁకను దింపి నేలబెట్టి మాటిమాటికి పరికించి మఱల బుజమునం గాని సందేహించుచు నడిచెను. ఏలయన,—

తే. ఖలవచనములచే మహాత్ములకునైన
మానసము బిట్టుడోలాయమాన మగును;
వానిచేత నెవండు విశ్వసితుఁ, డతఁడు
జిత్రకర్ణునికై వడిఁ జెందు మృతిని.' ౩౭

'అదియెట్లు' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పు చున్నాఁడు:

కథ ౭.

'ఒకానొకయడవి ప్రదేశములో మదోత్కటుఁడని సింహముండెను. దానికి సేవకులు ముగ్గురు, కాకి, పులి, నక్కయు. అవి క్రుమ్మరుచు ఒకలొట్టిపిట్టం గాంచి 'నీవెవర వోయి?' అని అడిగినవి. అది తనవృత్తాంతమును చెప్పి నది. అంత నవి దానిం దోడ్కొనిపోయి సింహమున కప్పగించినవి. సింహము దానికి అభయవాక్కు నొసంగి చిత్రకర్ణుఁడని పేరిడి తనయొద్ద ఉంచుకొనెను. ఇట్లు కాలము గడచుచుండెను.

అంత నొకప్పుడు సింహమునకు దేహము అస్వస్థ ముగా నున్నందునను, మిక్కుటముగా వర్షము కురియు చున్నందునను, మేఁత దొరకక అవి అన్నము లేక వ్యాకుల

పడుచుండినవి. అంతట కాక వ్యాఘ్రజంబుకములు చిత్ర కర్ణునే దొరచంపునట్లు ఉపాయము సేయుదము. ఏల యీ ముండ్లమేఁతరి?' అని ఆలోచించినవి. పులి యిట్లనియె: 'స్వామి అభయవాక్కు నొసంగి వీనిని చేపట్టెను గదా? ఈఆలోచన ఎట్లు నెఱవేరును?' కాకి యిట్లనియె.- 'ఈసమయములో స్వామి కృశించియున్నాఁడు. పాపము నకు వెనుదివియఁడు. ఎట్లన,—

తే. తల్లియును క్షుధచే వీడుఁ దనయుఁ గూడ,
పాము క్షుధచేతఁ దనగ్రుడ్లనే మెసవును,
ఏయఘు మెవండు క్షుధచేతఁ జేయఁ గొంకు?
క్షీణులు నరులు కరము నిష్కృపు లగుదురు. 32

తే. మత్తుఁడు, ప్రమాదవంతుఁ, డున్మాదవాతుఁడు
శ్రాంతుఁడు, బుభుక్షితుఁడు, క్రోధి, సత్వరుండు
లోభి, భీరువు, యువతిలోలుఁడును, వీరు
పదుగురును ధర్మవిదులుగా రదియెఱుంగు.' 33

ఇట్లు నిశ్చయము చేసికొని అన్నియు సింహము కడ కుంబోయినవి. 'మేఁతకేమయిన దొరకినదా?' అని సింహ మడిగెను. 'దేవరా, ఎంతకష్టపడి వెదకినను ఏమియు దొరకలేదు' అని కాకి చెప్పెను. 'మఱి ఇపు డేమిబ్రదుకు నుపాయము?' అని సింహమడిగెను. 'స్వాధీనముగానున్న ఆహారమును వదలుకొన్నందున ఈసర్వనాశము సంభవిం చినది.' అని కాకి చెప్పెను. 'ఏమి ఆహారము ఇక్కడ

స్వాధీనము ?' అని సింహ మడిగెను. 'చిత్రకర్ణుఁడు' అని కాకి చెవిలో చెప్పినది. సింహము నేల తాఁకి చెవులు మూసికొని 'అభయవాక్కు నొసంగి నేను నిలుపుకొంటిని. ఈపని ఎట్లుతగును ?

క. దానము లనేకములు గో
దానమహీదాన భుక్తిదానాదికముల్
ఈనేలఁగా కొకఁడే మహా
దానముగల దదియె యభయదానము మిత్రా! ౩౯

మఱియు,—

తే. ఎల్లరమనోరథముల సమృద్ధిఁ గురిసి
యశ్వమేధంబు సేయనే నగునో ఫలము
ఆఫలంబును బూరుషుఁ డఖిలమొందు
శరణుఁజొచ్చినవానిని గరుణఁ గాచి.' ౪౦

కాకి యిట్లనియె-'వీనిని మీరు స్వయముగా చంప నక్కఱలేదు. మఱి ఇతఁడే తన్ను మీకు సమర్పించుకొనున ట్లు మేము చేసెదము.' ఆమాటకు సింహము ఊరకుండెను. అంత కాకి సందు పొంది కపటోపాయమువన్ని కడమవానిని కూర్చుకొని సింహముకడకువచ్చి యిట్లనియె.—'స్వామీ, ఎంతప్రయత్నించినను మేఁతదొరక లేదు. ఈప్రకారము ఏలినవారు పస్తుపడియున్నారు.

కాబట్టి యిపుడు నామాంసమును భక్షింపుఁడు. ఏల యన,—

ఆ. ఎల్ల సంపదలకు నెందును మూలంబు
స్వామియే నరేంద్ర, సత్యముగను
మూలమున్న వృక్షములు ఫలమిచ్చును
జనులు సేయునట్టి జతనములకు.' ౭౮

సింహము 'ఇట్టి పని సేయుటకన్న చచ్చుట మేలు.' అనెను. నక్కయు కాకివలెనే చెప్పినది. 'కూడ'దని సింహము చెప్పినది. 'నా దేహము వలన ప్రాణ మాపుకొనుము స్వామీ,' అని పులి వచించెను. 'ఎప్పటికిని ఆపని సరిగాదు' అని సింహ మనియెను. అంతట నమ్మకముగలిగి చిత్రకర్ణుఁడును కడమవారివలెనే తన దేహము నర్పించుకొనియెను. దానినోట ఆమాట వచ్చియు రాకముందే పులి దానికడుపుం జీల్చి చంపినది. అన్నియు భక్షించినవి. కావున 'ఖలవచనములచే' ఇత్యాదికముం జెప్పితిని.

తర్వాత మఱల బ్రాహ్మణుఁడు పోవుచుండఁగా మూఁడవవంచకుఁడు 'ఎందులకయ్యా, బ్రాహ్మణుఁడా, కుక్కను బుజాన మోసికొని పోవుచున్నావు?' అని యడిగెను. దానిని విని అది కుక్కయే అని నిశ్చయించుకొని మేఁకను వదలివేసి స్నానము చేసి తనయింటికి పోయెను. ఆధూర్తులు మేకను గొనిపోయి భుజించిరి. కావున నేను 'తనవలె సత్యుండని' ఇత్యాదికమును వచించితిని.

'మేఘవర్ణుఁడా ! ఎట్లు నీవు శత్రువులనడుమ చిరకాల మ్ముంటివి ? ఎట్లు వారిని మంచితనము చేసికొంటివి ?' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు. 'దేవా, స్వామి కార్యము కొఱకుగాని, తనప్రయోజనముంబట్టి గాని జనుఁడు ఏమిచేయఁడు ? చూడు,—

ఆ. కాలుచుటకె గాదె వఱలి నింధనమును
జనుఁడు మోచి తెచ్చు జతనమొప్పఁ,
గడుగుచుండి కాదె క త్తిరించెడి నేటి
పోటు వృక్షపాదములను, తేఁడ. ౪౨

అట్లునుం జెప్పుదురు ;—
తే. మూఁపునం గొని పగతుర మోవవలయుఁ
పనివడినయప్డు మనుజుఁడు పదరకుండ,
పాపముదుసలి మండూకపాళి మోచి
పిదప నిశ్శేషముగ మెసవిన దెఱుఁగవె.' ౪౩

'ఆకథయెట్లని రాజడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.

కథ ౮.

వల్లకాటిలో మందవిషమని పా మొకటియుండెను. అది మిక్కిలి ముసలిదైనందున ఆహారము సంపాదించుకొనుట కుం గూడ శక్తిలేనిదై సరస్సుదరిని పడియుండెను. దానిని దూరమునుండి ఒక కప్ప చూచి, 'ఏమి, మేఁత వెదకుకొన

కున్నావు ?' అని యడిగెను. 'పో, పో, ఈనిర్భాగ్యుని వృత్తాంతము నీకేల? అని పాము వచించెను. అంతట కౌతుకము హెచ్చి కప్ప 'చెప్పిననేకాని వల్లపడదు' అనెను. పాము చెప్పినది. 'బ్రహ్మపురమున శ్రోత్రియుం డొకండు కౌండిన్యుం డనునాతండు వసించుచుండెను. అతనికుమారుని ఇంచుమించుగా నిరువదిసంవత్సరముల వయస్సు వానిని సకలసద్గుణసంపన్నుని దుర్దైవవశమున నాక్రూరస్వభావముచేత కఱచితిని. సుశీలుండను పేరి యా కుమారుని చావంగాచూచి కౌండిన్యుండు దుఃఖము పెంపున నేలంబడి దొర్లసాగెను. అంతబ్రహ్మపుర వాసులయిన యతనిబంధువులు అందరును వచ్చి యటం గూర్చుండిరి. అందు కపిలుండనెడి స్నాతకుం డిట్లనియె. 'ఓరి కౌండిన్యుం డా, నీవు మూఢుండవు కావున ఇట్లు ఏడ్చుచున్నావు. విను,—

*ఆ. నిత్యమొత్తుకొను ననిత్యత దాంగన్న
జననిరో యనంగ జాతమాత్రుం,
బెదపం దల్లి దాదివిధమునం గైకొనుం,
గతము కలదె యిందు మృతికి వగవ. ౭౭

తే. ఏడ కేంగిరయా, యామహీరమణులు
సరథసామజ హయబలసైన్యపతులు ?
ఎవ్వరి వియోగమునకుం దానివ్వటిల్లు
సాక్షిగా నిప్పటికిని నీ శ్మశానభూమి. ౭౮

ఆ. కాయమునకుఁ గల దపాయంబు కూడనే,
ఆస్పదంబు తోడనె యాపదలకు,
పాయుకొఱకె చేరఁ బాఱు వస్తువులెల్ల,
పుట్టువెల్లఁ బుడమి గిట్టుకొఱకె. ౪౬

క. ప్రతినిమిషము నీకాయము
క్షితి నొందెడుఁ గానరాక, చదియు నొకత్రుటిన్
* పాతపాతగ మహాతటినీ
శ్రితమై యామఘటి కరఁగి శీర్ణమగుక్రియన్. ౪౭

ఆ. యౌవనంబు, రూపు, జీవితంబు, ధనంబు
ప్రియులతోడి కూడికయును, విభుత,
నశ్వరంబు లౌట నరుల కెల్లరకును ;
ఇందు బుధుఁడు మోహ మొందఁ డెపుడు. ౪౮

ఆ. ఎట్లు కడలియందుఁ గట్టెయుఁ గట్టెయుఁ
గూడుకొనునొ, కూడుకొని యెడయునొ,
అట్లు లోకమందు నఖిలభూతములును
గూడుకొనుట, కూడుకొని యెడయుట. ౪౯

ఆ. ఎట్లు బాటసారి చెట్టునీడ శయించుఁ,
దరలిపోవు, జెట్టుఁ దలఁపడ మఱి,

---

* పా. పాతపాత నామఘటి నదిం
బతితంబై కరఁగి రూపుమాసినభంగిన్.

ఆకరణి సమాగమాపగమంబులు
సంభవించు భూతసంతతులకు. ౫౦

మఱియు,—

క. ఏను గలయు, మేనాయెను,
ఏను విరిసి యెడసి యోనులేనిట డిందన్,
దా నేప్పు నెంతమూఢుఁడో
మానవుఁ డత్యంతశోకమగ్నాత్ముండై. ౫౧

తే. మనసునకుఁ బ్రియమైన సంబంధములను
మనుజుఁ డెన్నింటి నిర్మించుకొనునో, యన్ని
కుందు శంకువు లాతని డెందమందుఁ
గాడుకొని యనయముఁ బిట్టు పీడసేయు. ౫౨

మఱియు,—

తే. ఎవని కే నేకతమున నే నెచట నేని
తనశరీరముతోనె నిత్యంబుగాఁగ
సంవసతి లేకయుండ నేచందముగను
దనకు వేఱగువానితోఁ దనకుఁ గలుగు. ౫౩

క. కూటమియె విప్రయోగము
వాటిల్లెడునంచు బోధపఱుచుం గదరే,
చాటును జన్మమె దాఁటఁగ
వాటపడనియట్టి మిత్తి వచ్చునటంచున్. ౫౪

క. బయలికి రమణీయంబులు
దయితజనముతోడి సంగతంబులు పుడమిన్

ప్రియపడి నిరతంబును ది
న్నయపథ్యములుబలె దారుణఫలంబు లిడుఁ. ౫౫

మఱియు,—

క. వెనుకకు మరలక యేవిధ
మునఁ జనునో నదీప్రవాహములు నిరతంబుఁ,
వెనుకకు మరలక యావడు
వున రేఁబవళ్లు లనువుల జఱ్ఱుకొనుచుఁ జనుఁ. ౫౬

తే. సాధుసంగతి యొకటె సంసారమందు
సుఖసమాస్వాద మిడునది సొంపుమీఱ;
అదియును, వియోగపర్యంత మగుకతమున,
దుఃఖములలోన మొదలిటిదుఃఖ మరయ. ౫౭

క. కారణ మిట్లుండుటచేఁ
గోరరు సాధువులు సాధుగోష్ఠిని మిగులన్,
వారివియోగపుటసిచే
దారితమగు మదికి మందు ధర లేదుగదా! ౫౮

క. ఉత్తమకర్మంబుల నృప
సత్తము లొనరించినారు సగరాదులు మున్
అత్తమిలిన వాకర్మలు
నత్తమిలిరిగారె యామహాపూరుషులున్. ౫౯

తే. బెట్టిదవుదండనలఁ బెట్టునట్టి జమునిఁ
దలఁపఁదలఁప, వివేకి యత్నంబులెల్ల,

వానలో నానినట్టి తోల్బంధనములు
వీడిపోయెడి వడువున, వితథములగు. ౬౦

తే. గర్భమున నేసుసిని దాను గాపురంబు
వీరపూరుషుఁ డెవ్వఁడు చేరు మొదల,
నాక్షణమునుండి నిత్యప్రయాణకలన
నతఁడు దరియుచునుండు నయ్యముని యిల్లు. ౬౧

మఱి సంసారస్వరూపమును విచారించుకొని వారికి ఈదుఃఖము అజ్ఞానవిజృంభణము. చూడు ;—

క. శోకంబునకు వియోగం
బే కతమా ? తనదుజ్ఞానహీనత కాదా ?
ఏకరణి నది దినంబుల
పోకడతోఁ దరుగు వృద్ధిపొందక చెపుమా ! ౬౨

కావున ఈవిషయములో నాత్మస్వరూపము నను సంధింపుము ; శోకమును తరువకుము. ఏలయన ;—

క. ఆయువుపట్టుల భిన్నము
సేయునవి యకాండపాతజిహ్మమ్ములు నా
గాయకపుఁ గుందువ్రేటుల
కై యసమానధియచింతఁగాఁగ నెఱుఁగుమీ.' ౬౩

అంతట ఆమాట విని మేలుకొన్నవాఁడువోలె కౌండిన్యుఁడు లేచి, 'మఱి యిఁక నింటి నరకమున నుండను ; అడవి కేఁగెదను' అని పలికెను. కపిలుఁడు వెండియు నిట్లనియె.—

తే. 'కానవేనియు రాగికిఁ గలుగు దోసఁగు,
గృహమునం దింద్రియముల నిగ్రహము తపము,
రాగమును ద్రుంచి యకలుషారంభుఁడయిన
పురుషసింహున కిల్లె తపోవనంబు. ౬౪

ఏలయన,—

ఆ. ఆశ్రమంబు హేతువగునె ధర్మమునకు?
సమరి యేదో యొక్కయాశ్రమమున,
ధర్మ మాచరింపఁ దగు దుఃఖితుండును,
సకలభూతములకు సమదయుఁడయి. ౬౫

చెప్పిరిగదా;—

ఆ. ప్రాణవృత్తి కొఱకు భోసంబుఁగొనుటయు,
వంశవృద్ధికొఱకు వరసతియును,
నిక్కువంబుకొఱకు వాక్కు నెవ్వరికగు,
వారి కొక్కగడ్డు వసుధ లేదు. ౬౬

అట్లెగదా,—

తే. ఆత్మనది పుణ్యతీర్థ సత్యప్రవాహ
శీలతట కరుణోర్మి శోభిల్ల దేవుడు,
తానమాడుము దానిలో ధర్మపుత్త్ర
జీవునికి నీళ్లచే శుద్ధిచెంద దెంచు. ౬౭

ముఖ్యముగా,—

తే. జన్మమృతి రోగ వేదనా జరలలోన
మునిఁగి ముజ్జిడ్డగుచు సార మనఁగ లేక
మాయగాఁ గ్రమ్మియున్న సంసారకమును
విడుచుకన్నను సౌఖ్యంబు వేఱు లేదు. ౧౮

తే. దుఃఖమే వెండివెండియుఁ దొడరుచుండు
సుఖము మాటయె యర్థంపుఁ జొప్పు లేదు,
దుఃఖమున కేప్రక్రియను జేయుదురొ బదులుగ
నదియె సుఖమని వ్యవహరింపుదురు జనులు.' ౧౯

కౌండిన్యుఁడు 'సరియే' అని ఒప్పుకొనెను. తర్వాత నన్ను ఆబ్రాహ్మణుఁడు శోకార్తుఁడై 'ఇది మొదలుకొని కప్పలకు వాహనమ వగుదువు.' అని శపించెను. అంతట నొక బ్రాహ్మణుఁ డిట్లనియె. 'కపిలుని ఉపదేశమువలన నీహృదయము స్వస్థపడినది. అట్లసుమా, విను,—

తే. సంగ మెల్లవిధములఁ దలంగవలయు,
దానిఁ దలఁగుట మఱి యసాధ్యంబయేని
సజ్జనులతోడమాత్రమే సలుపవలయు,
సజ్జనులసంగ మనఁగ భేషజము నిజము. ౨౦

మఱియు,—

తే. కామము విడవలయు బొత్తిగా నరుండు
దాని బొత్తిగ విడ నసాధ్యంబయేని,

తనకులసతియెడనె తన్నుఁ గొనఁగవలయు,
నామెయే యందులకుఁ బరమౌషధంబు.' ౭౧

దీనిని విని కౌండిన్యుఁడు కపిలోపదేశముచేత శోకాగ్ని చల్లారఁగా యథావిధిగా సన్న్యాసము నాశ్రయించెను. కావున బ్రాహ్మణశాపమువలన కప్పలను మోచుటకు ఇట కనుపెట్టుకొని యున్నాను.' తరువాత ఆకప్పపోయి జాలపాదుఁడనుపేరి కప్పలదొరతో ఆవృత్తాంతమును నివేదించెను. అంతట కప్పలదొర ఆపాము వీఁపుమీఁద నెక్కి కూర్చుండెను. పాము దానిని వీఁపున మోచుచు చిత్రవిచిత్రముగా సంచరించుచుండెను. మఱునాఁడు కదలుటకు శక్తిలేని ఆపామును చూచి కప్పలరాయఁడు ఏమి నేఁడు మెల్లఁగా పోయెదవు?' అని యడిగెను. 'దొరా, తిండి లేనందున సత్తువలేదు,' అని పాము చెప్పెను. 'ఇదే నేను సెలవిచ్చితిని. కప్పలను తినుము.' అని కప్పలరాయఁడు పలికెను. 'మీప్రసాదమును ఇదే నేను గ్రహించితిని.' అని వచించి పాము కప్పలను సొరిదిగా మెసవసాగెను. క్రమముగా చెఱువులో కప్పయే లేక పోఁగా కప్పలరాయనిసైతము తినివేసినది.

కావున 'మూపునంగొని' ఇత్యాదికముం జెప్పితిని. దేవరా, చాలునులెండి ఈపూర్వవృత్తాంతములను చెప్పుకొనుట. ఎల్లవిధములను సంధిచేయఁదగిన వాఁడైన హిరణ్యగర్భునితో సంధి చేయవలసినదని నాయభిప్రా

యము.' రాజిట్లనియె. 'ఏల నీ కీవిచారము? మాకు ఇతఁడు ఓడినాఁడుగదా? మాకొలువులో బ్రదికిన బ్రదుకనీ, కానిచో పోరనీ.' ఇంతలో జంబూద్వీపమునుండి చిలుక వచ్చి యిట్లు నివేదించెను. 'దేవరా, సింహళరాజు సారసుఁడు ఇపుడు వచ్చి మనజంబూద్వీపమును పట్టుకొన్నాఁడు.' అంతట రాజు తత్తఱపడి 'ఏమి! ఏమి!' అని మఱల నడిగెను. చిలుక మొదట చెప్పినదానినే మఱల చెప్పినది. గద్ద యిట్లనియె:—'బళీ, చక్రవమంత్రీ, బళీ, సర్వజ్ఞుఁడా!' రాజనియె; 'వీనిమాట ఉండనీ, పోయి వానిని వేరుతో పెకలించివైచెదను.' దూరదర్శి నవ్వి యిట్లనియె,—

ఆ. వమ్ముగా శరద్ఘనమ్ముకై వడి గర్జ
  సంభ్రమించి ఘనుఁడు సలుపఁ డెపుడు;
  అర్థమేని మఱి యనర్థమేనియుఁ బర
  గోచరంబు గానికొమరు నడుపు. ౭౨

మఱియు,—

క. పలువురపై నొక్కమ్మడి
  బలియుఁడయినఁ బోరుసేయఁ బడయును గీడుగ్,
  బలితపుసర్పము సమయదె
  పలువురువుల పోటులకును బాల్పడి యొకటన్. 23

దేవా, ఇక్కడ సంధి చేసికొనక పోవుట శక్యమా?

అంతట ఇక్కడిరాజు మనకు వెనుకటివైపున మనమీఁదికి శత్రువులను లేపును.

ఆ. ఎవ్వఁ డర్థతత్త్వ మెఱుఁగక క్రోధియై
మూఢుఁ డవల దుఃఖమున మునుంగు,
ముందు వేగిరించి ముంగిసను వధించి
వెనుక నేడ్చినట్టి విప్రుభంగి.' ౭౪

'అది యెట్లు'ని రా జడిగెను. దూరదర్శి చెప్పుచున్నాఁడు:

కథ ౯.

'ఉజ్జయినియందు మాధవుఁడని బ్రాహ్మణుఁ డుండెను. అతనిభార్య బాలెంతరాలు శిశువును చూచుకొనుచుండుమని ఆతనిని ఉంచి స్నానమునకుఁ బోయినది. ఆసమయమున రాజుకడనుండి పార్వణశ్రాద్ధ మిచ్చుటకు ఆబ్రాహ్మణునికి పిలుపు వచ్చినది. అంతట పుట్టుదరిద్రుఁడు బ్రాహ్మణుఁ డిట్లు చింతించెను. 'త్వరగా పోనేని ఎవఁడైనను విని పోయి శ్రాద్ధమును తెచ్చుకొనును. మఱి, బుడుతనికి ఇట కాఁపు ఎవరును లేరు. ఏమి చేయుదును? కానీ, చిరకాలము పెంచిన ఈముంగిసను పిల్లవానికి కాఁపుంచి పోయెదను.' అట్లే చేసి వెడలెను. తర్వాత శిశువుకడకు నల్లత్రాఁచు రాఁగా కాంచి ముంగిస దానిని చంపి తుండెతుండెములుగా కఱచివైచెను. అంతలో వచ్చుచుండిన బ్రాహ్మణునిఁ జూచి ముంగిస నెత్తుటఁ

దొప్పఁదోఁగియున్న ముఖపాదములతో వడిగా పోయి అతనిపాదములం ద్రెళ్లినది. అంతట ఆతీరుననున్న ముంగి సం బరికించి బ్రాహ్మణుఁడు 'నాసుతుని ఇది భక్షించినది' అనితలఁచి దానిని చంపెను. తర్వాత వచ్చి చూచుకోఁగా శిశువు సుఖముగా నుండెను. పాము చంపఁబడియుండెను. అంతట ఉపకారిగదా ముంగిస యని తెలిసికొని బ్రాహ్మణుఁడు కడుంగడు దుఃఖము ననుభవించెను.

ఆ. కామకోపలోభగర్వమోహేర్ష్యల
లోని యాఱురిపులఁగా నెఱుంగు;
బయలిశాత్రవులను భంగించు టేపాటి,
వీని గెలుచువాఁడె విజయి, సుఖియు.' ౭౫

'మంత్రీ, ఇదే నీనిశ్చయమా?' అని రాజడిగెను. మంత్రి వచించెను;—'దేవా, ఇదే, ఏలయన,—

తే. మంచివస్తుల జ్ఞప్తియు, మించుప్రతిభ,
జ్ఞాననిశ్చితి, మంత్రరక్షణము, దృఢత,
పంచగుణి యిది ప్రగడకుఁ బరమధనము;
ఇది గలుగుమంత్రి దొరకిల నెల్లఁ గూర్చు. ౭౬

అట్లే,—

తే. గొబ్బున నొనర్పకు పని, తబ్బిబ్బుపడకు,
ఆపదల కవివిక్తి పరాస్పదంబు;
అరసి చేయునతనిఁ గవ్వ సిరులు దామె,
వాని గుణములమీఁది బల్వాలపునబలె. ౭౭

కావున, దొరా, ఇపుడు నామాట చేయుదువేని, సంధిచేసికొని పొమ్ము; ఏలయన,—

ఆ. సాధ్యమునకు నాల్గు శాస్త్రోదితంబులు
సామముఖములయిన సాధనములు,
లెక్క యొకటె యైన తక్కువాని ఫలంబు
సామమునకె సిద్ధి సంఘటితము.' ౭౮

'ఇది ఎట్లు నెఱవేఱును? అని రాజడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు.—'రాజా, త్వరలో నెఱవేఱును; ఏలయన,—

ఆ. పగులఁ గొట్ట సులువు, తగిలింప వహి లేదు,
మంటికుండఁబోలె గొంటుజనుని;
బగులఁగొట్టఁ గడిఁది, తగిలింప సులభంబు,
స్వర్ణఘటముపోలె సత్పురుషుని. ౭౯

మఱియు,—

*క. తెలియని మనుజుని సుఖముగఁ
దెలుపందగు సుఖతరముగఁ దెలుపఁగవచ్చున్
దెలిసినవానిని, దెలిసియుఁ
దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే. ౮౦

ముఖ్యముగా ఈరాజు ధర్మజ్ఞుఁడు, మంత్రియు సర్వజ్ఞుఁడు. ఈవిషయమును పూర్వము నేను మేఘవర్ణునివలన తెలిసికొంటిని. ఆరాజు చేసినచేతచేతను అదియే స్పష్టపడినది. ఎట్లనఁగా,—

క. అరయుదురు కర్మచేతం
బరోక్షగుణ వృత్తులం బ్రమతు, లందులకై
యరయుదు రా కర్మలనుం,
బరోక్షములనే తదీయఫలములచేతన్.' ౮౧

'ఏల మాటమీఁద మాట. మీయిష్టప్రకారము చేయుఁడు' అని రాజు వచించెను. అంతట గద్దమహామంత్రి 'వారివిషయమై అట్లు ఉచితముగా చేయవలయు' నని చెప్పి కోటలోనికి తరలెను. ఇంతలో వేగు కొక్కెరవచ్చి హిరణ్యగర్భరాజునకు విన్నవించెను. 'దేవా, సంధిచేయుటకు గద్దమహామంత్రి మనకడకు ఇదె వచ్చినాఁడు.' రాజహంసయనియె,—'మంత్రీ, మరల వీరిపక్షము వాఁడెవఁడేని మనయింటం జొచ్చును గావలయును.' సర్వజ్ఞుఁడు నవ్వి ఇట్లనియె.-'దేవరా, ఇప్పుడు ఇందు భయకారణము లేదు. ఏలయన, ఈగద్ద దూరదర్శి చాలదొడ్డమనస్సు గలది. ఒకప్పుడు శంకయే వహింపరు. ఒకప్పుడు అన్నిటను శంకయే. అట్లె కదా,—

సీ. హంస యొక్కఁడు రాత్రియందు సరసిలోనఁ
కుముదషండము వెదకుచుఁ జరించి,
మెండగునక్షత్రమండలీ ప్రతిబింబ
ములఁ గాంచి, వానిం గుముదము లనుచుఁ,
దినఁ బూని కావని తెలిసి రే నిట్టుగాఁ
బుచ్చి, పిమ్మటఁ బవల్ మెచ్చుగాఁగ

బెక్కులు కుముదముల్ పిక్కటిల్లఁగఁ గని
  సత్సంతతుల ప్రతిచ్ఛాయ లనుచుఁ
తే. తినక నిట్టుగనే పవలిని గడపెను;
  ఇట్టిదే యిది, మోసపోయిన మనుజులు
  నిజము ప్రత్యక్షముగ మ్రోల నెగడుచున్న
  మోసమని యెంచి మోసమె పొందుచుంద్రు. ౮౨

తే. మనసు ఖలులవలనఁ జెడ్డమానవుండు
  సాధువులఁగూడ నమ్మక సంచరించు,
  పాయసముచేతఁ గాలినబాలకుండు
  పెరుఁగుఁగూడ నూఁదుకొని త్రావెడు విధమున. ౮౩

కావున, దేవా, మనశక్తికి తగినట్లు ఆతనిని సత్కరించుటకు రతనంపుఁగానుకలు లోనగుసామగ్రిని సిద్ధము సేయింపుము.' అట్లే జరుగఁగా జక్కవమంత్రి ఎదురువోయి గద్దమంత్రిని కోటదర్వాజానుండి గౌరవించి తెచ్చి రాజదర్శనము సేయించెను. గద్దమంత్రియు తనకొసఁగిన యాసనమందుఁ గూర్చుండెను. జక్కవమంత్రి, 'సమస్తము మీ స్వాధీనము. మీయిచ్చవొప్పున ఈరాజ్యమును మీరనుభవింపుడు' అనివచించెను. 'అదేసరి' అని రాజహంస పలికెను. దూరదర్శి యిట్లనియె.–'ఇది యిట్లే. అయినను ఇప్పుడు ఎక్కువగా విస్తరించుటవలన ప్రయోజనము లేదు. ఎందులకనఁగా,—

తే. పిసిఁడి నర్థముచేతఁ గైవసము సేయు,
కోపఘూర్ణితు నంజలికూర్పుచేత,
బాలిశుఁ దదీయచిత్తానువర్తనమునఁ,
దత్త్వకథనంబుచేఁ బండితప్రకాండు. ౧౪

మఱియు,—

తే. మిత్త్రుని హరింపు సద్భావమృదుతచేత,
బంధుజనమును సత్యసంభ్రమముచేత,
స్త్రీని భృత్యుల దానసత్క్రియలచేత,
కడమవారల దాక్షిణ్యగరిమచేత. ౧౫

కావున మహాప్రతాపుఁడైన చిత్రవర్ణరాజును ఇపుడు సంధిచేసికొని పంపుఁడు.' 'సంధి ఎట్లు చేయవలయునో దానినికూడ చెప్పుఁడు,' అని జక్కవ అడిగెను. గద్ద చెప్పుచున్నది: 'వినుండు. చెప్పెదను,—

క. బలవంతుఁడెత్తివచ్చిన
బలహీనుఁడు కాలహరణ పరతంత్రవిధిన్
తలఁగ నగునిడుమ, యట్లది
తలఁగని పక్షమున సంధిఁ దనరుపవలయున్. ౧౬

సీ. ఒప్పుఁ గపాలంబు, నుపహారమును, మఱి
సంతానమును బైని సంగతంబు,
పైనుపన్యాసంబు, ప్రతికారసంయోగ
పురుషాంతరాదృష్టనరము లనఁగ

ఆదిష్టమల్లె యాత్మాదిష్టము నుపగ్ర
　　హంబునల్లె పరిక్రయం బనంగఁ
బ్రోచ్ఛిన్నమును బరభూషణంబును బైని
　　స్కంధోపనేయంబు సరిఁ బదాఱు;
తే. వీనితత్త్వం బెఱింగిన విభుఁడు మర్త్య
భువనదేవేంద్రుఁ డన భోగములు భుజించుఁ
గానఁ దెలిపెద వీనిలక్షణము లెల్ల
నీతివిద్యావిశారదాఖ్యాత సరణి. ౧౭

సీ. సమఫలంబు కపాలసంధియౌ, నుపహార
　　మీవిచే నగుఁ, గన్య నిచ్చునెడల
సంతానకంబగు, జరుగు నెయ్యది మైత్రి
　　నదిసంగతంబన నలరుచుండు,
ఆజీవితావధి యర్థఫలంబులు
　　సమములై యొగ్గుల సంపదలను
భేద మేఁదుచుఁ బ్రీతిఁ బెరయును సంగత
　　కంబు కాంచనసామ్యకారణమున
తే. పర్వసంధులయందు శ్రేష్ఠం బగుటను
కాంచన మనెడుపేర విఖ్యాతమయ్యె;
ద్రవ్యశుద్ధిని గూర్చి కృతంబు సంధి
సంస్తుతమగు నుపన్యాససంజ్ఞచేత. ౧౮

సీ. ఉపకృతి చేసితి నొకతఁడే నితనికి
　　నితఁడు నాకును నుపకృతి యొనర్చు,

నను కారణమునఁ జేయునని ప్రతీకార
సంజ్ఞకం బగునట్టి సంధిసుమ్మి,
ఏనుఁ జేసెద నిప్పు డితనికి నుపకృతి
నిఁకమీఁదఁ జేసెడి నితఁడు నాకు
నని రామభాస్కరతనయులకుం బోలె
నదియుఁ బ్రతీకారమగు నొకయెడ,
తే. పూని యేకార్థమగుక్రియఁ బొందుగాఁగ
నొడఁబడుట దానిపాటిసంయోగసంధి,
నాకొఱకె పోరవలయు నీనాబలమ్ము
లనుచు జీతంబిడుట పురుషాంతరంబు. ౮౯

సీ. ఈ వొకఁడవె సేయు మీపని నాకని
రిపుఁ డిడఁ బఱ మదృష్టపురుషంబు,
తననాటఁ బాలు జీతము వెట్టి బలియగు
ద్వేషితోఁ జేయ నాదిష్టసంధి,
తానె యొడంబడఁ దనదండుతోడ నా
త్మాదిష్టసంధినా నది చెలంగు,
అఖిలంబుఁ బ్రాణరక్షార్థ మొసంగెడు
సంధి యుపగ్రహాసంజ్ఞకంబు,
తే. బండరువునందు నాలవభాగమైన
నర్థమైనను సకలంబునైన నిచ్చి
కడమ కాపాడుకొనుటకుఁ గాఁగ జేయు
సంధి బుధులు పరిక్రమసంధి యండ్రు. ౯౦

సీ. సారవంతములైన క్షమల నిచ్చుటచేత
నగుసంధి యుచ్ఛిన్నమనఁగ నొప్పు;
భూమియందుఁ బుట్టిన సకలఫలితమియ్యఁ
బరిభూషణంబని పరగు సంధి;
స్కంధోపనేయ మన్సంధిచే నొక్కొక్క-
సైనికుఁడును మితమైనపంట
మూఁపుపై నిడుకొని మోవనయ్యెడుపాటి
కైకొనవచ్చును గడపల నిది,
తే. ఒండొరుల కుపకృతి చేఁత, నిండుమైత్రి,
వియ్యమున, నుపహారాన నొయ్యనాగె
సంధు లొప్పారునందురు శాస్త్రవిదులు;
నామతమ్మున నుపహార నామమొకటె. ౯౧

తే. మైత్ర్యసంధిని విడి కడమ సకలమును
నుపకృతివిభేదములె, యభియోగిబలము
గలయతఁడు గాన మరలఁడు ఫలము లేక,
కాన నుపహార మొక్కఁడె కలుగుసంధి.' ౯౨

రా జడిగెను;-'మీరు మహాపండితులరు; ఇప్పుడు మే మేమి సేయవలయును ఉపదేశింపుఁడు.' దూరదర్శి యిట్లనియె-'సీ! ఏమి యిట్లు పలికెదరు!

క. కాయము నేఁడో రేపో
పోవెడి, నాథులను రోగముల శోకములన్;

ఈయస్థిరపు స్సుగ్గకు
నై యేమానవుఁడు సేయు నఘముం జెపుమా. ౯౩

ఆ. నీటిలోని చంద్రునీడయుఁ బోలెను
దరళతరము జీవితమని యెఱిఁగి,
బుద్ధిమంతుఁ డెపుడు పొనరింపవలయును
మంచిపనులనే సమంచితముగ. ౯౪

తే. వట్టి మృగతృష్ణవలె క్షణభంగురంబు
మాయసంసార మిది; యిది మాయుకొఱకు
సజ్జనులతోడి సంగతి సలుపరయ్య,
పొందుదురు దానిచే ధర్మమును సుఖంబు. ౯౫

కావున నాకు సమ్మతముగా నిట్లు చేయుఁడు. ఏలయన,—

*క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్యమును నిరుగడలన్
దుల నిడి తూఁచిన, సత్యము
వలనను ములుసూపు గౌరవంబున పేర్మిన్. ౯౬

కావున ఈరాజులిరువురును సత్యమనుపేరి దివ్య ప్రమాణముం గావించి కాంచనసంజ్ఞ చేయుదురుగాక.' 'అట్లే అగుఁగాక' యని సర్వజ్ఞుఁ డనియెను. అంతట వస్త్రాదికములు కట్నమిచ్చి దూరదర్శిమంత్రిని పూజించిరి. అతఁడు సంతసించి జక్కవను తోడ్కొని నెమలి

రాజుకడకుఁ బోయెను. అచ్చట గద్దమాటప్రకారము చిత్రవర్ణ రాజు బహుమానము లిచ్చి సర్వజ్ఞుని సత్కరించి సంభాషించి, ఆసంధికి అంగీకరించి రాజహంసకడకు పంపెను. దూరదర్శి యనియె.- 'దేవా, మనకోరిక నెఱవేరినది. ఇఁకను మన తావలమునకు వింధ్యాద్రికి తరలుదము.' అంతట అందఱును తమ తావు చేరి మనస్సునందు కోరుకొన్న ఫలమును అనుభవించిరి'.

అని చెప్పి విష్ణుశర్మ 'ఇంక నేమి చెప్పుదును, చెప్పుఁడు.' అని యడిగెను. రాజపుత్త్రులు పలికిరి. 'అయ్యా, నీయనుగ్రహంబునంజేసి సమస్తరాజ్య వ్యవహారస్వరూపము నెఱింగితిమి. అందువలన మేము సుఖము గలవారమై యున్నాము.' విష్ణుశర్మ ఇట్లనియె. 'అట్లయినను ఇదియు నగునుఁగాక,—

చ. సకలనృపుల్ జయుల్ సతము
సంధివశంబున సంతసిల్లుతన్
సుకృతులు నిర్విపత్తులయి
చొక్కపుఁగీర్తి ధరిత్రి నించుతన్,
వికసిలుఁ గావుతన్ హృదిని వేశ్య
తలోదరివోలె నీతియున్,
ప్రకటమహోత్సవ ప్రకర
భాసురవక్త్రులుగాత మంత్రులున్. ౯౭

సీ. ఎంతకాలము పొల్చు నిందుశేఖరుఁ డద్రి
కన్యాప్రణయపేటకంబు గాఁగ,
ఎంతకాలము పొల్చు నిందిర హరియెద
గ్రొమ్మబ్బున మెఱుంగుఁ గొమ్మగాఁగ,
ఎంతకాలము వాణి యెసఁగును బ్రహ్మశి
రశ్చంద్రశాలా పురంధ్రి గాఁగ
ఎంతకాలము భానుఁ డెసఁగు సురాలయ
వలభీవిటంక కుంభంబు గాఁగ,

తే. అంతకాలంబు నారాయణార్యరచిత
సారవాణీ హితోపదేశంబుతోడ
రహిని వేదము వేంకటరాయశాస్త్రి
విరచిత తదాంధ్రమిదియును వెలయుఁగాత. ౯౦

సంధి సమాప్తము

ఆంధ్ర హితోపదేశ చంపువు ముగిసినది.



PRINTED AT THE INDIA PRINTING WORKS, MYLAPORE, MADRAS.

# అనుబంధము (అ) మిత్రలాభము

[సంస్కృత హితోపదేశములోని యీ క్రింది కథకు
మాఱుగా పంచతంత్రములోని శాండిలీకథ
యీ తెనుంగుఁగబ్బమునం జేర్పఁబడినది.—]

(చూ. పుట ౫౩)

తే. కవుఁగిటను జిక్కఁగ్రుచ్చి యాకస్మికముగఁ
గూఁకటిం బట్టి తివిచి యాగుబ్బగాఁగ
ముదుకభర్తకు జవరాలు ముద్దు లిడెడి,
నిందు నేదియో బల మైనహేతు వుండు. ౨౦౦

కథ ౩.

చూడాకర్ణుఁడు ఆకథ చెప్పుమని యడిగెను. వీణాకర్ణుఁడు చెప్పసాగెను.—'గౌడదేశములో కౌశాంబియని పట్టణము గలదు. అందు చందనదాసుఁడను వైశ్యుఁడు, మహాధనము కలవాఁడు, ఉండెను. అతఁడు మునలితనములో కామప్రేరితమానసుఁడై ధనగర్వముచేత లీలావతి యను వైశ్యకన్యను వివాహమాడెను. ఆమెయు యౌవన మొంది మదనుని గెలుపు జెండావోలె వెలుంగుచుండెను; ఆముది మగనివలన ఆమెకు సంతుష్టి కలుగదాయెను. ఏల యనఁగా,—

ఆ. ఎండఁబడినవారి కినునియం దెట్టులో,
యబ్జునందు శీతహాతులు నెట్లొ,
మూఁడుకాళ్లమగని మొగమునం దట్టులే
వెలఁదుకలమనస్సు వేడ్కఁ గొనదు. ౨౦౧

మఱియు,—

క. నరునకు శిరోరుహాంబులు
నరసినపిమ్మటను గామనత్వం బిస్సీ!
పరపురుషసక్తచిత్తలు
తరుణులు గనుఁగొందు రౌషధంబుగ ముదుకన్.

ఆముసలిమగనికి ఆతరుణియందు మితిలేనియనురాగ
ముండెను. ఏలన,—

ఆ. ధన మతిప్రియము సదా యెల్లజనులకు,
ధనముకన్న జీవితము ప్రియంబు,
జీవితమునకన్నఁ జిన్నిప్రాయపుటాలు
ప్రియసుమీ యెపుడును వృద్ధపతికి. ౨౦౩

మఱి యాలీలావతి యౌవనమదముచేత కులమర్యాద
నుల్లంఘించి ఎవఁడో ఒకవైశ్యకుమారుని మీఁద మరులు
కొనెను. ఏలయన,—

సీ. ఇచ్ఛవచ్చినయట్లు లెసఁగుచు నుండుట,
పుట్టినయింటనే నట్టుకొనుట,
యాత్రోత్సవంబులయందుఁ జొత్తెంచుట,
పురుషులతో గోష్ఠిఁ బొందుటయును,

పరదేశమందు నివాసంబు సేఁతయు,
నియమంబులేకయే నెగడుచుంట,
జీవనోపాయంబు క్షీణతఁ జెందుట,
చెడిపలతోఁ గూడఁ జేరుటయును,

తే. మగనివార్ధక, మీసుచే మండుటయును,
పకపకనగవు, పరిహాసభాషణంబు,
అనఁగఁ బంద్రెండుదోషంబు లంగనలకు
శీలనాశకము లని పచింత్రు బుధులు. ౨౦౪

మఱియు,—

క. త్రాగుడు, తిరుగుడు, దుష్టుల
యోగము, నిజభర్తతో వియోగమ్మును, న
న్యాగారవాసనిద్రలు,
బాగాఱుచు స్త్రీల కంచుఁ బల్కుదు రార్యుల్.

ఆ. తండ్రిగాచుఁ గన్నెతనమునఁ, బిమ్మట
భర్త గాచు యువతిభావమందు,
స్థవిరభావమందుఁ దనయులు గాతురు,
చెల్ల దనఘ, యెపుడు స్త్రీకి స్వేచ్ఛ. ౨౦౫

తే. తల్లితోఁ, దోడఁబుట్టిన దానితోడఁ,
గూఁతుతో నైనఁ, గూర్చుంట గూడ దొంటి;
నింద్రియశ్రేణి బల్లిదం బెంతయేని
కర్షణముసేయు విద్వత్ప్రకాండు నైన. ౨౦౬

ఒకప్పుడు ఆలీలావతి రత్నాలవెలుఁగులచే పలువన్నెలు దువాళించు మంచముమీఁద ఆవైశ్యకుమారునితో సుఖముగా కూర్చుండి నమ్మకముగా సల్లాపించుచుండి, తెలియకుండ వచ్చినమగనింగాంచి తటాలున లేచి జుట్టుపట్టి బిగ్గఁగౌఁగిలించి ముద్దుగొన్నది. ఈసందులో మిండఁడును పాఱిపోయెను. చెప్పిరిగదా ;—

ఆ. దైత్యగురుఁడు సదివెఁ దా నేమి శాస్త్రంబు,
దేవతాగురుండు దేనిఁ జదివె,
అట్టిశాస్త్ర మెల్లఁ బుట్టులోనే బ్రహ్మ
స్త్రీలబుద్ధిలోఁ బ్రతిష్ఠచేసె. ౨౦౮

---

## అనుబంధము. (ఆ) మిత్రలాభము

[సంస్కృతహితోపదేశములోని యీక్రింది భాగము ౧౮౯ పద్యము తర్వాత ఈ తెనుంగుఁ గబ్బమునం ద్యజింపఁబడినది. చూ. పుట ౭౯]

మిత్రమా, లఘుపతనకా, నీయీ యుపదేశముచేత ఇట్లగును ;- ఎట్లనఁగా,—

ఆ. బేరిసుతుఁడు తనదుప్రియ గబ్బిగుబ్బల
రాసుతుండు పట్టురహిని గాంచి
ఆత్మ నెల్లకాల మలఁదురినవితానఁ
దెగనిదుఃఖమీతావు తెచ్చికొందు. ౨౦౯

ఆకథ చెప్పుమని వారిరువురును అడిగిరి. హిరణ్యాకుఁడు చెప్పసాగెను.- కాన్యకుబ్జదేశమందు వీరసేనుఁడని రాజుండెను. ఆతఁడు వీరపురమను పట్టణమునకు తుంగబలుఁడను రాజకుమారుని యువరాజుం జేసెను. అతఁడు మహాధనికుఁడు, వయసువాఁడు; ఒకనాఁడు తననగరములో సంచరించుచు మిక్కుటమయిన నిండు జవ్వనమున నున్నదానిని లావణ్యవతి యనుదానిని ఒకవైశ్యకుమారుని భార్యను గాంచెను. అంతట మదనునిచేత మదికలఁగి తన మేడకుంబోయి ఆజవరాలికై దూతి నంపెను. ఏలన;—

తే. సాధుమార్గంబు, నింద్రియశాసనంబు,
త్రప, వినయ, ముందు నరున కెందాఁక నన్న?
బొమ్మవిలు ద్రోయఁ జెవిదాఁకి నెమ్మెలాంద్ర
కృష్ణపక్ష్మదృగిషు వెడ గీఱుఁదాఁక. ౨౧౦

లావణ్యవతియు నాతనిం గాంచినక్షణమునుండి మదనుని కోలల పోటులకు గుండియలు తూట్లువోయి ఆతనియందే మనస్సును నిలిపి సంతాపపడుచుండెను.

అంతట దూతిమాటను విని లావణ్యవతియిట్లనియె:- "నేను పతివ్రతను, జుమా, పరపురుషునిఁ దాఁకనయినఁ దాఁకను జుమా, ఏలయన,—

క. ఇలు దక్షతతోఁ దీర్చుచుఁ,
గులముఁ వెలయించుసుతులఁ గూఁతులఁ గల దే

బలురక్తిఁ బతికిఁ గూర్చుచు
నలరుపతివ్రతను భార్య యనఁగాఁ జెల్లున్. ౨౧౧

మఱియు,—

క. పతికిం దుష్టి యొసంగని
సతకరి నా లనఁగఁ జనదు; మహిళామణిచేఁ
బతి సంతుష్టుం డైనన్
ధృతితో దీవింత్రు వారి దేవతలెల్లన్. ౨౧౨

ఆ. కోకిలలకు రూపు కొమరుమీఱుస్వరంబు,
తాపసులకు రూపు దమశమములు,
పడఁతులకును రూపు పతిపరాయణవృత్తి,
రూపహీనులకును రూపు విద్య. ౨౧౩

ఆ. ఎవతెనడతఁ దగవు, ధవుఁ డుగ్గడించునో
తరుణులందు నామె ధన్యురాలు.
అగ్నిసాక్షికముగ హస్తంబు గైకొన్న
పతియె శరణు సుమ్ము సతుల కెందు. ౨౧౪

కావున నాప్రాణేశ్వరుఁడు ఏమేమాజ్ఞాపించునో నేను దానినే ఆలోచింపక చేసెదను.' 'ఈమాట నిశ్చయమా?' అని దూతియడిగెను. 'నిశ్చయము' అని లావణ్యవతి యుత్తరము చెప్పెను. వెంటనే దూతిపోయి ఆవృత్తాంతము నెల్ల తుంగబలునికి తెలియఁజేసెను. దానిని విని తుంగబలుఁడు 'దానిమగఁడే తెచ్చి నాకిచ్చుట యనునది యెట్లు

సాధ్యము?' అని యడిగెను. 'అందులకు ఉపాయము చేయవలయును.'

[ఇదిమొదలుగా మూలగ్రంథములో కర్పూరతిలక కథ-యున్నది. దానియనంతరము మరల లావణ్యావతీ కథ.—

కర్పూరతిలక కథ ఇట్లు అవతరింపఁబడినది. 'ఆ కథను చెప్పు'మని రాజపుత్రుఁ డడిగెను. కుట్టని చెప్పుచున్నది.–'బ్రహ్మారణ్యమందు', ఇత్యాది.]

తర్వాత కుంటెనకత్తెయొక్క ఉపదేశము మీఁద ఆ రాజకుమారుఁడు ఆవైశ్యకుమారుని తనకొలువులోనుంచుకొనెను; క్రమక్రమముగా సమస్తమైన నమ్మకపుఁ బనులలోను నియమించెను. ఒకనాఁడు రాజకుమారుఁడు స్నానము చేసి మైపూఁతయలంది సింగారపునగలు ధరించి యిట్లనియె:—'నేను ఒకనెలవరకు గౌరీవ్రతము చేసెదను; అందులకై నేఁటినుండి ప్రతిరాత్రియు కులకన్య నొకతెను, జవరాలిని. తెచ్చి నాకప్పగింపుము. ఆమెను నేను విధిప్రకారము పూజించెదను.' అంతట చారుదత్తుఁడను పేరి యా వైశ్యకుమారుఁడు ఆవిధమయిన జవరాలిని తెచ్చి ఒప్పగించుచుండెను; ఏమిచేయునో యని చాటునుండి చూచుచుండెను. తుంగబలుఁడు ఆతరుణిని తాఁకకయే దూరమునుండి వస్త్రాలంకార గంధ చందనములు సమర్పించి

తోడిచ్చి యింటికి పంపుచుండెను. దానిం గని వైశ్య కుమారుఁడు నమ్మకము పొందినవాఁడై లోభము మనస్సును లాఁగఁగా తనభార్యను విలాసవంతురాలిని తెచ్చి యిచ్చెను. తుంగబలుఁడు ఆమెను తనమనోదయితయగు లావణ్యవతినిగా నెఱింగి తొట్రుపాటుతో లేచి బిగ్గఁగవుంగిలించి ఆనందముచే కన్నులు మూసికొని మంచముపై దానితోఁగూడ క్రీడించెను. దానిం గని వైశ్యకుమారుఁడు చిత్తరుబొమ్మవలె ఊచ్చవడి మిక్కిలి దుఃఖపడెను. కావున 'బేరిసుతుఁడు' ఇత్యాదికమును చెప్పితిని, నీకును అట్లే అగునని.



# శోధనము

| పుట. | పద్యము శ్లోక పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 17 | ధసము | ధనము. |
| 2 | ౮ | దళపట్టె | దళంబట్టె |
| 10 | ౮౧ | గోవలు | గోపలు |
| 14 | ౯ | జమలగు | జక్కలగు |
| 20 | 4 | వ్రతి | ప్రతి |
| 37 | 12 | పెట్టినది | పెట్టినవి. |
| 57 | 4 | కొట్టుమండెపు | కొట్టుమండెను |
| 77 | 8 | సనాఫముఁ | సనాథముఁ |
| 78 | 22 | యిట్లయె | యిట్లనియె |
| 83 | ౧౯ | నాఘులు | నాథులు |
| ,, | ,, | శ్రీయుతంతజ | శ్రీయుతుపజ |
| 95 | 33 | రచిఁచి | రచించి |
| 106 | ౬౫ | పలుకు,జనులు | పలుకుజనులు |
| 111 | 24 | నగపఱమచు | నగపఱుమచు |
| 116 | 7 | చేయనో | చేయుమో |
| 118 | 15 | దొరికినది | దొరకినది |
| 125 | 17 | నాతోయిదె | నాతో ఇదె |
| 142 | ౧౮౫ | త్తరంగ | త్తరంగు |
| 149 | ౧౬3 | న్యాయంబన్యా | న్యాయ్యంబన్యా |
| 167 | ౧౯ | వెరగుపడ | వెఱగుపడ |
| 168 | 11 | సిద్ధపఱపుము | సిద్ధపఱుపుము |
| 175 | 12 | ఏమిచేయ<br>వలయును | ఏమిచేయవలయు<br>నోదానినిఏలినవా<br>రు చేయవలయును |
| ,, | 3౫ | గుఱతగు | గుఱుతగు |
| 176 | 3౬ | గాత్రిచేష్ట | గాత్రిచేష్ట— |
| 179 | ౮౮ | మందఱకుకు | మందఱకును |
| 186 | ౬౫ | ప్రియుక్తచే | ప్రియుక్తిచే |

